CI





మార్చి 26: సుందరయ్య విజ్ఞాన కేంద్రం సాహిత్యశాల వేదికపై బి.ఎస్. రాములు, ఓల్గా, తెలకపల్లి రవి, సింగమనేని, శివారెడ్డి, జ్వాలాముఖి, అద్దేపల్లి, శిఖామణి, జిలుకర, హిమజ్వాల





ముఖాముఖిలో మాట్లాడుతున్న కె.బి. లక్ష్మి, సలీం, కళ్యాణరావు, ముక్తవరం పార్థసారథి



ఫొటో ఎగ్జిబిషన్ ప్రారంభిస్తున్న సాంబిరెడ్డి



సింగమనేని ప్రారంభోపన్యాసం



డా. అట్లూరి మురళి స్వాగతం



కె. శివారెడ్డి



మార్చి 27 : భాష సెషన్‌లో మాట్లాడుతున్న కేతు, వేదికపై కె.కె.ఆర్, డి. చంద్రశేఖర్‌రెడ్డి, చేరా, రవి



కవి, గాయకుడు గోరటి వెంకన్న గీతాలాపన. పక్కన పి. రాములు, బి.ఎస్. రాములు

సాహిత్య
ప్రస్థానం
ఏప్రిల్ - జూన్ 2005
సంపుటి :3 సంచిక : 11

PRSVM02A116

## మరింత ముందుకు...

హైదరాబాదు, కర్నూలు సాహిత్య శాలలు జయప్రదంగా ముగియడం సాహితీ స్రవంతి ఆశిస్తున్న లక్ష్యాల సాధనలో మరో ముందడుగు. సహృదయ సాహితీ మిత్రులందరూ వీటిని స్వాగతించారు: సంతోషించారు. లౌకిక ప్రగతిశీల సాహిత్యకారులు విశాల ప్రాతిపదికన అభిప్రాయాలు అనుభవాలు కలబోసుకోవడానికి ఇది చక్కటి వేదిక అని అభినందించారు. అందరి చేయూత వల్లనే ఈ బృహత్ సాహిత్య కార్యక్రమాలు ఫలప్రదంగా జరిగాయి. వారందరికీ ధన్యవాదాలు చెప్పడం మా బాధ్యత. ఈ ఉత్సాహంతో తాము కూడా సాహిత్య శాల వంటి కార్యక్రమాలు జరుపుతామని చాలా ప్రతిపాదనలు వస్తున్నాయి. వాటిని పరిశీలించి అవసరాన్ని అవకాశాన్ని బట్టి విభిన్న కార్యక్రమాలు నిర్వహిస్తూ ముందుకు సాగాలని సాహితీ స్రవంతి సంకల్పిస్తోంది.

❖ ❖ ❖

ఈ కార్యక్రమాలకు మీడియా కూడా బాగా తోడ్పాటు నిచ్చినందుకు కృతజ్ఞతలు. అంతేగాకుండా గత మూడు మాసాలలోనూ సాహిత్యశాల సంబంధిత అంశాలపై పత్రికలలో విస్తారమైన చర్చ జరిగింది. అభినందనలతో పాటు అపార్థాలతో కూడిన కొన్ని వ్యాఖ్యలు కూడా వెలువడ్డాయి. వాటన్నిటిపై వాదోపవాదాల కన్నా విశాల దృష్టితో అర్థవంతమైన ఆచరణతో ముందుకు సాగడం మంచిదని సాహితీ స్రవంతి భావన.

❖ ❖ ❖

సహజంగానే ఈ సంచికలో సాహిత్యశాలకు సంబంధించిన వివిధ నివేదికలు, చిత్రాలు వగైరా వున్నాయి. భవిష్యత్తులో ఆయా వక్తల ప్రసంగాలు వ్యాసాలుగా సరిచూసి ప్రచురిస్తాము. ఈ కార్యక్రమాలకు హాజరైనవారు వాస్తవిక కోణం నుంచి తమ సూచనలు, అనుభవాలు రాస్తే వీలు వెంట ప్రచురించగలము.

❖ ❖ ❖

ఇటీవల మృతి చెందిన అభ్యుదయ సాహిత్యోద్యమ ప్రముఖులు బొల్లిముంత శివరామకృష్ణగారికి ప్రస్థానం జోహార్లర్పిస్తోంది.

ముఖచిత్రం : మోహన్

(అందరిని ఆకర్షించిన సాహిత్యశాల బ్యాక్‌డ్రాప్)

3వ కవర్ : కర్నూలు సాహిత్యశాలపై వివిధ పత్రికల ప్రతిస్పందన

లోపలి చిత్రాలు : అక్బర్, పాండు, శేఖర్

## ఈ సంచికలో...



సంపాదకుడు
తెలకపల్లిరవి

ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య

మేనేజర్
కె. లక్ష్మయ్య

ఎడిటోరియల్ బోర్డ్ అడ్రస్ :
సాహిత్య ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్లు : 27660013, 27635136

# ఆవాహనం

ఈగ హనుమాన్

బొడ్డుమల్లె కొమ్మొకటి పర్రుమని రాల్తుంది
పక్కింట్లో పాపాయి గుక్కపెట్టి ఏడుస్తుంది
అటక మీద పడేసిన అచ్చు ఫణెల సందుల్లోంచి
పడమటి సూర్యుని కిరణాలు ఏటవాలుగా వచ్చి గుచ్చుకుంటున్నై-

అమావాస్య రోజు
ఆశల చీకట్లు ఔంబురంగులా క్రమ్ముకుంటున్నై
హృదయం ఖాళీ అయ్యింది
నాడి 'నాడె' కొట్టుకుంటున్నట్లు కొట్టుకుంటుంది
మోసం చేసిన పాలిస్టర్ మీటరు తాడు
లడీల మీద నిలబడి పడిపడి నవ్వుతుంది -

ఊరంతా సంధ్య పనుల్లో...

నీరింకిన కనుకొలుకుల్లో మెరుస్తూ రెండు ఒంటరి కన్నీటి బొట్లు

'ఓంబత్తి' కర్గి పద్తున్నట్లు
అంతకు మించి సంపాదించిందేమీ లేదు
తన మీద ఎవరికీ ఆశలేదు
ఎవరికీ అవసరమూ లేదు
ఒక నిర్ణయం-

***

ఇప్పుడతను అందరిలోలో జీవిస్తున్నాడు
రాలిపడ్డ రక్తం బొట్టు భగ్గున మండుతుంది
చైతన్య జ్వాలలు. కిరిమింజలా అంతటా వ్యాపించాలి
ఆగిపోయిన శ్వాసలు ఆగమ శాస్త్రాలు లిఖించాలి
ఆగామికాలాన్ని
సిరిసిల్ల గుడిగంటకు ఉరేసి తీరాలి-

రాట్నమై తిరుగుతున్నా
దారీ తెన్నులేని
ఎనుబది వసంతాలు - అన్నీ శిశిరాలే

కండెలాంటి వాడు ఉత్తబెండై పోయెగదరా!
విధి శాపమై
పేదవాడి ప్రేవులు కోస్తూనే ఉంది
ఎంత చేసినా
ఆకలి బంగాళాఖాతం : బెత్తెడు ఖాళీ అస్తమానూ...

బతుకంతా గంజి వాసన

ఎన్ని కలలు కన్నా
కలలంత ఎత్తుకు ఎదగలేక
అంత దూరం కాళ్లను చాచలేక
'సట్టర్'లా స్థిరీకరించబడి
ఆసుపోసుకుంటూనే ఉన్నాడు

అలలా సాగే దోనుగ శీర్షాసనమేసింది
పాకోల్లకు పాకురు పట్టింది
సరి సట్టుబండలయ్యింది
చూపు గురి తప్పుతుంది
'పింజర' ఊర పిచుకల గూడై పోయింది
రెక్కాడితేనే నాల్గు మెతుకులు ప్రసాదం

పెళ్ళాం బోసి శాపాలు
ఆమె చేతికి వేళ్ళు లేవు
అన్నీ 'గణేష్' బీడీలే -
పాపల మీద పొరల రూపం
కళ్ళెదుట మెరుస్తున్న చీకటి దీపం
కడుపేమో ఎండిన పండుటాకు
ల్యాకబద్దల రొంబొచ్చెలో
రామచిలుక కునుకు తీస్తుంది -

ఎప్పుడో చచ్చిన
తీల్లీ. చెల్లీ. కొడుకుల దెయ్యాల్లా కొంప -

***

(సిరిసిల్లలో గుడిగంటకు ఉరేస్కుని చనిపోయిన చేనేత కార్మికున్ని సజల నేత్రాలతో స్మరిస్తూ)

# హైకులు

వి.ఎస్.ఎస్. మూర్తి

వీధిలో దీపం
చీకటి రాజ్యానికి
ప్రత్యక్ష సాక్షి...

చిమ్మచీకటి
తోడుగా కీచురాయి
పలకరింపు...

తెల్లవారింది
వెలుతురు పులుగు
రెక్కవిప్పింది...

సూర్యుడొస్తుంటే
అలల వలెకాంతి
లోకంమీదుకు..

ఊరిబద్ధకం
విదల్చిలేబ్రతోంది
సైరనుకోడి...

నక్షత్ర కాంతి
ఎప్పుడు గ్రహించామో
మిణుగురులు...

పూలు రాలాయి
నేలపై నక్షత్రాలు
భూచిత్రాలుగా..

తియ్యతేనియ
తుమ్మెదగానానికి
పూల సన్మానం...

రాలిన పూలు
రంగులు, పరిమళం
కరిగిపోతూ...

మెరుస్తున్నాయి
తోటలో మొక్కలకు
రేపటి పూలు...

మధుపానికి
ఆహ్వానం పలుకుతూ
ఆకుల మధ్య...

సుమహృదయం
లాలిస్తూ మురిపెంగా
మధుపగీతం...

# మౌనమూ...



మిట్ట మధ్యాహ్నం. ఊరు తగలబడిపోతోంది. దూరంగా పొలాల్లో పనిచేస్తున్న వారు వూరిని పొగలు కమ్ముకుని, మంటలు రేగడం చూసి ఇళ్ళకు పరుగులు తీసారు.

**ఎస్. జయ**

ఊరికి తూర్పు వైపున వున్న మాదిగ పేటలో మొదట మంటలు రేగాయి. పేట మధ్యలో మంటలు అంటుకుని, క్షణాల్లో ఆ మంటలు పేటను చుట్టూ కమ్ముకున్నాయి. మిద్దెలకు ముందు నీడ కోసం, చల్లదనం కోసం గడ్డితో, ఈతకుతో కప్పిన వారపాకలు, గుడిసెలు, పశువుల మేతకు వేసుకున్న గడ్డి వాములు క్షణాల్లో తగలబడిపోతూ బూడిద కుప్పలుగా మారిపోతున్నాయి. ఇళ్లల్లో భద్రపరుచుకున్న గింజలు కాలిపోయి, బూడిదవుతున్నాయి.

నిండా పనుల కాలం. కర్ర తాటించుకుంటూ నడిచే ముసలివగ్గుల దగ్గర పిల్లల్ని వదిలి పొలాలలో, కల్లాలకో పనులకు వెళ్ళిపోయారు అంతా.

చలికాలం. సంక్రాంతి వెళ్ళిపోయి వారం రోజులు కూడా కాలేదు. కొర్రలు, శనక్కాయ, పెసలు, బొబ్బర్లు మాత్రమే ఇళ్ళకు చేరాయి. ఒక పక్క జొన్న, కంది, కుసుమ, గోధుమ, శనగ పంట కోతలు ముమ్మరంగా సాగుతున్నాయి. కొందరు కోతలు పూర్తి చేసుకొని, పంటల్ని కల్లాలకు చేర్చుకొని, తూర్పారపడుతున్నారు.

దళితులు తమకున్న ఎకరం, రెండు ఎకరాల్లోని పంటలను కోసి, గింజలు చేసుకుని కుండల్లో పోసి గుడిసెల్లో భద్రపరుచుకొని, ఆసాములకు పనులకు పోతున్నారు.

అందరికీ చేతినిండా పని, ధాన్యం ఇంటికి వస్తున్న సంబరంలో ఒక నెల రోజులు కాయకష్టం చేసేవారికి నిద్రలు కూడా సరిగా ఉండవు. అయినా అలుపు సొలుపు లేకుండా ఆ నెలంతా శ్రమిస్తారు. ఇంటికి గింజలు వచ్చాయంటే, ఇక ఎండా కాలమంతా ఏమంత పనులు వుండవు. ముమ్మరంగా పని వున్నప్పుడే పని చేయాలి అనుకుంటారు.

ఎల్లన్న కల్లంలో జొన్నల గుండు తిప్పుతున్నాడు. ఆయన తమ్ముడు సామన్న, మరదలు సుబ్బమ్మ, భార్య నాగమ్మ, ఆదివారం కావడంవల్ల కొడుకు చక్రధర్, కూతురు రాధ కల్లంలోనే వుండి పనులు చేస్తున్నారు. వృత్తాకారంలో పరిచిన జొన్నల కంకుల మీద ఎద్దులకు ఒక గొర్రులాగా కంకుల గుండు కట్టి, గుండు కంకుల మీదే తిరగేట్టు ఎల్లన్న ఎద్దులను తోలుతున్నాడు. కంకులు నలిగి గింజలు బయటికి వస్తుంటే కంకుల్ని చేతుల్తో కెలికి, గింజలు కిందికి, కంకులు పైకి వచ్చేట్టు కొందరు చేస్తే, కొందరు పుల్లల పొరకలతో గింజలు వృత్తాకారం దాటి బయటికి పోకుండా ఎప్పటికప్పుడు పూడుస్తున్నారు. పేటలో మంటలు రేగడం చూసి, గుండు తిప్పడం ఆపేశాడు.

"సామన్నా మంటలు నాలుకలు చాస్తూ మన వైపే వస్తున్నాయి. ఇంత దొంగ దెబ్బ తీస్తారనుకోలేదు, మనం వుసారుపడాలి. ఎట్లనైనా మన కల్లం కాపాడుకోవాలి". కల్లం నిండా ధాన్యం, కొర్ర గడ్డి, చొప్ప, శనక్కట్టా కుప్పలు కుప్పలుగా వున్నాయి. "మన ఇల్లు కూడా అంటుకొని వుండొచ్చు, మంటలు అటు వైపే రేగినాయి. ఇంటికి లగెత్తు, పశువుల తలుగులు తప్పించు. మనకు రుణం వుంటే బతికివుంటాయి. పేటకు ఎడమవైపు నుంచి వెళ్లు. తగలబడిపోతున్న గుడిసెల మధ్యలోంచి పోకు. ఏ గుడిసెలోని బొంగో కాలి, పెటేల్మనీ పేలుతూ పైకెగురుతుంది. జాగర్త. ఇక్కడున్నట్లు రావాల" అని తమ్ముణ్ని పురమాయించాడు. సామన్న పరుగెత్తుతుంటే "సుంకన్న మామ ఇంటికాడికి రాపో, ఇండ్లు ఇంగ కొన్నే వున్నాయి. వాటిని మనం కాపాడితే, మన కల్లం కాపాడుకున్నట్టే" అన్నాడు.

పిల్లలు కడవలు, కుండలు తీసుకొని సుద్దవాగుకు పోతుంటే, పొలాల్లోంచి కూడా జనం వచ్చి చేరారు. "అన్నా, మన మిద్దె బాగుంది. గాలివాటం తూర్పు నుంచి పడమటికి వుంది. మన మిద్దె తూర్పునుంది. మనింటికి వారపాకు కూడా లేనందుకేమో మంటలు అంటుకోలేదు. ఎందుకైనా మంచిదని పశువుల తలుగు తప్పించినాను" అని ఎల్లన్నకు చెప్పి కాలుతున్న ఇండ్లమీద నీళ్లు చల్లడం మొదలుపెట్టాడు సామన్న.

తమ్ముడు చెప్పిన మాటలకు ఎల్లన్న మనసు కొద్దిగా కుదటపడ్డా, కోపంతో వుడికిపోయాడు.

పిల్లలు, పెద్దలు కలిసి సుద్దవాగులోంచి కడవలతో నీళ్ళు మోసి, మంటలపై చల్లుతూ, కాలని ఇండ్లపైకి మంటలు వ్యాపించకుండా నీళ్లు చల్లి తడిపారు. అరగంటకంతా మంటల్ని అదుపు చేయగలిగారు. మరో గంటకంతా టౌన్ నుంచి ఫైర్ ఇంజన్ వచ్చి మంటల్ని పూర్తిగా ఆర్పేసింది.



కాని పేటలో బూడిద కాకుండా పట్టుమని పది ఇండ్లు కూడా మిగలలేదు. ఎల్లన్నలాగే సన్నకారు రైతులైన సంజన్న, సుంకన్న శివన్న వాండ్ల ఇండ్లు, పశువుల కొట్టాలు, కల్లాలు కాలిపోయి క్షణాల్లో బికారులయ్యారు.

వీరి ఇండ్లు మిద్దెలే అయినా, మిద్దెలకు ఒక పక్కన వారపాకు వేసి పశువులను కట్టేశారు. పక్కనే కల్లంలో గడ్డివాములు వేశారు. పగలు పశువులు మేయడానికి బయటికి పోవడంతో బతికిపోయాయి. పాలు తాగే దూడల్ని కట్టేయకుండా వదిలేశారు కాబట్టి అవీ బతికి పోయాయి. ఎవరికి పశు నష్టం జరగలేదు. అయితే చుట్టూ కాలిని కమురు కంపు, గాలికి బూడిద పైకిలేస్తూ పరిసరాల్ని భయపెడుతున్నాయి.

ఆ రాత్రి దళితులంతా సామక్క గుడి దగ్గర చేరి పండుకుని, తిని అక్కడే పడుకున్నారు. పడుకున్నారన్నమాటే గానీ మంటలు ఎట్లా లేచినాయి. ఎట్లా చూసినారు చెప్పినవే చెప్పుకుంటూ దుఃఖించారు. వాళ్ళకు తోడుగా ఎల్లన్న వాళ్లతోనే వున్నాడు చాలా సేపు. బాగా రాత్రయిన తరువాత ఇంటి ముఖం పట్టాడు. కమురు వాసనతో ఆ చీకట్లో ఇంకా నల్లగా కనిపిస్తూ కాలిన ఇండ్ల మొండిగోడలు భయపెట్టాయి ఆయన్ని.

ఆ సాములు ఏదో అపకారం తనకు చేస్తారు. జాగర్తగుండాలి అనుకున్నాడే కాని, ఇంత తొందరగా చేస్తారనుకోలేదు ఎల్లన్న. తన మీద ఆసాములకు పగ వుండొచ్చు. కాని పేటనంతా నాశనం చేయడం చాలా దుర్మార్గం అనుకున్నాడు.

ముప్పై ఐదేళ్ళ ఎల్లన్నది ఆరడుగుల నిటారైన విగ్రహం. కాయకష్టంతో అతని శరీరం ఉక్కులాగా బలిష్టంగా తయారైంది. చామన ఛాయ రంగు, విశాలమైన నుదురు, పెద్ద కళ్లు. మితభాషి, కాని మాట్లాడే ఆ కొద్ది మాటలు గంభీరంగా స్వచ్ఛంగా మాట్లాడతాడు. పదెకరాల పొలంలో రెండు కుటుంబాలు కలిసిబతుకుతూ, కలిసి పని చేసుకుంటూ నెమ్మదిగా బతుకుతున్నారు. సొంత పనులు అయిపోయాక ఇద్దరు తోడికోడల్లు ఒకరిద్దరి పొలం పనులకు మాత్రమే వెళతారు. అదీ పదిమందిలో కలవడం కోసమే కాని కూలి సంపాదన కోసం కాదు. ఒక విధంగా పని లేకుండా వూరికే ఇళ్ల వద్ద వుండలేక.

కుల అసమానతలు మనుషులు కొందరు వాళ్ళ లాభాల కోసం ఏర్పాటు చేసుకున్నవనే తెలివిడి ఎల్లన్నకుంది. ప్రతిక్షణం కులంపేర అవమానించి తన ఆత్మగౌరవాన్ని హత్య చేయడానికి ఆసాములు చూస్తుంటారు. ఏ పరిస్థితుల్లోనూ ఆత్మగౌరవం పోగొట్టుకోకూడదని, అది తన ఊపిరి అని అనుకుంటాడు. అది పోయాక జీవించినా లేకపోయినా ఒకటే ఆయన దృష్టిలో.

అదే సమయంలో పేద కుటుంబంలో పుట్టాను, నా కుటుంబాన్ని కాపాడుకోవాల్సిన బాధ్యత వుంది. కుల దాష్టీకాన్ని మొండిగా ఢీకొనడం అంటే చాలా కష్టాలను, నష్టాలను ఎదుర్కోవాలి. వాటిని భరించే శక్తి తనకట చాలదు. ఇప్పుడు తనున్న స్థితిలో నీళ్లలాగా జీవించాలనుకున్నాడు. నీళ్లు ప్రవహించినంత కాలమే స్వచ్ఛంగా, తేటగా వుంటాయి. నీటి ప్రవాహానికి ఓ పెద్ద బండరాయి అడ్డుపస్తే నీళ్లు దాని పక్క నుంచి ప్రవహిస్తాయి. అయినా కుల పెత్తనం తనను అవమానించడానికి, లొంగదీసుకోవడానికి ప్రయత్నిస్తూనే వుంటుంది. నేను బతికి వున్నంత వరకూ అది నాతో దాగుడు మూతలు ఆడుతూనే వుంటుంది అనుకున్నాడు. ప్రతిక్షణం అప్రమత్తంగా వుండక తప్పదు. తను రెప్పపాటు కూడా ఆదమరచి వుండకూడదు అనుకున్నాడు.

ఆసాములు తనను గురిపెట్టుకొని పేటను కాల్చే కుతంత్రానికి పాల్పడ్డారని గుర్తించగలిగాడు. నెల రోజుల క్రితం జరిగిన సంఘటన కళ్ల ముందు మెదిలింది.

✦✦✦

ఆ వూర్లోని పెద్ద ఆసామి, సర్పంచ్ గోవిందరెడ్డికి, నలుగురు కొడుకులు ముగ్గురు కూతుల్లు, ఆఖరు కొడుకు పెళ్లికి వూరందరికీ భోజనాలు పెట్టి తన గొప్ప చాటుకోవాలనుకున్నాడు.

పెళ్లి రెండోనాడు తెలుగోల్లకు, బోయోల్లకు, ముస్లింలకు అందరికి వంటలు వండించి, ముస్లింలకు పీర్ల చావిడిలో, గొల్లోలకు, బోయోల్లకు ఇంకా ఇతర బీసీ కులాల వారికి రంగస్వామి దేవాలయం సత్రంలో విస్తల్లు వేసి భోజనాలు వడ్డించారు. ముందు రోజు రాత్రే ఆసామి పెద్దకొడుకు పెద్ద జీతగాన్ని వెంట తీసుకొని ఇంటింటికి వెళ్లి, మరుసటి రోజు మధ్యాహ్నం పెళ్లి భోజనాలని, ఎవరు వంట చేయొద్దని, ప్రతి కుటుంబం భోజనాలకు రావాలని ఆహ్వానించాడు.

దళితుల దగ్గరకు వచ్చేసరికి మూడోనాడు తమ ఇంటి ముందు వంటలు వండిస్తున్నారని, పేటలోని అందరూ సాయంత్రం ఆరుకంతా తల్యా, చెంబు తీసుకొని, తినడానికి రావాలని ఉదయాన్నే వూర్లో చాటంపు వేయించాడు.

అది విని ఎల్లన్న మనసులో అనుకున్నాడు. 'పేటకు ఇంటింటికి తిరిగి చెప్పేంత గొప్ప మనసు ఆసాములకు ఇంకా పెరగలేదు. కాని

పేటకు పెద్ద మనుషులున్నారు. వాళ్ళకు చెప్పి, సామక్క దేవాలయం సత్రం ముందు వంటలు వండించి, సత్రంలో అందరికి భోజనాలు పెట్టించవచ్చు. కాని పెద్ద మనుషులకు చెప్పక, వూర్లో చాటింపు వేశారు.

పేటనంతా అవమానించి, లొంగదీసుకోవడానికే ఈ ఎత్తువేశారు. వాళ్ళకు తెలుసు తను ఆ భోజనానికి వెళ్ళాడని, నా పద్ధతులు, జీవన విధానం వారికి కంటగింపుగా వుంది. నన్ను ఏకాకిని చేసి లొంగదీసుకోవాలని ఈ ఎత్తు వేశారు. నా లాగా గౌరవంగా బతకాలనే వాళ్ళు కూడా ఈ దెబ్బతో బయటపడతారు. ఊరికంతా పెళ్లి భోజనాలు పెట్టారని కీర్తి వస్తుంది, మాల మాదిగల్ని లొంగదీసుకోవడం జరుగుతుంది. ఒకే దెబ్బకు రెండుపిట్టలు అంటే ఇదేనేమో! 'అనుకున్నాడు ఎల్లన్న. తల్యా, చెంబు తీసుకొని వెళ్లి, ఆసాముల ఇంటి ముందు బజార్లో నేల మీద కూర్చొని భోజనం చేయడం ఎల్లన్న మనసు ఒప్పుకోలేదు సరికదా ఆ చాటింపు వినగానే తేల్లు జెర్రులు పాకినట్లు అసహ్యించుకున్నాడు.

విసవిసా నడుచుకుంటూ ఇంటికి వెళ్ళాడు, నాగమ్మ సంకటి కుండ పొయ్యి మీద నుంచి దించి, పప్పు చేయడానికి అటికెను పొయ్యి మీదకు ఎక్కిస్తున్నది. "పొంత కుండలో నీళ్లు కాగినాయా" అన్నాడు ఇంట్లో అడుగుపెట్టిన వెంటనే.

"సలసలకాగడం లేదు. వెచ్చనయినాయి, కూసేపు తట్టుకో. నీళ్లు తోడుతా" అంది నాగమ్మ.



పొయ్యి వైపు చూసి, "పప్పటికె పక్కన బెట్టి నీళ్లు కాగబెట్టు" అన్నాడు.

"బువ్వాలకు పిల్లలు ఆకలంటారు. సంకటయింది, పప్పు చేసినాక నీళ్లకు బెడతా"

"ఆకలన్న పిల్లలకు సంకట్లో బెల్లమో, కలో కలిపి పెట్టు, అందరూ ముందు స్నానాలు చేయండి. ఈ రోజు మనం జొన్న చేనికి పోయి మల్లెలమ్మను జేయాలి"

"జొన్న ఇప్పుడిప్పుడే కంకి ఇడుచ్చున్నాది. పాలపిసుకుల్లగ్గాని పంట ఎంత వచ్చాదో తెలస్తాది. మల్లెలమ్మను గప్పుడుగదా చేసేది అన్నాడు సామన్న భుజమ్మీది కడవలోంచి నీళ్లు దోనెలో పోస్తూ."

"చాటింపు ఎవరికైనాదా?" అన్నాడు ఎల్లన్న గంభీరంగా.

"ఇన్నా, బాయికాడా కూడా చెప్పుకుంటున్నారు." అంటూ భార్య వైపు చూసి, "నువ్వు కూడా కడవ పట్టుకో, బిరానా తెచ్చుకుందాం నీళ్లు" అనుకుంటూ విసవిసా వెళ్ళిపోయాడు సామన్న.

పప్పటికె దించి నీళ్ల కుండ పొయ్యి మీన పెట్టింది నాగమ్మ. సామన్న నీళ్ల కడవ తెచ్చేలోగా నీళ్లు కాగితే, ఎల్లన్న స్నానానికి మరో కుండలో నీల్లు తోడి జాలాట్లో పెట్టి వచ్చింది. నాగమ్మ.

ఈసారి నీళ్ల కడవతో వచ్చిన సామన్న అన్నకు మరి కొన్ని విషయాలు చెప్పాడు.

"బాయి కాడ అందరూ అనుకోబట్టిరి, సామక్క దేవలయం కాడ పెట్టకుండా వూర్లో పెడుతున్నారు పెళ్లి బువ్వ అని. మన సంగతి అడిగితే, ఇయాల మంచి రోజు మల్లెలమ్మ జేయాలని మా యన్న మూన్నాల కిందనే జెప్పినాడు. బోతున్యాం అని చెప్పినాను" అన్నాడు.

ఎల్లన్న స్నానానికి పోతూ తమ్ముని మాటలువిని అతని వైపు గర్వంగా చూశాడు.

స్నానం చేసి వుతికిన తెల్లని అంగీవేసుకొని, దోవతి కట్టుకున్నాడు. దేవుని పటాల ముందు కూర్చొని దీపం, అగరుబత్తీలు వెలిగించి, పటాలకు కుంకుమ బొట్లు పెట్టి తన నుదిటి మీన బొట్టుపెట్టుకుని పూజకు కూర్చున్నాడు.

"సుబ్బమ్మా, మీ బావ పూజకు కూచున్నాడు. ఆయన పూజన్నుంచి లేచేతాలికి మనం తయారుగుండాలి జొన్న చేనికి పోవడానికి. ఇంగ నీల్లు త్యావద్దలే. నీల్లు కాగినాయి, పిల్లలు, నువ్వు తలంటుకోండి. నేను వంట దినుసులు, గిన్నెలు, కట్టెలు మూట గడతా. నా మరిది పశువులకు నీల్లుదాపి, మేపు ఏస్తాడు. మీది కాగానే ఆయనకు నీల్లు తోడు. ఆయనది కాగానే పిల్లలకు, సామన్నకు తినడానికి ఏమన్నా పెట్టు. ఆఖర్న నేను స్నానానికి పోతాను. చేనికి పోగానే వంట మొదలు పెట్టుకోవాలి. వంట అయి మల్లెలమ్మకు పెట్టే తాలికి ఎండ నడినెత్తి మీన కొచ్చాది. ఆకలికి తట్టుకోవాలి. తాలలేనంటే నువ్వు పిల్లలతో తిను. నేన్కొదాన్నే వంట జేచ్చా." అంది నాగమ్మ బియ్యం, పప్పు, ఉప్పు, కారం మూటగడుతూ. "తినను లే అక్క, రోజు వుంటామా ఇట్లా. పండగ పూటే కదా! నువ్వు, బావా వుండగా లేంది. నేనెందుకుండలేను? వుంటలే" అంది.

పూజలో వున్న ఎల్లన్న మరదలి మాటలకు సంతోషపడ్డాడు. తోడికోడల్లు ఒక్క తల్లిపిల్లలాగా కలిసిపోయారు అనుకున్నాడు.

× × ×

ఎల్లన్న ప్రతి శనివారం, సోమవారం తెలతెలవారగానే తలంటుకొని, తెల్లనిబట్టలు కట్టుకొని, పూజ చేస్తాడు. ఆ రోజంతా నిష్టగా వుంటాడు.

ఒకసారి ఆయన కుటుంబ సమేతంగా తిరుపతి వెళితే, "మాదిగోల్లు కూడా తిరుపతి పోపట్టిరి, యీల్లు గుడిలోకి పోగూడదు. ఆడ ఎవరికెరుకలే తన కులం అని పోయినాడేమో ఎల్లన్న. చూడు వెంకటేశ్వరుని గుడి గడపదాటగానే రక్తం కక్కుని చస్తాడు" అన్నారు కొందరు ఆసాములు. పూజకు కూర్చోకుండా చేయాలని, ఒక రోజు తెలతెలవారగానే పంచాయితీ పెట్టి కబురు పంపారు. తలారి రంగన్న ఎల్లన్న ఇంటికి పోయేసరికి ఆయన పూజలో వున్నాడు.

"నాగమ్మా, ఎల్లన్న లేడా రచ్చబండ కాడ పంచాయితీ జరుగుతున్నాది, బిరనా రమ్మన్యారు ఆసాములు" అన్నాడు తలారి రంగన్న.

"రంగన్న చిన్నాయనా, ఆయన పూజకు కూచున్యాడే. పూజయ్యాక జెప్పి తోలుతా" అంది నాగమ్మ జొన్న సంకటి కలబెడుతూ.

"తోలుక రమ్మన్యారు, చెప్పమ్మ ఎల్లన్నకు"

"నేనేం అబద్దాలాడడం ల్యా, చూసుకో" అని ఎల్లన్న కూర్చున్న వైపు చూపించింది.

ఆ వంటింట్లోనే ఒక మూలన పటాల ముందు పద్మాసనంలో కూర్చొని పూజలో నిమగ్నమైన ఎల్లన్నను కొన్ని నిముషాలు రెప్ప వేయకుండా చూశాడు. 'కథలు వింటుంటాం మునులు తపస్సు చేస్తారని, వాళ్ళను ఎవరు చూసినారు. కాని నేను ఎల్లన్న తపస్సు చేయడం చూసినాను" అనుకున్నాడు. ఎక్కడ తన అడుగులు చప్పుడవుతాయో అని మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వెనుదిరిగాడు. నాగమ్మ ఏదో అడగబోతే మాట్లాడవద్దు అన్నట్టు అతడే సైగ చేశాడు. అతను మూర్తిభవించిన మౌనంలా తలవంచుకుని వెళ్లిపోయాడు. అంత దూరం నుంచే అతని వాలకం చూసిన ఆసాములు "ఏం చెబుతాడో రంగన్న? ఎల్లన్న ఎందుకు రాలేదో" అనుకున్నారు. వాళ్ళ ముందుకెళ్ళి, "ఎల్లన్న పూజ చేసుకుంటున్నాడు. పూజ పూర్తయినాక చెప్పి పంపిచ్చానని ఆయన

పెళ్లాం చెప్పింది." అన్నాడు గంభీరంగా.

"ఎల్లన్న ఏం బాపనాయన్నా? పొద్దునే పూజ చేస్తుంటే నువ్వు పలకరించకుండా వచ్చినావు?"

"కళ్లతో జూస్తే తెలుచ్చాది, చానా నిష్టంగా జేచ్చుండాడు. తపస్సు జేసినట్టు జేచ్చుండాడు. ఆయన కండ్లు తెరిచ్చే నాకు పాపం తగులుతాదేమోనని బయమేసినాది" అన్నాడు.

"ఎల్లిగాడు సానా మిడిసిపడుతున్నాడు. పిల్లలకు ఎట్లాంటి పేర్లు పెట్టాడో యిన్యారా? కొడుకు పేరు చక్రధర్, బిడ్డ పేరు రాధ. పిల్లలు పుట్టినపుడు రాపీయనీక వచ్చినాడు. కొడుకు పేరు చక్రధర్ అని చెప్పాడు. బిడ్డపేరు రాధ. మీవాల్లకు ఎవరికి నోరు తిరుగుతాది? సుంకన్ననో, సుబ్బన్ననో పెట్టు, అన్యాను. 'మంచి పేరు పెట్టుకోడానికి కూడా అంటరాని వాల్లమేనా? పేరు రాసినాక చూపించు రెడ్డి' అన్నాడు. ఇంకేం జేయను చెప్పిన పేర్లు రాసినాను. చెప్పింది రాసినానో లేదో అని చూసినాడు. మంచి మంచి పేర్లతో మాలమాదిగ పేటల్నే మార్చుతాడేమో!?" అని ఆ వూరి మునసబు చెప్పాడు. తన రాసిన పేర్లు చూసి, 'ద'కు పొల్లు వుండాల, వత్తిపలకాల ఆ అక్షరం అని రెండుసార్లు ఎల్లన్న సరిదిద్దిన సంగతి మాత్రం మనసబు చెప్పలేదు.

ఇట్లా ఎల్లన్న గురించి ఆసాములు మాట్లాడుకుంటుంటే పంచాయితీకి వచ్చాడు. ఆయన్ను తలుచుకుంటున్నందుకు అక్కడ ప్రత్యక్షమయ్యాడని రంగన్న భావించాడు. నుదటి మీద తెల్లని ఈబూది రేఖలు, వాటి మధ్యలో చిన్న కుంకుడు బొట్టు. వుతికిన తెల్లని బట్టల్లో, ధ్యానం చేసి వచ్చాడేమో గంభీరమైన ప్రశాంతత ఆ ముఖంలో కనిపించింది అందరికి. అక్కడున్న పెద్దల్లో అందరి బట్టలు నలిగిపోయి వున్నాయి. ఎవరూ స్నానాలు కూడా చేయలేదు. కొందరు ముఖాలు కడిగి కాఫీలు సేవించారు. ఉదయాన్నే విరబూసిన మల్లెపూవులా వున్న ఎల్లన్నను చూసి కొందరికి కంటగింపయింది.



దళితుల పెద్ద మనిషజగా ఎల్లన్న పంచాయితీకి వచ్చాడు. అందరూ పూరవాకిలి పెద్దరుగు మీద కూర్చుంటే, నాలుగు స్తంభాలకు దగ్గరగా కావాలి కాండ్లు తమ పొదువున్న పట్టుడు కట్టెల్ని నిలువుగా పట్టుకొని నిలబడ్డారు. అవి తమ శరీరంలో భాగమైనట్టు వూర్లో ఎక్కడికి పోయినా వాటిని తమతోనే వుంచుకుంటారు. కావలి కాండ్లకు దగ్గరగా ఒక గుండు మీద ఎల్లన్న కూర్చున్నాడు. తన భుజమ్మీది వల్లెతో గుండు మీది దుమ్ము దులుపుకొని. ప్రతి ఉగాది పండుగకు ఆ గుండు ఎత్తే పందెం జరుగుతుంది. 'ఎల్లన్నకు ఆ గుండు చిన్నపాటి కుర్చీలాగా వుపయోగపడుతుంది. దాన్ని అక్కడ్నుంచి తీసేయమంటే తీయరు, పైగా ఎల్లన్న కూర్చుంటాడు అని తిరిగి తనకే సమాధానం చెబుతారు' అనుకున్నాడు మనసులో గోవిందరెడ్డి, గుండుకు పూరవాకిలి పెద్దరుగుకు మధ్య రెండెడ్ల బండ్లు ఎదురెదురుగా పోయేంత విశాలమైన రహదారి. అదే ఆ వూరికి ముఖ్యమైన రహదారి, పైగా అది ఆ వూరి నాలుగు స్తంభాల కూడలి.

"మాదిగోల్లు మాదిగోల్లే, పొద్దున్నే స్నానాలు చేసి పూజలు జేస్తే బాపనోల్లు కాలేరు" అన్నాడు ఒక ఆసామి. ఆ ఆసామికి నోటి తులువ అని వూర్లో పేరు. అట్లాంటి మనిషితో మాట్లాడేదేంది అనుకుని, ఆ మాటలే విననట్టు ఎల్లన్న మౌనం దాల్చాడు. ఆ మౌనంలో తొణకని ఆత్మాభిమానం వుంది. మౌనమూ పదునైన ఆయుధమని ఎల్లన్నకు తెలుసు. ఆ మౌనం అక్కడున్న చాలా మందికి వెన్నులో వణుకు పుట్టించింది.

సర్పంచ్ గోవిందరెడ్డి అందరి కన్నా ముందు తెలివిడిలోకి వచ్చాడు. "ఈ ఏడాది పైర్లు బాగున్నాయి. కావిల్లు ఎవరెవర్ని పెడదాం" అన్నాడు రచ్చబండ మీద కూర్చున్న సందర్భాన్ని గుర్తు చేస్తూ అందర్నీ వుద్దేశించి. "సుబ్బన్నను, నాగన్నను తీసి వేరే వాళ్ళను పెట్టండి. వాల్లు పోయినేడాది నా పొలం కాడ సరిగా కావిలి కాయల. నేను పోయినప్పుడు నా చేనికాడ కనిపించలా వాళ్లు." అన్నాడు ఒక ఆసామి.

ఎవరూ ఏమి మాట్లాడలేదు.

కాసేపటికి, "సరే అయితే కొత్తగా కావలికి ఎవర్ని ఎక్కిద్దాం" అన్నాడు గోవిందరెడ్డి.

ఇద్దరి పేదోళ్ల కడుపు కొట్టబోతున్నారు ఆసాములు. అది జరగనీయకూడదు అనుకున్నాడు ఎల్లన్న. "మంచీ చెడ్డా ఆలోచించాలి. ఐదారేండ్లుగా సుబ్బన్న, నాగన్న కావిల్లు కాస్తున్నారు. పోయినేడాది ఎవరి పైరన్నా పశువులు మేసినాయా? దొంగలు కోసుకపోయినారా? పంటకు నష్టం జరగకపోతే చాలు. ఆ కావలి కాడు బాగా కావలి కాసినాడనే లెక్క. పోయినేడాది అంతా బాగా జరిగింది. వాళ్లనే కావలికి ఎక్కించాల." అన్నాడు ఎల్లన్న చాలా నెమ్మదిగా, ప్రశాంతంగా.

ఈ తంతు అంతా కావలి కాండ్ల ముందే జరుగుతుండడంతో, వాళ్ళంతా ఎల్లన్న మాటలకు సంతోషంగా తలలూపి "బాగచెప్పినావు మామ, బాగన్నావు చిన్నాయన, మంచి మాటన్నావు ఎల్లన్న అని అన్నారు కూడబలుక్కున్నట్టు.

నిజానికి వీళ్ళంతా ఎల్లన్న కులం వాళ్ళు కాదు. అన్ని కులాల వాళ్ళు పది పన్నెండు మంది దాకా వున్నారు. ఇంత మందిలో తమ పరువు దక్కించుకోవాలంటే ఎవరం మాట్లాడకూడదు అనుకున్నారు ఆసాములు. అందరూ నిశ్శబ్దంగా వుండడం చూసి సర్పంచ్ గోవిందరెడ్డి కూడా "పోయినేడాది చేసినోల్లే ఈ ఏడు కూడా కావలి చేయాల. ఎవరితో మాట పడకుండా బాగా కావలి కాయండి. ఏమన్నా తేడా వచ్చినాదో మధ్యలో నైనా కావలి దింపాల్సి వస్తాది" అన్నాడు.

"మెలిక పెట్టాడు" అనుకున్నాడు ఎల్లన్న.

పంచాయితీ అయిపోయినట్టేనని అందరూ అటు ఇటు కదులుతుంటే ఎల్లన్న కూడా గబగబా అక్కడ నుంచి ఇంటికి బయలుదేరాడు.

"ఏం కాలమొచ్చే, మాదిగోని మాట ఈ యాల పై చేయి ఆయగదా రెడ్డి" అని ఆ వూరి కరణం బాపనయ్య అన్నాడు.

"కాలమట్లా వుంది, నువ్వు బాపనాయనవు, మా సరీతనే వచ్చినవు తానపానల్లేవు, ఆ ఎల్లిగాడేమో మాదిగోడు, పూజకాన్నుంచి లేచొచ్చిన మునీశ్వరునిలా వున్నాడు. ఏమన్నా అంటే శాపం ఇస్తాడేమోనన్నంత భయమేసినాది. ఎప్పుడూ ఎల్లిగా అనే పిలిచేది నేను. ఈ రోజు అట్లా పిలువనీక నాకు నాలుక రాల్యా" అన్నాడు గోవిందరెడ్డి.

"ఎక్కడున్న వాల్లను అక్కడుంచాల, మన మోచేతి కింద నీల్లు తాగెటోల్లను పైకి పోనీయకూడదు. చెప్పు క్రింద తేలులాగ వుంచాల వాల్లను" కరణం రెడ్డిని మరింత రెచ్చగొట్టాడు.

"అవకాశం వస్తాది, చేతికి దొరక్కుండా ఎక్కడికి పోతాడులే సామి. గోవిందరెడ్డి అంటే ఏమిటో చూపిచ్చాను" అన్నాడు గోవిందరెడ్డి మీసం దిప్పుతూ.

# శ్వేత సౌధ విధ్వంసక జననం

డా. కె. లింగారెడ్డి



నిన్ను చూసి సిగ్గుపడ్తున్నాను
నీ చరిత్రని చూసి సిగ్గు పడ్తున్నాను
నిజం చెప్పిన వాళ్ళని నిర్జించగలంగాని
నిజాన్ని నిర్జించలేమన్న నిజం తెలుసుకోలేని
నీ మూర్ఖత్వానికి సిగ్గు పడ్తున్నాను-
విధ్వంసంలో పుట్టిన నీకు విధ్వంసం తప్ప
విషయమేమీ అర్థంకాదుగదా!
వేలాది రెడ్ ఇండియన్ల ఊచకోతలో ఊపిరిపోసుకున్న
విశృంఖల విధ్వంసక జననం కదా!
లక్షలాది ఆఫ్రికన్ బానిసల స్వేద బిందువుల్తో
శ్వేత సౌధాల్ని నిర్మించుకున్న అరాచక సంస్కృతికదా!
మానవ సంస్కృతికి పురుడు పోసుకున్న మెసపుటోమియా నేలకు
విశ్వమానవ సౌభ్రాతృత్వ బౌద్ధ సంస్కృతి జీవగడ్డ సింధులోయకు
సంస్కృతి నేర్పుతున్నానని ప్రగల్భాలు పలుకుతున్న
నీ మూర్ఖత్వానికి సిగ్గు పడ్తున్నాను-
హిరోషిమా, నాగసాకి
చిలీ, గ్రెనడా, లావోస్, కంబోడియా, కొసావో
క్యూబా వియత్నాం అఫ్ఘనిస్తాన్
ఎన్నెన్ని దేశాల చిత్రాలమీద
రక్తపు కళ్ళాపి చల్లావు-
ఎన్నెన్ని దేశాల ప్రజల రక్తమాంసాల్ని
డాలర్లుగా వొల్చుకున్నావు-
నీ అమానవీయ ప్రపంచ గుండాగిరీకి
అసహ్యపడుతున్నాను-
హాలీవుడ్ జేమ్స్‌బాండ్ కథలెన్నైనా చెప్పు
అధినేత అహంకారి అనో
అయుధాలు దాచాడనో
కారణాలేమైనా చెప్పు-
కథ చమురుదేనని మాకు తెలుసు-
ఇరాక్ గాలం మీద నీ డాలర్ చేప
గిలగిల్లాడుతున్నందుకేననీ తెలుసు-
సద్దాం మీద నువ్వు చేస్తున్న యుద్ధానికి ఆగ్రహపడుతున్నాను-
రాజులు హతులైనారు
రాజ్యాలు పతనమైనవి
అలెగ్జాండర్, ముస్సోలినీలని
చరిత్ర చెత్తకుప్పల్లో విసిరేసింది
చరిత్రని చూసి గర్వపడ్తున్నాను -
ప్రపంచ ప్రజల చరిత్రని చూసి గర్వపడ్తున్నాను-
వెన్నెముకల్లేని తాబేదారు ప్రభుత్వాల మెడలు వంచి
వర్తమాన చరిత్ర చక్రం నిటారుగా నిలబడ్డ ప్రజల చేతుల్లో
ప్రపంచ పోలీసు పతనపు భవిష్యత్ దృశ్యాన్ని చూసి గర్వపడ్తున్నాను-

---

"ఇట్లా అన్నానని కోపగించుకోకు, ఆ ఎల్లిగాని మీసాలు నీ మీసాల కన్నా బాగా పురి తిరిగి ఇంతింత లావున్నాయి" అన్నాడు.

నిజంగానే గోవిందరెడ్డికి ఈ మాటలతో కడుపు మండింది. "కులానికి బాపనయ్యవయి పోయి బతికిపోయినావు. నీ కరణం బుద్ధులు పోనిచ్చుకోలేదు. బ్రహ్మదేవుడు నిన్ను దేనితో జేసినాడో" మనసులో అనుకుంటూ రచ్చబండ దిగి ఇంటి ముఖం పట్టాడు.

ఊరిని గుప్పిట్లో పెట్టుకోవాలి. తానెంత గొప్పనో వూర్లోనే కాదు, చుట్టూ గ్రామాలకు తెలిసేలా పనులు చేయాలనుకున్నాడు. అతని మనసులో మెదిలింది తన ఆఖరి కొడుకు పెళ్లి మూడునెల్లే ఉందని, 'పెళ్లి గొప్పగా జరిపించాలి. ఊరందరికి భోజనాలు పెట్టించాలి' మాదిగోని బతుకు నా కాళ్ళ దగ్గరే అని చూపించాలి' అనుకుంటూ మీసం దువ్వబోయిన చేయిని కరణం మాటలు గుర్తుకు వచ్చి కిందికి దించాడు. ఎల్లన్న పూజలోంచి లేచే సరికి ఇంట్లో అందరూ తలంటుకొని, వుతికిన బట్టలు కట్టుకొని, అన్నీ సిద్ధం చేసుకున్నారు. సామన్న ఎద్దు బండి కూడా కట్టి, వంటసామాను నాగమ్మ, సుబ్బమ్మ అందిస్తుంటే ఒక్కొక్కటి బండ్లో అమర్చాడు, నీళ్ల కడవలతో సహా.

జొన్నచేను తూర్పు వైపున తమ ఇల్లుదాటితే, రెండు పర్లాంగుల దూరమే. వారి ఇల్లు పేట చివర కనుక వాళ్లు జొన్న చేనికి వెళ్లడం ఎక్కువ మంది చూడలేదు. కాకపోతే బండి కదుతున్నప్పుడు ఎద్దుల మెళ్లోని గంటల సవ్వడికి ఎదిరింట్లోంచి, పక్కింట్లోంచి ఒకరిద్దరు తొంగి చూసి అడిగారు. బండి ముందు నిలబడి బండి ఎప్పుడెప్పుడెక్కాలా అని ఆతురుత పడుతున్న పిల్లలు మల్లెలమ్మకు పోతున్నామని చెప్పారు.

ఎల్లన్న గురించి ఎరిగి, ఆయన మల్లెలమ్మ చేయడానికి పోతున్నాడని తెలిసి, సంజన్న, సుంకన్న, శివన్న చుట్టాల నుంచి ఆపతి అని కబురొచ్చిందని ఆగమేగాల మీద వేరే వూర్లకు వెళ్ళిపోయారు.

సాయంత్రం దళితులకు పెట్టిన పెళ్లి భోజనాలకు సంజన్న, సుంకన్న, శివన్న కుటుంబాలు వచ్చినా మగవాళ్లు రాలేదని, ఎల్లన్న కుటుంబంలో ఎవరూ రాలేదని ఆసాములు అనుకున్నారు.

"వాళ్ల దొమ్మపొగరు కాకపోతే ఈ రోజే వేరే పనులు పెట్టుకుంటారా? ఎంత లేచిపోయిన మొనగాల్లో అదీ చూద్దాం. మనల్ని కాదనే బతగ్గలరా? చెప్పు కింద వుండాల్సినోల్లు మన మాటంటే ఖాతరు చేయరా? వీల్లు నలుగురున్నప్పుడే వీల్ల అంతు చూడాలి. వీల్లను మన కాళ్ళకాడికి తెచ్చుకోవాలి. వదిలేస్తే వీల్లను చూసి మరి కొందరు నేర్చుకుంటారు. వీల్లను వూరికే వదిలేయ కూడదు" అనుకున్నాడు గోవిందరెడ్డి పేటకు నిప్పుపెట్టించాడు.

ఎల్లన్న ఇల్లు, కల్లం సురక్షితంగా వుండడంతో వూర్లో ఎల్లన్న గురించి కథలు కథలుగా చెప్పుకున్నారు. ఆయన జోస్యాలు చెప్పగలడని, రకరకాల మందులతో మనుషుల, పశువుల రోగాలు పోగొడుతాడని, పశువులు తప్పిపోయినా, ఇంట్లో వస్తువులు పోయినా దొరికేది లేనిది చెబుతాడని, ఆయన పూజ మీద కూర్చున్నప్పుడు, పీట మీద జానెడెత్తున గాలిలో తేలుతూ వుంటాడని ఆయన గురించి చాలా రకాలుగా కథలు చెప్పడం మొదలుపెట్టారు.

అంతేగాదు, "ఆయనకు ఎరికే నంటా ఎవరు పేటకు అగ్గి పెట్టింది. మాదిగోల్లం పచ్చగా వుండడం చూల్లేక చేయించినాడు, పిరికోడు, పేరెందుకు చెప్పాల. వాడవ సరికి చావు చస్తాడు." అని ఎల్లన్న అన్నాడని వూరంతా చెప్పుకున్నారు.

ఎల్లన్న గురించి చెప్పుకుంటున్న కథలన్నీ గోవిందరెడ్డి చెవిన పడుతూనే వున్నాయి. తన పేరు బయటపడనందుకు ఎల్లన్న మంచితనాన్ని గుర్తించడానికి ఒక పక్క అహంకారం, మరోపక్క ఎలాంటి రోగంతో చస్తానోనకే భయం గోవిందరెడ్డిని కుంగదీశాయి. పేట తగలబడి నెల తిరక్కుండానే మంచం పట్టాడు గోవిందరెడ్డి. ❖

# కదిలే ప్రపంచం.. కదిలించే కవిత్వం...

మార్చిలో విజయవాడలో జరిగిన సాహిత్యశాలలో కవిత్వంపై జరిగిన గోష్ఠి, ప్రసంగాలపై ఒక ప్రతినిధి నోట్స్

పి. కుమారస్వామి

**జ్వాలాముఖి**

ప్రతి పది సంవత్సరాలలో సాహిత్యంలో మార్పులు వస్తాయి. నన్నయ్య అక్షర రమ్యత, తరువాత పోతన కవిత్వం, శ్రీనాథుని చాటువులు, శతక వాఙ్మయం, వచ్చింది. వేమన సుమతి, ధూర్జటి లేకపోతే లౌకిక చింతన, నిజమైన సంస్కారం వచ్చేది కాదు.

నన్నయ్య అక్షర రమ్యతలో సంస్కృత, తెలుగు పదాలు, తత్సమాలు సరైన పొందికలో వుండటం. కథనశైలి, అక్షర రమ్యత పొందిక కుదిరింది. 11వ శతాబ్దపు నన్నయ్య తరువాత చీము, నెత్తురు వున్నట్లు పాత్రలు ముందుకు వచ్చాయి. 13వ శతాబ్దపు తిక్కన దగ్గర ఇది ప్రారంభమైంది.

ప్రజల్లో వున్న తెలుగు జాను తెలుగును సంస్కృతాన్ని కలిపి రాశాడు తిక్కన. తెలుగులో వీరేశలింగం 30 పద్యాల సరస్వతీ, నారద సంవాదం రాశాడు. శతక కవులు వచ్చారు.

చంధస్సు, భావాలకు కవిత్వం పరిమితమా? చందోబద్ధంగానే కవిత్వం వుండాలా? ఇవన్నీ నేటి ప్రశ్నలు కావు. పొలరైజేషన్ కవిత్వంలో జరిగింది. ఉరి, శిరస్సు చెప్పిన బాధలు, బాధల భావాలు చెప్పిన వేశ్య, కదిలే జీవితం, కదిలించే కవిత్వం – మనిషిని కదిలిస్తుంది.

ఈసురోమని మనుషులుంటే సంస్కారి బతకలేదు. అందుకే సాహిత్యం మారుతూ వుంటుంది. నానీలు, వచనం, సీసం... ఇవన్నీ ప్రక్రియలే కవి తన జీవితం గురించి రాసుకోకూడదా? భావానికి, కవిత్వానికి జన్మస్థానం, గమ్యస్థానం – సమాజం

ఏమీ పట్టని వాడు మృత్యువును ప్రేమించే వాడు. సమాజాన్ని పట్టించుకునేవాడు. జీవితాన్ని ప్రేమిస్తాడు. అందుకే టాల్‌స్టాయ్ జీవితాన్ని చూస్తాడు. నవల మూలాల్ని వెతుక్కుంటుంది. జీవితాన్ని సాక్షాత్కరించ చేసుకుంటుంది అంపశయ్య నవీన్ కాలరేఖలు. జీవితం ఎలా చైతన్యం అయిందో, మానవ సంబంధాలు ఎలా మారాయో చెబుతాయి. పాశ్చాత్య భావజాలం ప్రభావం దాటి, పరిమితిని దాటి సాహిత్యం బయటకు వచ్చింది. నేటి సాహిత్యం ప్రజాస్వామిక సాహిత్యం. విస్తృత ప్రజల సాహిత్యం అయింది.

ప్రపంచీకరణ ప్రభావంలో భాషకొట్టుకు పోతోంది. నవల ఎలా వుండాలి? ఎఫ్‌డిఐ వస్తోంది. వారి వస్తువులు వస్తువులు వస్తున్నాయి. కార్పొరేట్ వ్యవసాయం వస్తోంది. జీవితాన్ని కాపాడేది నవల.

జీవితంలోని పొలెమిక్స్ అర్థం కావాలంటే వచనం కావాలి. ఆవేశంతో, ఆవేదనతో రాసేది కవిత్వం. దృశ్య, శ్రవణ మాధ్యమాల్లో సాహిత్యం మారుతోంది. పసిఫిక్ మహాసముద్రంలో అమెరికా అణుబాంబు విస్ఫోటనమే సునామికీ కారణమని కొన్ని పత్రికలు రాశాయి. ఇలాంటి విషయాల్ని సాహిత్యంలోకి చొప్పించాలి.

సందర్భాన్ని చిత్రించేటప్పుడు కవి బాధ్యత ఎక్కువగా వుంది.

నలుగురు కూర్చొని నవ్వేవేళ
నాపేరొకసారి తలవండి

పూర్ణమ్మ కవితలో మానవ సంబంధాల్ని ఉన్నతీకరించాడు గురజాడ.

కదిలే ప్రపంచం
కదిలించే కవిత్వం... అన్నాడు శ్రీశ్రీ.

కదిలే జీవితం వున్నట్లే కదిలించే కవిత్వం వుండాలి. కవిత్వంలో అది తొణికిసలాడాలి.

నాట్లు వేయంగా
కాలువ తీయంగా
పంట కోయంగా... ఇలా కదిలే కవిత్వం వుంటుంది. కవిత్వం కదిలే జీవితం వుంటుంది. అలాగే ప్రేమ జీవితం కవిత్వంలో వచ్చింది.

కదిలేది
కదిలించేది
పాడేది...
పాడించేది... ఇవన్నీ కవిత్వంలోకి ఎలా వచ్చాయి?

పెనునిద్దుర వదిలించేది
మును ముందుకు సాగించేది
పరిపూర్ణత సాధించేది

ఇలాంటి కవిత్వం మనకు కావాలి. ప్రజాస్వామ్యంలో కవిత్వం ఎలా వుండాలి? గేయంగా, పాడేదిగా, పాటగా, వచనంగా కవిత్వం వచ్చింది.

ఎగిరేది, సాగేది, ముందుకు సాగేది, నిలిచేది కవిత్వం. దీన్ని రాయటం చాలా కష్టం. అలాగే కవిత్వంలో వ్యర్థ పదాలు రాయరాదు.

నిప్పులు చిమ్ముకుంటూ
నింగికి నేనెగిరిపోతే
నిబిడాశ్చర్యంతో వీరే
నిప్పులు కక్కుకుంటూ
నేలకు నేరాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరే...
అంటాడు శ్రీశ్రీ

తక్కువ మాటల్లో ఎక్కువ విషయాల్ని చెప్పాలి. సానుభూతితో చెప్పే మాటలు వుంటాయి. తన సుఖం కోసం రాసే మాటలు వుంటాయి. చుట్టూ వున్న సమాజాన్ని గురించే రాసేటప్పుడు కొన్ని రాజకీయ పరిమితులు వుంటాయి.

మన స్వాతంత్ర్యం
మేడిపండు
మన దారిద్ర్యం
రాచపుండు... అంటాడు ఆరుద్ర

సునామీ వచ్చింది. కరుణ రసంతో రాయవచ్చు. కరుణరసం వీరరసానికి పోకపోతే "అయ్యో అయ్యో"గా మారుతుంది

నదులకు రోగాలు తెచ్చి పెట్టేవాడు
భూమికి బొరియలు పెట్టేవాడు
సునామీలుతేరా?

ఆదర్శాన్ని ప్రమాణం చేసుకోవాలి. అది సంస్కారం నేర్పుతుంది. నువ్వు కథ రాయవచ్చు. పద్యం రాయవచ్చు. పాట రాయవచ్చు. వస్తువుకు శిల్పానికి సమన్వయం తేవాలి.

స్పెయిన్‌లో ప్రజా తిరుగుబాటు వచ్చింది. పికాసో కుయెర్నికా చిత్రం గీశారు. ఆ తిరుగుబాటును చిత్రీకరిస్తూ అది నేడు ప్రసిద్ధ చిత్రం.

ఉన్న చిత్రాన్ని యథాతథంగా చెప్పకుండానే చమత్కరించవచ్చు.

కవితాను గొప్పవాడు కావాలా? కవిత్వాన్ని గొప్పదిగా చేయాలా? ఎలా రాయాలి? స్వరూపం స్వలాభం మధ్య సమన్వయం కావాలి. కవిత్వం ఇప్పుడు పొలిటికల్ ఎకానమి లాగా వుంటుంది.

ఒక్కొక్క అంశాన్ని గురించి చెప్పడమా? అన్నీ కలిపి చెప్పడమా? టీవిలో వచ్చే భావజాలం కొన్ని పరిమితులు ఏర్పరుస్తున్నది. మధ్యతరగతి రాగద్వేషాలకు పోతోంది. బతకాలనే ఆకాంక్ష వుంటుంది.

జైలులోని నేరస్థుల గురించి శ్రీశ్రీ ఇలా అంటాడు.

నేరాలు చేశారు నిజమే
అందుకు అలక్ష్యంగా చూడకే!

అంటూ శ్రీశ్రీ చంద్రునితో చెప్తాడు. ఇదీ మానవీయత.

పెట్టుబడిదారి దేశాల్లో కవిత్వం మూలకు నెట్టబడుతోంది. యూరప్‌లో నాటకం బతికి వుంది. మన దేశంలో కథ బతికి వుంది. మన దేశంలో కథ బతికి వుంది. కవిత్వం అలిసిపోయి వుంది. నవల వుండి వుండనట్లు వుంది.

ఎవరికి ఎలా ఏ సందర్భంలో ఎవరిని వుద్దేశించి రాస్తున్నావు? వాడిన పదాలు మళ్ళీ మళ్ళీ రాకుండా కొత్త పదాలు రాయాలి. ప్రతి పది సంవత్సరాలకు పునఃప్రకియగా మారింది కవిత్వం. ఈ కవిత్వం, ఆత్మీయంగా వుందా, ధైర్యాన్ని ఇస్తుందా? ఇవన్నీ గమనించాలి.

కవిత్వం వూపిరినివ్వాలి. ధైర్యాన్నివ్వాలి. కవిత పునరుత్పత్తి కాకుండా కొత్తదనం తేవాలి.

### అద్దేపల్లి రామ్మోహనరావు

(కవితా నిర్మాణం)

నేడు యువకవులు విరివిగా రాస్తున్నారు. పద్యకవులైనా, వచన కవులైనా ప్రపంచీకరణపై రాస్తున్నారు.

కవిత్వం నిరంతర యాత్ర. మారిన పరిస్థితులు ప్రభావితం చేస్తాయి. సమాజంపట్ల నిబద్ధత వుంటే తప్ప కవిత్వం నిరంతర యాత్రగా రాయలేడు. కేవలం పేరు కోసం రాయరాదు. నిరంతరంగా రాయాలి.

కవిత్వాన్ని నిర్మిస్తాం. ఈ విషయాన్ని తెలుసుకోవాలి. ముందుగా ముఖ్యమైన అంశాలు మనసులోకి రావాలి.

కవిత్వం రాయడం చెట్టు లాంటిది. వేర్లు మట్టిలో వుంటాయి. మనసులోతుల్లో దృక్పథాలు వుండాలి. పండు, ఆకులు, భావజాలం బట్టి వుంటాయి. పదాలు నీ భాషను బట్టి వుంటాయి.

మూల భావానికి సంబంధిత అంశాలు వున్నాయా? చూడాలి. చాలా పంక్తులు తొలగించే విధంగా వుండరాదు. ఉదాహరణకు ఒక కవిత చూద్దాం.

తాడు తెగినపుడు
జెండా విడివడినపుడు
అందులోంచి రాలేవి
పుష్పాలు కాదు
స్వాతంత్ర్య అమరవీరుల శిరస్సులు

దీని తర్వాత ఇంకా అమరవీరుల గురించి ఎంత రాసినా అది కవిత్వమనిపించదు. అందుకే తరువాత రాసిన దాన్ని కవి తొలగించాడు.

నెరుడా, మయకోవిస్కీ వంటి, కవులు పదాల కోసం పరితపించేవారు. ఒక్క పదం కోసం ఎన్నో గనులు తవ్వి రాస్తాను అన్నాడు మయకోవిస్కీ

కవిత రాసేటప్పుడు భావాంశాన్ని ఎన్నుకోవాలి. దాని చుట్టూ పదబంధాల్ని రాసేటప్పుడు పదం యొక్క ఔచిత్యాన్ని గమనించాలి. దీనికి ట్రెనింగ్ కావాలి. మంచి పదాలు కలిపితే పాఠకునికి అదే భావం స్ఫురిస్తుంది. వ్యవహారంలో వున్నవే ప్రయోగించు. గ్రాంధిక పదాలు తెచ్చివాడేవారు పేరు కోసం రాస్తారు. ఒక కవి రూపాజీవ అని వాడాడు. దీని అర్థం వేశ్య అని. కాని అతను వాడింది రూపంతో జీవించే వాడనే అర్థంలో. ఇలాంటి పదాలు వాడటంవల్ల అర్థం చెడుతుంది.

కేవలం భాష చమక్కులు వాడితే ప్రయోజనం లేదు. కవితాత్మకం చేస్తున్నానా? అని ఆలోచించాలి.

పోలికలు, భావచిత్రాలు, వరుసగా చెప్తాం. ముందుది బాగా హత్తుకుంటుంది. తరువాతవి బాగుండవు. అలా వుండరాదు. ఒక్కొక్క మెట్టు ఉపమానం, ప్రతీకలు, పెంచుకుంటూ పోవాలి.

ముగింపు సమస్య. ఏదో కావాలని పరిష్కారం చెప్పాలి. దుర్మార్గాల్ని ఎదిరించడం చెప్తారు. అత్యంత సహజంగానే ముగింపును కోరుకోవాలి.

కవిత్వం అవస్థకు సంబంధించింది. అంతర్గతంగా వచ్చేది. రాస్తూనే వుండగానే మూడ్ మారుతుంది.

చెట్టు జీవజలం లాగా కవిత్వం పుట్టాలి.

### డా. కడియాల రామ్మోహనరాయ్

(వర్తమాన కవిత్వం)

వర్తమానం అంటే ఏమిటి! హద్దు ఏమిటి? 1970 నుంచి ఇప్పుడి దాకా వచ్చిన కవిత్వం వర్తమాన కవిత్వం అందాం.

1970లో విరసం ఏర్పడింది. సాహిత్యం సంచలనం. స్తబ్దత బ్రద్దలైంది. చాలా మంది ఆకర్షితులయ్యారు. ప్రముఖుడు సుబ్బారావు పాణిగ్రాహి. వంగపండు, శ్రీశ్రీ, జ్వాలాముఖి, నగ్నముని, శివసాగర్, చిచ్చరపిడుగుల్లా వచ్చారు. 1972లో వచ్చిన కవిత్వానికి జలపాతపు వేగం వుండేది.

1970లో శ్రీశ్రీ లాగా విప్లవ కవిత్వం లాగా రాయకపోతే తమను పట్టించుకోరేమోనని అభిప్రాయం వుండేది.

సకల విలువల్ని
తోసేసి
కొత్త విలువల్ని పుట్టిద్దాం. అన్నారు విరసం ఆశయాలు కొడవంటి గంటి కుటుంబరావు రూపొందించారు. సిపిఐ (ఎంఎల్) పార్టీని విరసం అనుసరించదు. అని ఆయన రాశారు.

శ్రీశ్రీ విప్లవ కవిగా...
ఊగరా ఊగరా
వురికొయ్యల
వూగరా...! అంటూ రాశాడు

నేడు కొత్తగా వచ్చిన కవిత్వం ఏమిటి? ప్రభుత్వం చంపిన సాయుధ చర్యలను పోరాట యోధుల గురించి ఎలిజీలు రాస్తున్నారు. ఇదేనా కవిత్వం? వేంపెంట సంఘటనపై కవిత్వం ఎందుకు రాలేదు?

వర్తమాన తరంలో జయప్రభ 'యశోధరా' కవిత్వం రాసింది. కవిత్వ వాతావరణంలో ఎంతో మార్పు వచ్చింది.

అన్ని రంగాల్లో స్త్రీ విద్య అభివృద్ధి చెందింది. స్త్రీవాద కవిత్వం అనేక ప్రశ్నలు రేపింది. వంటిల్లుపై విమల రాసిన కవిత్వం చూస్తే చాలా తెలుస్తాయి. రాయప్రోలు స్నేహలతాదేవి 'కావ్యం రాసినపుడు స్త్రీ శరీర ధర్మాలను చెప్పినప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది.

పాలగుమ్మి పద్మరాజు పురిటి నొప్పుల గురించి రాశాడు. కాని నిర్మల 'లేబర్‌రూమ్'లో పురిటి నొప్పులు గురించి చాలా బాగా రాసింది.

దళిత స్త్రీ వాదుల్లోకి స్త్రీవాదం రాలేదు. పురుషుల అణచివేత వుంది. స్త్రీలు పురుషుల కామానికి గురవుతున్నారు. కాని శక్తివంతమైన కవిత్వం రాలేదు. స్త్రీల అణచివేత అనేక రూపాల్లో కవయిత్రులను అనుభవం వుంది.

కళ్ళుంటే చూసి
వాక్కుంటే రాసి - అన్నాడు శ్రీశ్రీ

మన చుట్టూ సమాజాన్ని పరిశీలిస్తే చాలా కావ్య వస్తువులు దొరుకుతాయి.

దళిత కవిత్వం - బాగా అలిసిపోయింది. 19వ శతాబ్దం వరకు కూడా అంటరానితనం గురించి, వీరేశలింగం, వేమన, బ్రహ్మంగారు చెప్పారు.

బ్రిటీషు వారి విధానాలు ఈ డిస్‌క్రిమినేషన్ తొలగించాయి. చదువుకొనే హక్కు కల్పించారు. అయినప్పటికి అంటరానితనం స్కూళ్ళలో వుండేది. జాషువా చదివే రోజుల్లో బెంచీలు దూరంగా పెట్టేవారు. నేడు పరిస్థితి మారింది. జాషువ కుసుమ ధర్మం చెప్పాడు కాని 1980లో ధిక్కార స్వరంతో వచ్చింది. దళిత కవిత్వం. 1980లో నీవు జీవించే హక్కేగాదు, సమాజంలో జీవించే హక్కు వుందని వచ్చింది. మాదిగలు, మాలల మధ్య దళిత బ్రాహ్మణులు తలెత్తారు.

మైనారిటీ, మానవత, ఆధునికాంతర వాదుల గురించి మాట్లాడుకోవాలి.

**జిలుకర శ్రీనివాస్**
**(కవిత్వంలో అల్లిక పొందిక)**

కవిత్వంలో వస్తువు, దాని వ్యక్తీకరణ, వాటి మధ్య తాత్విక సంబంధం గురించి చర్చించడమే అల్లిక, పొందిక.

కవిత్వమంటే భాషపరంగా చూస్తే కవిత్వం ఒక సంకేతాల వ్యవస్థ. భావాన్ని పరస్పరం వ్యక్తీకరించుకునేది భాష. భాష అంటే సంకేతాల వ్యవస్థ సంకేతం అంటే ఏమిటి? మనభావాల్ని ఎలా మోస్తుంది? అది సరియైనదా? వ్యక్తీకరించటానికి భాష సరిపోవట్లేదు అని చాలా మంది ఫిర్యాదు చేస్తుంటారు. ఇలాంటి పరిస్థితి వుంటుందా?

ది లిమిటేషన్ ఆఫ్ యువర్ నాలెడ్జ్ ఈజ్ యువర్ వరల్డ్.

మనం ప్రపంచాన్ని ఎంత తెలుసుకుంటామో అంతే జ్ఞానాన్ని కలిగి వుంటాం.

నా గీతం
ఏ ఏ శక్తులలో ప్రాణం
పొందిందో... అని శ్రీశ్రీ అంటున్నప్పుడు ఇదే సందేశం వినిపిస్తుంది-

ఒకదాన్ని ఎంపిక చేయటం అంటే మిగతావాటన్నిటిని తుడిచి వేయటమే.

కవిత్వమెప్పుడూ తుడిచేసే ప్రక్రియే. పదేపదే మార్పులు ఎందుకు చేస్తాం. అంటే ఇదే కారణం.

అన్‌కంట్రోల్డ్ ఇన్స్‌పిరేషన్ నుంచి కవిత్వం పుడుతుందని సోక్రటీస్ అంటాడు. ఈ కవితాన్ని అనేకసార్లు దిద్దుకుంటాం. భాష అసమగ్రమైనది. సరైన పదం కోసం వెదుకుతాం. కొత్త సంకేతం కోసం పరితపిస్తాం.

కొత్త సంకేతాలు దొరకనప్పుడు కవిత్వం రాయడం మానేస్తారు.

కవిత్వంలో నిర్మాణం వుండదా? వుంటుంది స్ట్రక్చర్ లేని కవిత్వం కూడా వుంది.

నిర్మాణం వున్న కవిత్వానికి ఒక కేంద్రం వుంటుంది.

దానికి ఒక ఆకారం ఇస్తాం. ఎత్తుగడ, ప్రారంభం, ముగింపును ఇస్తాం.

నిర్మాణ రహితంలో ఎత్తుగడ, ప్రారంభం, కొనసాగింపు వుంటాయి. కాని ఆర్డర్ వుండదు.

జ్వాలాముఖి రాసిన కవితలో...

జాతికి 'సంస్కృతి' లేకుండా పోయింది. అని మొదట రాసుకున్నాడు. దానినే జాతికి 'గుండె' లేకుండా పోయింది అని మార్చాడు. ఎడిట్ చేయడం ద్వారా ఇది సాధ్యమైంది. ప్రసిద్ధ కవితల్లో ఇలాంటి ఎడిటింగ్ గమనించవచ్చు.

నిన్న రాసిన కవిత్వం నేడు కొత్తగా రాస్తాం. నిన్నటిలాగే కొత్త కవిత్వం రాస్తే ఆకలి చనిపోయినట్లే. కొత్తకొత్త సంకేతాలు నిర్మించుకోవాలి. ఎలా రాయొచ్చు అనే అంశాలపై వెబ్‌సైట్‌లో వున్నాయి. తెలుగులో లేవు. వర్క్‌షాపుపై పుస్తకం రావాలి. ఇంగ్లీషులో వున్నాయి.

**సీతారామ్**
**(కవితానిర్మాణ రీతులు)**

గ్లోబలైజేషన్ ముఖం అమెరికా
ప్రపంచీకరణ ఏకముఖ
ప్రపంచీకరణ త్రిముఖ -ఐఎంఎఫ్, డబ్ల్యు.టి.ఒ, వరల్డ్ బ్యాంక్
ప్రపంచీకరణ సహస్రముఖి

వేగుంట విశ్వమోహన్ రాసిన కవిత్వంలో బిడ్డను ఎంతో వర్ణించి 'పున్ పోసుకొమ్మా' అని రాశాడు.

సమాజం కొన్ని పదాల్ని బహిష్క రించింది. కవిత్వ నిర్మాణంలో కవిత్వాన్ని పలికే తీరు వుంటుంది. ఇంటోనేషన్ వుంటుంది.

కవి శివారెడ్డిగారు తన కవిత్వాన్ని కరెక్టుగా రిసైట్ చేస్తారు. కవిత్వంలోని ఇంటోనేషన్ పట్టుకోగలిగితే సౌష్టవంతో, నిర్మాణ పటిష్టంతో అవగతమవుతుంది.

కవిత్వం చదవగానే మనకు అర్థం కావాలని అనుకుంటాం. దృక్పథం వున్నప్పుడు అదే కవితలో కొనసాగుతుంది.

**ఖాదర్‌మొహియుద్దీన్**
**(కవిత్వంలో అనుభవాలు)**

రావిశాస్త్రి - ఏది మంచి కవిత్వం? అన్నప్పుడు.

ఏది మంచిని తెలుపుతుందో అది మంచి కవిత్వం...

భాషకున్న బలాన్ని గుర్తించి రాసినవాడు శ్రీశ్రీ

నడకవేరు. నాట్యంవేరు. ఒక సిస్టిమ్ నడిపిస్తే నడక నాట్యం అవుతుంది.

భాష సాహిత్యంగా మారడానికి కావల్సిన ఇన్‌గ్రేడియన్స్ ఏమిటి?

కవిత్వంలో భాషా ప్రయోగంలో పదంకున్న తాజాదనాన్ని తీసుకురావాలి. షేక్స్పియర్ సాహిత్యం వారి కాలంలోకంటే తరువాతి కాలంలోనే ప్రజలకు వారి సాహిత్యం ఎక్కువ పరిచయమయింది. కారణం వారి జ్ఞానం విస్తృతమవడమే.

వసుధైక కుటుంబం అవగాహన బాగా పెరిగింది.

ఎల్లలోకము లొక్కఇల్లై.... అని అన్నాడు గురజాడ.

ప్రపంచాబ్జపు తెల్లరేకై.... అని అన్నాడు శ్రీశ్రీ.

ఒకే అర్థాన్నిచ్చే పదాలు వ్యక్తీకరించటం ఇక్కడ మనం చూస్తాం.

సాహిత్యంలో భాషకు సంబంధించిన అంశం. ఏ శ్రమా లేకుండా ఏది లభించదు. వేగుంట ప్రసాద్ కవిత్వం అర్ధమవుతుందా? సాహిత్యం అక్షర జ్ఞానం వున్నవారిదే. భాషకు చైతన్యాన్ని తీసుకురావటమనే స్పృహ వుండాలి.

**శివారెడ్డి**

**(కవిత్వంలో స్వానుభవం)**

ప్రతి వ్యక్తి కాలక్రమంలో పరిణామ క్రమానికి లోనవుతాడు. మార్పు శాశ్వతం.

దుఃఖాన్ని మాత్రం పిలవొద్దు.

అది దరిద్రం కన్నా దరిద్రమైంది.

కవిత్వం ఎందుకు రాయటం మానేస్తారు. సంకేతాలు దొరక్కకాదు.

ఉత్పత్తి, భౌగోళిక స్థితి, వర్గం, సమాజం ఇవన్నీ కవిని ప్రభావితం చేస్తాయి.

కవిత్వంలో సబ్జెక్ట్, కంటెంట్, ఫాం వుంటుంది.

నీ పరిపూర్ణత ద్వారా కవిత్వంలో విషయం కేంద్రానికి వస్తుంది.

ఐడెంటిటీ క్రైసెస్, ఐడిలాజికల్ క్రైసెస్ కారణంగా కవులు ఆగిపోతారు. వ్యక్తిలో సంక్షోభం ఎలా ఏర్పడుతుంది. ఈ దశాబ్దంలో కవులు, రచయితలు అదృశ్యమైనట్లుగా ఎవరూ అదృశ్యం కాలేదు.

సిద్ధాంతం విలువ కోల్పోదు. సిద్ధాంతం ఎక్స్‌టెండ్ చేయకపోతే నీవు మరణిస్తావు.

స్వంతంగా పని చేసేవారికి మంచి పట్టు వుంటుంది. నీవు ఎక్కన్నించి వచ్చావో మనం మరిచిపోయాం. నీవు అలియనేట్ అయ్యావ్. కొత్త వాతావరణాన్ని సృష్టించు కోలేకపోయావు.

సమస్త కవిత్వానికి జనసత్వాలు కవి ఉనికి నుంచి వస్తాయి. చిన్నతనంలో దరిద్రంలో జీవించే మనిషి జీవితం మానసిక వికాసం ఎక్కువగా వుంటుంది.

నా బాల్యం ప్రధాన భూమిక అయింది నా కవిత్వానికి.

చూడటం నేర్చుకో
చదవటం నేర్చుకో
వినడం నేర్చుకో

ప్రజా విలువల్లేని కళాసాహిత్యం ప్రయోజనం శూన్యం. కళా విలువున్న బూర్జువా సాహిత్యంవల్ల ప్రయోజనం లేదు.

ఒక పద్యంలాగా మరొక పద్యం వుండరాదు.

ఎక్స్‌ప్రెషన్ చాలా ముఖ్యం.

సజీవంగా వుండాలి. కవి తన కవిత్వాన్ని ఖండించుకోవాలి. కవి బానిస కారాదు. వ్యక్తిత్వ నిర్మాణం సాధించుకోవాలి. అప్పుడే కవిత్వ నిర్మాణం అవుతుంది. చెప్పేదానికి, నమ్మేదానికి ఒక బ్యాలెన్స్ క్రియేట్ చేసుకోవాలి. వ్యక్తిత్వ నిర్మాణంతోపాటే కవిత్వ నిర్మాణం జరుగుతుంది. జీవితంలో మోనాటనీ వస్తోంది. దీనిని ఛేదించాలి. ❖

---

# ఒకానొక గ్లోబల్ సందర్భంలో...

**జానకీ సైదులు**

ఆసరాల్లేని తనాల్లోంచి
వరమో భారమో తెల్వని
మన్నన లేని మాతృత్వం
మస్తిష్కాల్లో ఇంకా
లక్ష్మణ రేఖలు
మేల్కొనే వున్నాయ్

❖❖❖

అమ్మతనం జారిన
ఆడతనం
అవసరాల ఊబిలో
కొట్టు మిట్టాడుతూ
గ్లోబల్ యుగంలో
దజన్లకొద్దీ
పెదాలపై ప్రేమలు

❖❖❖

అరమరకలు లేని
అనేక మనస్సుల మధ్య
అంతా తానైన
అప్పటి అవ్వ ముఖం
చీకట్లోకి జారుతూ పోతోంది

నిండు కుటుంబాల్ని చూస్తూ
కళ్ళ బాష్పాల్ని రాల్చే
రోజుల్ని కళ్ళలో వత్తుకోని
ముఖంపై పులమబడ్డ విషాదాన్ని
దిగ మింగుతూనే వుంది
అంతా
అసిస్టెంటుల జీవితాల మధ్య
నలిగిన "అమ్మా" మనస్సు
మూలుగుతూ
నాటి సజీవ సంబంధాల్ని
ఎండిన నాలుకపై చప్పరిస్తూ
జ్ఞాపకాల పద్మవ్యూహంలో
చిక్కుకున్న దృశ్యాల్ని
ఎరుకుంటోంది

పూర్ సెంట్‌మెంట్‌ని
కృత్రిమ పెదాల సంధుల్లో
ఊదబడ్డ విలువల్ని
సాగేసుకుంటున్న
అమ్మ ముఖం
పునాదులు పెకిలించబడ్డా
వటవృక్షలా వంగిపోయింది
తరానికీ, తరానికీ మధ్య
బుల్లి (తెర) అగాధం
ఇంకా పెరుగుతూంది..
ఇదో ఆధునికానంతర పత్రిక
అంగట్లో అరుదైన
అమ్మ ప్రేమలు
చెప్పకుండానే వచ్చే
అమ్మతనాలు

# చదువు 'కొంటే'?




"పెతనికి బోన్ క్యాన్సర్... వ్యాధి బాగా ముదిరింది. ఇప్పుడేం చేసినా లాభంలేదు. ఇంటికి తీసుకు వెళ్ళి ప్రశాంతంగా ఉంచడమే మంచిది... ఎట్టి పరిస్థితులలోనూ పదిహేను రోజుల కంటే ఎక్కువ బతుకడు... బంధువులు, దూర ప్రాంతాల్లో, విదేశాల్లో ఎవరైనా ఉంటే రప్పించండి... ఇక మేం చేసేదేం లేదు..."

డా॥ కాలువ మల్లయ్య

డాక్టర్ మాటలే వెంకట్రామయ్య చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. మంచంలో పడుకోనున్న ఆతనికి ఇంకా బతకాలన్న ఆశేం లేదు. తానిక పదిహేను రోజుల కంటే ఎక్కువ బతుకడని తెలిసి పది రోజులయింది. తన కొడుక్కీ విషయం తెలిసీ పది రోజులయింది. అయినా జగన్ ఇంకా రాకపోవడం అతనికి బాధాకరంగా ఉంది. తన రక్తం పంచుకు పుట్టిన కొడుకు వస్తే. అతని చేతిలో తృప్తిగా కన్ను మూయాలనుంది. కంప్యూటర్ ఇంజనీర్గా ప్రపంచంలోని అత్యంత ధనవంతమైన దేశంలో ఉద్యోగం చేస్తున్న కొడుకు రాక కోసం వెంకట్రామయ్య ప్రాణం విలవిలలాడుతుంది. గిలగిలా కొట్టుకుంటుంది. గ్రీన్ కార్డు హోల్డర్ అయిన తన జగన్ రాందే వెళ్ళి పోవడానికి వెంకట్రామయ్యలోని జీవుడు సిద్ధంగా లేదు.

అతని మనసు కొడుకు రాక కోసం తండ్లాడుతుంది. జగన్ కోసం దేవులాడుతుంది.

అతని మంచం చుట్టూ చాలా మందే ఉన్నారు.

"జగన్ వచ్చాడా?" అడిగాడు మెల్లగా-

"ఇంకా రాలేదు బావా...! పక్కూర్లో ఉన్నాడనుకుంటున్నావా వెంటనే రావడానికి పోనీ మన దేశంలో కూడా లేదు కదా...! జగన్ రావాల్సింది అమెరికా నుంచి..."

అన్నాడు అతని బావ మరిది రాజనర్సయ్య..

"ఇంతకీ వస్తానన్నాడా? లేదా...?

'వస్తాడో రాడో తెలియదు. అంత దూరం నుంచి రావాలంటే ఎంత ఖర్చు...? పైగా ఎన్ని తతంగాలు పూర్తి చేసుకోవాలి..."

"ఫోన్లో మాట్లాడలేదా...?"

"మాట్లాడాం... రావడం కష్టమంటున్నాడు..."

తండ్రి చనిపోతే కూడా రాడా...?

జగన్ అన్న మాటలను వెంకట్రామయ్యతో చెప్పడానికి జంకుతున్నారు వాళ్ళు.

"చెప్పవేంది వెంకట్రెడ్డీ..." అన్నాడు మళ్ళీ వెంకట్రామయ్య.

ఇక చెప్పక తప్ప లేదు.

"ఇంకా చనిపోలేదు కదా...! నేను వచ్చి మాత్రం చనిపోయేవాన్ని ఆపగలనా...? అన్నాడు జగన్' అని చెప్పబోయే రాజనర్సయ్యను సైగ చేసి ఆపాడు వెంకట్రెడ్డి.. ఈలోగా వెంకట్రామయ్యే అన్నాడు మళ్ళీ...

"తండ్రి పోవడం రోజులు, గంటల్లోనే వచ్చిందన్న విషయం జగన్‌కు చెప్పారా...?"

"చెప్పాం బావా...?"

"జగనేమన్నాడు మరి...?"

"అన్నీ వదిలిపెట్టుకొని రావాలంటే ఎలా సాధ్యం అన్నాడు జగన్.

"నేనీ పాటికే పోయుండాల్సింది. కాని, జగన్ కోసం నాలోని జీవుడు కొట్టుకుంటున్నాడు..."

"జగన్‌ను రప్పించడానికి అన్ని విధాలా ప్రయత్నం చేస్తున్నాం. మామయ్యా... కాని... కాని..." అన్నాడు శ్రీనివాస్ ఆ వృద్ధుడేమన్నాడు.

"చనిపోతాడు. సీరియస్‌గా ఉన్నాడు అని చెబితే నమ్మకం కలుగకపోవచ్చు. మీనాన్న చనిపోయాడని ఫోన్ చేసి చెప్పేయిండ్రి. వెంటనే రమ్మని టెలెక్స్ మెసేజ్ ఇవ్వండి. నేను కన్నుమూసే వరకన్నా చేరుకుంటే అంతే చాలు..."

ఆ మాటలకు అక్కడున్న వాళ్ళంతా ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు. అయితే జగన్‌ను రప్పించడానికి అదే సరైందనిపిస్తుంది. వాళ్ళకు...



వెంకట్రామయ్య చెప్పినట్టే చేశారు.

వెంకట్రామయ్య డైడ్... స్టార్ట్ ఇమ్మీడియేట్లీ...

అవెయిటింగ్ ఫర్ యువర్ అరైవల్ ఫర్ ఫ్యునేరల్ ఈ విషయాన్ని రెండు మూడు పద్ధతుల ద్వారా జగన్‌కు తెలిసేట్టు చేశారు.

సిటీ కెళ్ళి ఐ.ఎస్.డి. చేసి వచ్చారు.

"అన్ని విధాలుగా చెప్పారు కదా...!"

"చెప్పాం పెదనాన్నా...!"

'జగనేమన్నా అనుమానించాడా...?'

"ఏడెనిమిదేళ్ళకు పైగా అమెరికాలో ఉంటున్నవాడు. ఇప్పటికే కోట్లు సంపాయించిన వాడు. గ్రీన్ కార్డ్ హోల్డర్... అనుమానించకుండా ఉంటాడా? అందరినీ. అనుమానించడం అభివృద్ధి చెందిన దేశంలో ఉండేవాళ్ళ లక్షణం కదా...?'

"అయితే జగన్ రాడంటావా శ్రీనివాస్..!"

"తప్పకుండా వచ్చేట్టు అన్ని ప్రయత్నాలూ చేశాము. ఇప్పుడిక చేసేదేం లేదు... రెండు మూడు రోజు లెదిరి చూడటమే. ఇప్పట్నుంచి ప్రయత్నించి నా రెండు మూడు రోజుల్లో వస్తాడు కదా...!"

"అప్పటి వరకు నేను బతికుంటానా...?"

"బతికుండకుంటే కర్మ చేస్తాడు... నిన్ను పున్నామనరకం పోకుండా చేస్తాడు. పుత్రుడు కదా! నువ్వు కోరుకున్నదీ అదే కదా వెంట్రామయ్యా..." అన్నాడు వెంకట్రెడ్డి.

ఆ వృద్ధుడి కళ్ళవెంట ధారాపాతంగా నీల్లు కారుతున్నాయి.

"బావా...! ఏంటిది...? చావు అనివార్యమని తెలిసీ ఏడ్వడం దేనికి...!"

"మామయ్య బావ కోసం ఎదిరి చూడటం తప్ప ఇప్పుడు మనం చేయాల్సిందేం లేదు..." అన్నాడు శ్రీనివాస్..

"నేనప్పటివరకుంటానా? పోయే ముందు ఒక్కసారి జగన్‌ను చూస్తే బాగుండేదని..."

"ఆ మాటెన్ని సార్లంటావు జగన్ వస్తే బాగుండేది... కాని, రాకుంటే చేసేదేముంది... వస్తాడన్న ఆశాలేదు..."

"అలా అనకు రాజనర్సయ్యా.."

ఎదిరిచూస్తూనే ఉన్నారు వాళ్ళు..

అతడు రాలేదు కాని అతన్నుంచో పెద్దలేఖ, డాలర్ల చెక్ వచ్చింది.

ఆ విషయం తెలిసి అందరూ గుమిగూడారు. వెంకట్రామయ్య చేతిలో పెట్టారా లేఖను.

అతి కష్టంగా లేఖ చదువుతున్నాడు వెంకట్రామయ్య ముఖంలో రంగులు మారుతున్నాయి. చదవడం పూర్తయ్యే సరికి ముఖం వివర్ణమయింది. ముఖంపై కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు.

అతని కళ్ళ వెంట ధారాపాతంగా నీళ్ళు కారుతున్నాయి. హృదయం విలవిలా తన్నుకుంటుంది. పుత్రవాత్సల్యంతో మనసు గిలగిలా కొట్టుకుంటుంది. బలహీనమైన ఆతని గుండె అందులోని విషయాన్ని భరించలేకపోతోంది. ఉత్తరం చేతిలోంచి కింద పడగా మంచంలో కొరిగాడు వెంకట్రామయ్య. గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. అతని మనసు జగన్ చదువుకుంటున్న రోజుల్లోకి వెళ్ళి గతంలో విహరిస్తుంది.

***

అరరే... ఏంటిది. ఏంటీ చదువులు..? ఇవి పిల్లల చదువులు కావు... పెద్దల చదువులయి పోయాయి. పిల్లల చదువుల కోసం మొత్తుకోవాల్సి వస్తుంది. చదువు చదువని చావాల్సి వస్తుంది. ఎంత మొత్తుకున్నా పిల్లలేమో వినరు. చూసుకుంటూ ఊర్కుండ బుద్ధిగాదు. ఈ చదువులు మాకొద్దు అనే రోజులపోయి చదువు చదువు పుస్తకాల పురుగై చదువు అనే రోజులొచ్చినయి. ఈ పోటీ భరించ రాకుంటుందా. పోటీ... పోటీ... పోటీ... ఈ పోటీలో చదువకుంటెలా...? పోటీపడి చదవాలి.. తన కొడుకును పోటీ పడి చదివించాలి. లోకంతో లూటలూట నలుగురితో నారాయణ అన్నట్టే అవుతుంది. తన కొడుకు జగన్ చదువులో హుషారు.. ఇంటలీజెంట్... తప్పకుండా రాంక్ తెచ్చుకుంటాడు. వెలిగారానికి బంగారం అద్దినట్టు తాము వెంటబడితే మరింత బాగా చదువుతాడు. అందుకే తాము ప్రోత్సహిస్తున్నాడు... జగన్ టెన్త్ కాగానే రెసిడెన్షియల్ పాఠశాలలో వేయాలి. ఇంజనీర్‌ను చేయాలి. ఫారిన్ పంపాలి. అమెరికా పోతే వాడు బాగా సంపాదిస్తాడు. తమ కుటుంబ స్వరూప స్వభావాలే మారిపోతాయి. అందుకే తన జగన్‌ను బాగా చదివించాలి. వాని చదువు భవిష్యత్తు కొసమే తన తపనంతా.."

తనలో తాననుకుంటూ ముఖంపై చిరునవ్వుతో ముందు గదిలో కొచ్చాడు వెంకట్రామయ్య – తన కొడుకు చదువులో నిమగ్నమై ఉంటాడని ఊహించిన వెంకట్రామయ్యకు నిరాశే మిగిలింది. కుర్చీలో కూర్చొని కండ్లు మూస్తూ తెరుస్తున్న జగన్ పైకి ఆగ్రహోదగ్రుడై లేచాడు.

"ఏంట్రా జగన్...? నువ్వు చేస్తున్న పనేంటి...? చదువుకొమ్మంటే కుర్చీలో కూర్చొని కూత్వట్లుపడుతున్నావా? ఏంటిది...?" అన్నాడు కోపంగా.

"లేదు డాడీ...! ఇప్పట్రాక బాగానే చదువుకున్నాను. ఇప్పుడే

పుస్తకం చేతిలోంచి జారిపోయింది" అన్నాడు జగన్ భయంభయంగా.

"నీకెంత చెప్పినా ఇంతే... నేను లోపలికెళితే చాలు నిద్రలోకి జారుకుంటావు... ఇట్లయితేమన్నట్టు...? బయట ఉన్న పోటీని తట్టుకోవాలంటే ఎంత కష్టపడాలో తెలియదా...?"

అని రెండు దెబ్బలేసాడు వెంకట్రామయ్య.

"ఏంటండీ!! పదవ తరగతి చదువుతున్న పిల్లవాన్ని కొడుతున్నారు. వాడు బాగానే చదువుకుంటున్నాడు... చదివిన కాడికి మాచాలు..." అంది లక్ష్మి...

"నోర్ముయ్ః నువ్వు... నీ గారాబంతోనే వాడిలా తయారయ్యాడు... నేను మొత్తుకుంటున్నదెవరి కోసం....? వాడి భవిష్యత్తు కోసమే కదా...! నీకేం తెలుసు చదువుల్లో పోటీ సంగతి. ఇలా అయితే వాడు స్టేట్స్ కెలా వెళ్తాడు? అందుకోసం మెరిటోరియస్ కావాలి.."

"స్టేట్స్‌కెళ్తేనే చదువుకున్నట్టా వెంకట్రామయ్య..! ఈ పిచ్చి నీకూ పట్టుకుందా...?"

అన్నాడు అప్పుడే వచ్చి సోఫాలో కూర్చుంటూ వెంకట్రెడ్డి.

"కాకపోవచ్చు. కాని బాగా చదువుకుంటే ఈ పోటీని తట్టుకొని నిలబడటం ఎట్లా..?"

"అందరూ పోటీపోటీగానే చదివారనుకుందాం. అంతా ఇంజనీర్లు, డాక్టర్లు అవుతారా? చెప్పు వెంకట్రామయ్యా...!"



"అందరితో మనకేంటి...? మన వాడు కావడం మనకు ముఖ్యం... పోటీ తట్టుకొని ఎవరు నిలబడితే వాళ్ళే మంచి స్థితిలోకి వెళ్తారు. అదంతే..."

"అందుకోసం పిల్లలను అన్నిటికీ దూరం చేసి మెదలు పంచి చదివించాలంటావు. ఎంతయినా పట్టుదల గలవాడివే. నీ కొడుకును మాదండి ఇంజనీర్‌ను చేసావనుకుందాం... అట్లయితే నీ లక్ష్యం నెరవేరినట్టేనా...?"

పుస్తకం మూసి వాళ్ళ మాటలు వింటున్నాడు జగన్..

తండ్రి దృష్టి అతనిపై పడనే పడింది..

వెంకట్రామయ్యకు కోపం, దుఃఖం ముంచుకొస్తున్నాయి.

"చదువురా... చదువురా... చదువకుంటెట్లరా..? కొంచెం సందుదొరికితే చాలు పుస్తకం మూసేస్తున్నావు. ఎంత మొత్తుకున్నా నీ సంగతింతేనారా...? ఈ పోటీని తట్టుకోకుంటే బతకడమెట్లరా...? నీ చదువు నా చావుకొచ్చిందిరా..."

మొత్తుకుంటున్నట్టన్నాడు వెంకట్రామయ్య.

"పోటీ తట్టుకోవడం ఎట్లా...? బతకడం ఎట్లా...? అంటూ దాదాపేడుస్తున్నట్టుంటున్న అతని దిక్కు ఆశ్చర్యచకితుడై చూస్తున్నాడు వెంకట్రెడ్డి. భర్త అంత ఆందోళన పడటమెందుకో లక్ష్మికీ అర్థం కావడంలేదు.

"నాన్నా...! నా చదువు గురించి మీరెందుకేడుస్తారు..? నేను బాగానే చదువుకుంటున్నాను... నేనే కదా మా తరగతిలో ఫస్టు మార్కులు తెచ్చుకునేది... ఇంకేం చేయాలి...?" అన్నాడు జగన్.

"ఇక్కడ ఫస్ట్ మార్కు నిజమే.. రేపు ఇంటర్‌లో నీలాంటి నిన్ను మించిన ఫస్ట్ మార్కుల వాళ్ళెంతో మంది చేరుతారు. అప్పుడు నీ స్థానమెక్కడుంటుందో తెలుసా...? మేమెంత ప్రయత్నించినా ఇక్కడ నిన్ను పోటీకి నిలబడేట్టు చదివించడం కష్టం. అనేక విషయాల్లో ఏకాగ్రత లేకుండా పోతుంది. అందుకే ఇంటర్‌లో నిన్ను విజయవాడ తీసుకెళ్ళి రెసిడెన్షియల్ కాలేజీలో చేర్చుతాను. వాళ్ళయితే చెవులు పిండి మరీ చదివిస్తారు..."

ఆ మాటలకు వణికిపోయాడు జగన్.

"డాడీ...! నేను మీతోనే ఉండి బాగానే చదువుకుంటాను... హాస్టల్లో ఉండటం నాకిష్టంలేదు.." అన్నాడు...

"ఇక్కడయితే ఎగరొచ్చు దుముకొచ్చని కదా... ఇలా అయితే పోటీని తట్టుకోవడం కష్టం... నువ్వు ఇంటర్‌లో రెసిడెన్షియల్‌లో ఉండాల్సిందే... అక్కడుంటే తప్ప నీకు ఎంసెట్‌లో మంచి ర్యాంకు రావడం కష్టం..."

జగన్ ముఖంలో భయాన్ని గమనించాడు వెంకట్రెడ్డి...

"నీకంత పట్టుదలెందుకోయ్ వెంకట్రామయ్యా...?" అన్నాడు.

"వాట్ని జైలు బళ్ళంటారు కాదండీ...! అప్పటి వరకు చూద్దాం కాని ఇప్పట్నుంచే ఆ ప్రసక్తెందుకండీ..?" అంది లక్ష్మి...

"ఇంకా చూసేదేముంది? ఇంకో నెల రోజుల్లో పదవ తరగతి పరీక్షలయి పోతాయి కదా...! ఆ తర్వాత ఎండాకాలంలో మంచి కాలేజీ చూసి విజయవాడలో జాయిన్ చేయడమే.. వాట్ని జైలు బడులని ఎవరన్నారు...? అవి జైలు బళ్ళయితే మరీ మంచిది.. జైలులా ఉంటుంది కాబట్టే బయటకు పోలేరు. బయటకు పోలేరు కాబట్టే బాగా చదువుతారు..."

అలాంటి బడంటే భయం భయంగానే ఉంది జగన్‌కు...

"వెంకట్రామయ్యా...! ఆటకు పాటకు కోకరికులర్, ఎక్స్ట్రాకరికులర్ ఆక్టివిటీలన్నిటికీ దూరం చేస్తూ చదివించే ఆ చదువులపై నీకింత మోజుండటం ఆశ్చర్యకరంగానే ఉంది. సరే కానియ్... నీ కొడుకును ఇంజనీర్‌ను చేయడానికి జైలుబడేంది జైల్లోనయినా ఉంచుతానంటావు..." అన్నాడు నవ్వుతూ వెంకట్రెడ్డి.

"నాన్నా...! ఒక్క ప్రశ్న మీరు చిన్నతనంలో ఆటపాట ఇతర విషయాల జోలికి పోకుండా మాలాగే చదువుకున్నారా...?" అన్నాడు జగన్.

ఊహించని ఆ ప్రశ్నకు జవాబు చెప్పడానికి వెనుకా ముందవుతున్నాడు వెంకట్రామయ్య.

జగన్ ప్రశ్నతో అతని మనసు ముప్పయేళ్ళ గతంలోకెళ్ళింది.

తాను ఆడుతూ పాడుతూ చదువుకునే వాడు... ఆటల్లో పాల్గొనే వాడు.. వ్యాసరచన, వక్తృత్వ పోటీల్లో పాల్గొనేవాడు. ఏకపాత్రాభినయాలు, నాటికలు కూడా వేసేవాడు. పాఠశాలల్లో జరిగే అన్ని కార్యక్రమాల్లోనూ పాల్గొనేవాడు. హాయిగా చదువుకునేవాడు. చదువంటే నిర్బంధముండేదికాదు... తాను దీపం ముందు కూర్చొని చదువుకుంటుంటే ఊర్కే చదవడమేనారా అని తన తండ్రి దీపాన్ని ఆర్పేసేవాడు...

"చెప్పు వెంకట్రామయ్యా...! నీ కొడుకు ప్రశ్నకు జవాబు చెప్పు..." అన్నాడు వెంకట్రెడ్డి.

"నాన్నా...! మీరెన్నోసార్లు చెప్పారు. మీరు హాయిగా చదువుకున్నారని ఆడుతూ పాడుతూ చదివారని మీరేమో అట్లా చదువుకొని మమ్మల్నేమో అన్నిటికీ దూరం చేసి బలవంతంగా చదివించడం న్యాయమా..?"

ఆ ప్రశ్నకు ఖంగుతిన్నాడు వెంకట్రామయ్య...

"అప్పుడింత పోటీ లేదు... ఇలాంటి ఇంగ్లీషు మీడియాలు తక్కువే... అప్పటికి ఇప్పటికి పోలిస్తే ఎలా...? మా కాలంలో వలెనే ఈ కాలపు చదువులున్నాయా...? ఈ పోటీని తట్టుకోవాలంటే బలవంతం చేయక తప్పడంలేదు.."

ఆ టౌన్‌లోనే ఉండే అతని బావమరిది రాజనర్సయ్య వచ్చి కూర్చున్నాడప్పుడే.

"బావా...! జగన్ ప్రశ్న ఆలోచించదగ్గదే.. మీరు అన్నీ అనుభవిస్తూ చదివారు. సోషల్, ఇంగ్లీషు, తెలుగు అన్నీ చదివారు. వాళ్ళకవి ఉన్నా వాటి మీద శ్రద్ధ చూపడంలేదు... నేనెప్పుడు మీ ఇంటికొచ్చినా జగన్ సైన్సు, మ్యాథ్స్ పట్టుకొనే ఉంటాడు. వాటికే ట్యూషన్ పోతాడు. వానికి ఆటలు పాటలు అన్నీ బంద్ చేసి మెకానికల్ చదువులు చదివిస్తున్నావు బావా...! కాదంటావా...?" అన్నాడు..

"చెప్పడానికేంటి? ఎన్నయినా చెప్పొచ్చు... విపరీతమైన పోటీని తట్టుకోవాలంటే బలవంతపు చదువులయినా తప్పడం లేదు. డాక్టర్లు, ఇంజనీర్లు కావాలంటే ఇలా చదువక తప్పదు మరి..."

"వెంకట్రామయ్యా...! మీ వాన్ని ఇంటర్‌లో జైలు బడిలోనే వేసి పెద్ద ఇంజనీర్‌ను చేస్తానంటావు. అలాగే కానియ్... కాని ఈ చదువులన్నీ టెక్నో ఎక్స్‌పర్ట్‌ను తయారు చేస్తాయేమోకాని మనుషులను తయారు చేయవనుకుంటాను. మనం చదువుకున్నప్పుడున్న సామాజికత కూడా ఈ బలవంతపు చదువుల్లో కనబడటంలేదు. నువ్వు పూర్తి మెకానికల్ చదువులనే ప్రోత్సహిస్తున్నావు. సరే... వేలు పోసయినా మంచిదే చదువు 'కొంటా'నంటావు. అంతకు ఎన్నో రెట్లెక్కువ సంపాదించే సాధనంగా నీ కొడుకును దిద్దుతానంటావు. సరే... నీ ఇష్టం... కాని నువ్వేం చేస్తున్నావో ఒక్కసారి ఆలోచించు... పిల్లలను బాగా చదివించాల్సిందే... కాని ఆ చదువులు ఎటు పోతున్నాయో గమనించకుండా బాగా డబ్బు సంపాదించడానికే చదువులన్న పద్ధతిలో చదివిస్తే మంచిదా...? ఒక్కసారి ఆలోచించు నీ కొడుకు లోపలికెళ్ళి చదువుకుంటున్నాడు కదా...! వాని ముందు ఈ మాటలనొద్దని ఇంత సేపు ఆగాను..." అని లేచి నిల్చున్నాడు వెంకట్రెడ్డి...



"వస్తాను" అని వెళ్ళిపోయాడు...

మిత్రుడు వెంకట్రెడ్డి మాటలు అతని హృదయానికి తాకాయి. అయినా వాటిని తేలికగానే తీసుకున్నాడు.

ఎస్.ఎస్.సి. మంచి మార్కులతోనే పాసయ్యాడు జగన్ పేరు మోసిన రెసిడెన్షియల్ కాలేజీలో చేరుద్దామని జగన్‌ను తీసుకెళ్ళాడు వెంకట్రామయ్య విజయవాడలోని ప్రఖ్యాతి చెందిన ఏ రెసిడెన్షియల్ కాలేజీలోనూ తెలుగు ఒక్క సబ్జెక్టుగా కూడా లేకపోవడం గమనించాడు. అదే విషయం అడిగాడు.

"సార్... తెలుగెందుకో చెప్పండి - నిజానికి లాంగ్వేజెస్ కోసం సమయాన్నంతా వెచ్చించడం వృథా - ఇంగ్లీషు మీడియం కాబట్టి ఇంగ్లీషున్నా ఆ సంగతి వేరు సిలబస్‌లో భాషగా మరో భాషుండాలి కాబట్టి సంస్కృతం, ఫ్రెంచి, ఇతరాలు పెట్టాం. తెలుగులోనయితే మార్కులు రావు. సంస్కృతం, ఇతర భాషల్లోనయితే నూటికి నూరు మార్కులొస్తాయి..."

మాతృభాషలో మార్కులెందుకు రావు, అప్పుడే నేర్చుకొని రాసే భాషలో మార్కులెందుకు వస్తాయని అడుగుదామన్నా అడగలేదు. వెంకట్రామయ్య... వెతికి వెతికి మాతృభాషలో అసలే బోధించే మాట్లాడే అవకాశాలు లేని కాలేజీలో జగన్‌ను చేర్చాడు.

చిన్నతనంలో నీతి పద్యాలు, వేమన, సుమతి శతకాలు, రామాయణ మహాభారత, పురాణాలు, ఇతిహాసాల నుండి తీసుకున్న ఎన్నెన్నో పాఠాలను చదువుకొని ప్రేరణ పొందిన విషయాలు వెంకట్రామయ్యకు జ్ఞాపకం వచ్చాయి. ఒక్క క్షణం తెలుగుంటే బాగుండునన్న ఆలోచన వచ్చినా దాన్ని బలవంతంగా అదిమి పెట్టాడు. తనకు కావాల్సింది మార్కులు, తన కొడుకు ఇంజనీర్ కావడం, బాగా సంపాదించడం అన్న ఆలోచనతో తనను తాను సంతృప్తి పరుచుకున్నాడు.

కొడుక్కోసం లక్షలయినా పెట్టడానికే నిర్ణయించుకున్నాడు...

ఆ తర్వాత ఇంజనీరింగ్‌లో చేరాడు జగన్..

"ఏమో అనుకున్నాను కాని మావాడి చదువు కోసం లక్షల్లో ఖర్చవుతుంది. ఈ ఖర్చు భరించడం కష్టంగా ఉంది వెంకట్రెడ్డీ...!" అన్నాడు వెంకట్రామయ్య....

"ఇంజనీరింగ్ సీటు నువ్వనుకున్న బ్రాంచిలో, అనుకున్న కాలేజీలో డొనేషన్ కట్టే మరీ చేర్పించాను... ఖర్చు లక్షల్లో కాకుంటేమవుతుంది...? రేపు అమెరికాకు వెళ్ళి సంపాదించగా నీ కొడుకు..."

"ఏమో వెంకట్రెడ్డీ! మధ్యతరగతి ఆలోచనలు... ఆశలు... విదేశాల కెళితే ఈ గొంగళి పురుగు బతుకులకు తెర పడుతుందన్నన ఆశ.... ఇది అత్యాశంటావా...?"

"కాకపోవచ్చు వెంకట్రామయ్య....! కాని ఇతరాలు ఏవీ చదవకుండా ఇవే చదవాలని ఈ మధ్య ప్రత్యక్షంగా, పరోక్షంగా ఒత్తిడి చేయడం నాకైతే నచ్చని విషయం... ఇది వేగమో మరేంటోకాని ఇందులో ఎన్నో అపశ్రుతులున్నాయనిపిస్తుంది. చదువుల్లో ఇదువరకున్న కాస్త సామాజికత కూడా దూరమవుతుందేమో ననిపిస్తుంది. ఈ పద్ధతిలో ఒకటి రెండు తరాలు ప్లాస్టిక్ సంతతిగా మారే ప్రమాదముంది. వీళ్ళలోంచి గొప్ప ఇంటలీజెంట్స్ వెళ్ళొచ్చు. గొప్ప టెక్నాలజీ నిపుణులు రావచ్చు... బాగా డబ్బు సంపాదించే వాళ్ళు వెళ్ళొచ్చు... కాని రచయితలు, సామాజికులు, తాత్వికులు వచ్చే అవకాశం లేదు. ఇవి మానవతకు దూరంగా జరుపుతూ డబ్బుకు దగ్గరగా జరిపే చదువులనిపిస్తున్నాయి. వేలు లక్షలు పెట్టి చదువునుకొంటే అంతకంటేముంటుంది. వెంకట్రామయ్య...! నువ్వు రేపు మరికొన్ని లక్షలు పెట్టి మీవాన్ని అమెరికా పంపిస్తాను. వాడు బాగానే సంపాదిస్తాడు. సంపాదన.. సంపాదన... సంపాదన.. ఇంకా సంపాదన.. ఇంతకంటే మరేం కావాలి...? నువ్వనుకున్నది నెరవేరుతుంది కదా...!"

వెంకట్రెడ్డి మాటలకు కొంచెం భయపడ్డాడు వెంకట్రామయ్య... తర్వాత మామూలే... లక్షలు పోసి కొడుకును అమెరికాకు పంపించాడు... జగన్ అక్కడే ఎమ్మెస్ చేసి ఉద్యోగం సంపాదించుకున్నాడు. బాగానే సంపాదించుకుంటున్నాడు. రెండేళ్ళ క్రితం వచ్చి పెళ్ళి చేసుకొని అమ్మాయిని వెంట తీసుకెళ్ళాడు.. డాలర్ల సంపాదనలో మునిగి తేలుతున్నాడు..

***.

వెంకట్రామయ్య కళ్ళ వెంట పటాపటా నీళ్ళు కారుతున్నాయి.

15

దుఃఖభారంతో నోట్లోంచి మాట పెకిలి రావడంలేదు.

ఒకప్పుడు వెంకట్రెడ్డి అన్న మాటలు అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

ఇలా ఎందుకు జరుగుతుంది...? కొడుకును అమెరికా పంపడానికి తన సర్వస్వం ధారబోసాడు. అలాంటి కొడుకు ఈ సమయంలోనయినా రాడా...? తన చావునైనా చూడడా...? మరయితే తన నెవరు కాలేస్తారు...? తనకు తలకొరివి ఎవరు పెడ్తారు...? ఇంత యాంత్రికత, విధ్వంసం ఎప్పుడు మొదలైంది. ఏం జరుగుతుందసలు...? జైళ్ళలోలా మనుషులకు నంబర్లు ఇచ్చినప్పుడే మొదలయిందా...? బి4యు, 2 ఎంయుసిహెచ్ ఏంటిది...?

ఏం జరుగుతుందసలు...? ఇంత అమానవీయతకు కారణమెవరు...? వీటికి మూలాలెక్కడున్నాయి...?

గంటల్లో బతుకు ముగింపబోతున్న వెంకట్రామయ్య ఎంత ఆలోచించినా ఈ విధ్వంసానికి గల మూలాలనందుకోలేకపోతున్నాడు.

'నన్ను కూర్చోబెట్టండి... ' అన్నాడు కన్నీళ్ళు తుడుచుకుంటూ శ్రీనివాస్, రాజనర్సయ్య కలిసి అతన్ని లేపి మంచంలో కూర్చోబెట్టారు..

'ఉత్తరం సరిగ్గా చదువలేకపోయాను. ఒక్కసారి చదువుతావా రాజనర్సయ్య..." అన్నాడు.

లేఖను చేతిలోకి తీసుకున్నాడు రాజనర్సయ్య...పూజ్యులైన నాన్నగారికి-



ఈ ఉత్తరం చేరేనరికి మీరుంటారో ఉండరో తెలియదు... మామయ్య...! వెంకట్రెడ్డిగారూ...! అమ్మా...! శ్రీనివాసూ...! నేనిప్పుడు అక్కడికి వచ్చి చేసేదేం లేదు... ఎవరు వచ్చినా పోయే వాళ్ళను ఆపలేరు. ఉద్యోగ విషయంలో కఠిన నిబంధనలు ఉండటంవల్ల నేనిప్పుడు రాలేను. వచ్చి చేసేదీ శూన్యమే... నేను కుటుంబంతో సహా వచ్చి పోవాలంటే ఖర్చు మూడు నాలుగు లక్షలవుతుంది. ఆ డబ్బును మరో విధంగా ఉపయోగించుకుంటే మంచిది కదా..! ఎందుకొచ్చిన అర్థంలేని సెంటిమెంట్లు...

కర్మ ఎవరు చేస్తే మాత్రమేముంది...? చెల్లె, బావ చేస్తే పోయేదేముంది..? కావాల్సింది డబ్బు... ఆ డబ్బు నేను పంపిస్తున్నాను... నాన్న నా కోసం బాగానే ఖర్చు చేసాడు... ఆ డబ్బు అణా పైసలతో సహా పంపిస్తున్నాను... దాంతోపాటు కర్మ ఘనంగా చేయడానికీ డబ్బు పంపిస్తున్నాను. పదహారు వేల డాలర్లు అంటే ఎనిమిది లక్షల రూపాయలు పంపుతున్నాను. ఈ డబ్బు నాకు తిరిగి ఇవ్వాల్సిన పని లేదు. కర్మ ఇతర ఖర్చులకు పోగా మిగిలిన డబ్బును అమ్మ, అక్కను పోషించడానికి చెల్లె ఉపయోగించుకుంటుంది. నా చదువుకు, ఇతరత్రా పెట్టిన ఖర్చుకు ఇది మాత్రమే అనుకున్నా మరే మనుకున్నా ఫర్వాలేదు. నన్ను బాగా సంపాదించాలని చదివించాడు నాన్న. బాగానే సంపాదిస్తున్నాను. సంపాదిస్తూ కూడా రుణం తీర్చుకోకుంటే ఎలా...? అందుకే ఈ డబ్బు పంపడం.

నేనిప్పుడు రాలేను... వీలైనప్పుడు లేదా ఏడాది దినం వరకు వచ్చే ప్రయత్నం చేస్తాను. ఆఖరి దశలో నాన్నను చూడలేకపోయినందుకు దుఃఖంగా ఉంది. అన్ని కార్యక్రమాలు ఘనంగా చేయండి. ఖర్చుకు వెనుకాడకండి. డబ్బుతో సాధించలేని దేముంది...? కావాలంటే నేనిక్కడ కర్మ చేస్తాను. విషయాలు తెలుపండి.

రాలేకపోతున్నందుకు క్షమాపణలు కోరుతూ..

విషాదాశ్రువులతో

మీ పుత్రుడు

జగన్

అందరి హృదయాలూ బరువెక్కాయి.

లక్ష్మి భోరు భోరున ఏడుస్తుంది.

వెంకట్రామయ్యకు ఈ లోకమే శూన్యంగా కనబడుతుంది.

చాలా సేపటి వరకూ ఎవరేం మాట్లాడలేదు.

చివరి దశలో ఉన్న తన కన్నీళ్ళు తుడవడానికే కాకుండా, కర్మ చేయడానికి తన ఒక్కగానొక్క కొడుకు రాడన్న విషయాన్ని వెంకట్రామయ్య జీర్ణించుకోలేకపోతున్నాడు. తన కొడుకులో ఇంత అమానవీయత...?

ఇక ఆలోచించలేకపోయాడు వెంకట్రామయ్య...

కట్టలు తెంచుకు వస్తున్న అతని దుఃఖాన్ని అంతే లేదు... అతన్నలాగే ఏడువనిచ్చారు కొంత సేపు...

"రాజకీయాల్లాగే ఈ చదువులూ, జీవితమూ యాంత్రికమయ్యాయి. ఒకప్పుడు రాజకీయాల్లోకి సేవాభావం కలవాళ్ళే పోయేవారు. ఇప్పుడు రాజకీయాల్లో సేవాభావం కలవారి కోసం వెతకడం అత్యాసే అవుతుంది కదా...! ఈ చదువులూ బాగా సంపాదించడం అనే దిశగా సాగుతుండటంవల్ల కుక్కమూతిపిందెలు తయారవుతున్నారు... మానవీయతకు దూరంగా ఇంటలెక్చువల్ బులెట్స్ తయారైతే జరిగేదిదే. వీళ్ళ నుంచి సెంటిమెంటును, కుటుంబ బాధ్యతలను తల్లితండ్రుల పట్ల భక్తి, దేశభక్తిని ఆశించడం అత్యాశే అవుతుంది... కాదంటావా వెంకట్రామయ్యా...!" అన్నాడు వెంకట్రెడ్డి.

"కావచ్చు వెంకట్రెడ్డీ...! కాని నా కొడుకు చాలా ఘనుడు... నా కర్మ కోసం, వాన్ని చదివించినందుకు అన్ని పనులకు ఖరీదు కట్టి మరీ పంపాడు.... వాడు తల్లితండ్రుల పనులకూ ఖరీదు కట్టే షరాబు...! ఏంటనుకుంటున్నావు...? నేను వేలు, లక్షలు పెట్టి చదివించాను కాబట్టి నా డబ్బు నాకిచ్చేసాడు. నా బాకీ తీర్చేసాడు... అటువంటప్పుడు వీడెందుకొస్తాడు...? ఎందుకు రావాలి...?

వెంకట్రెడ్డీ...! ఇందులో జగన్‌ను తప్పుపట్టాల్సిందేముంది...? నేను వాన్నెందుకు చదివించాను...? బాగా డబ్బు సంపాదించాలనే కదా... అంటే డబ్బు కొసమన్నట్టే కదా...! నేనెందుకు చదివించానో ఆ పని నెరవేర్చాడు జగన్... నేను కోరుకున్నది చేసాడు. డబ్బు కోసం చదివించాను కాబట్టి డబ్బిచ్చేసాడు. అల్లికల్లి సున్నకు సున్నా...బేబాకీ... అయినా అంత దూరం నుంచి వాడెందుకు రావాలి...? వాడు సరైన పనే చేసాడు... నా కొడుకు కదా...! నాకు తగినట్టే చేసాడు. ఇందుక్కారణం నేనే... ఇది నాలాంటి తండ్రులకు కనువిప్పు కావాలి... నా రక్తం పంచుకొని పుట్టిన కొడుకు తప్పు చేయలేదు... నాదే తప్పు... నాదే తప్పు వెంకట్రెడ్డీ... నాదే తప్పు రాజనర్సయ్యా...! నేనే దోషిని..."

గొడగొడా ఏడుస్తున్నాడు వెంకట్రామయ్య...

కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు...

అతన్ని ఓదార్చడం ఎవరివల్లా కావడంలేదు...

ఏడ్చి ఏడ్చి మంచంలో కొరిగాడు వెంకట్రామయ్య...

ఒకటి రెండు నిమిషాల్లోనే లేచి కూర్చున్నాడు...

"వెంకట్రెడ్డీ...! నువ్వు నాకు ప్రాణ స్నేహితునివి కదా...! మొదట్నుంచే మా కుటుంబ విషయాలన్నీ తెలిసిన వాడివి కదా...! ఒక్క ప్రశ్నకు జవాబు చెబుతావా...? బహుశా ఇదే నా ఆఖరు ప్రశ్న..."

"నీ కంటే ఎక్కువ నాకేం తెలుసు వెంకట్రామయ్యా...! సరే... అడుగు... నాకు తోచింది నేను చెబుతాను..."

"జగన్ ఉన్నత చదువులు చదివాడు కదా...! ఒక్క మన దేశంలోనే కాకుండా విదేశాల్లోనూ చదివాడు.. చదువుకున్న వాళ్ళు ఇలా ఉంటారా వెంకట్రెడ్డీ... మన తరంలోని స్పందనైనా వానిలో ఎందుకు లేదు...?"

"వెంకట్రామయ్యా... నువ్వేమో చదువుకున్నావు.
నీ కొడుక్కేమో చదువును 'కొన్నావు'
అందుకే నీలోని స్పందనైనా జగన్‌లో లేదు...
జగన్ చదువుకుంటే ఇలా చేసేవాడు కాదు...
చదువు 'కొంటే'? జరగేదిదే...!

ఆ మాటలలో అక్కడి వాతావరణం మరింత బరువెక్కింది...

"బాగా చెప్పావు వెంకట్రెడ్డీ...! ఇక నాకు సెలవిప్పించండి... మహా అయితే నేనింకో రెండు మూడు రోజులు బతుకుతానేమో...! కాని నాకు బతకాలని లేదు... నా చావును నేను ముందుకు జరుపుకుంటున్నాను..." అని ముక్కులో ఉన్న ప్రాణవాయువు గొట్టాన్ని తీసిపారేసాడు వెంకట్రామయ్య.

"నేను పోతున్నాను... వెళ్ళిపోతున్నాను... ఈ అమానవీయతను నేను భరించలేను..." అంటూ

ప్రాణాలు వదిలాడు..

అక్కడున్న వాళ్ళంతా గొల్లుమన్నారు.. ఆ ఏడ్పుల ధ్వనులు మిన్ను ముట్టాయి. కాని, ప్రపంచమే ఓ కుగ్రామంగా మారుతుందని చెప్పబడుతున్నా ఆ ధ్వనులు చేరాల్సిన వారికి చేరే అవకాశాలు లేవు... చేరినా జగన్ వాటిని స్వీకరించడానికి సిద్ధంగా లేడు... తన 'సంపాదన లక్ష్యాన్ని' పక్కకు పెట్టి సమయాన్ని వృథా చేయదలుచుకోలేదు.

---

# కనిపించని శత్రువు

**డా. జూపల్లి ప్రేమ్‌చంద్**

అవాక్కైన నిన్ను
దృశ్యం వెనుక దృశ్యం తరుముతుంటుంది
ఆరేండ్ల కొడుకు సూపర్‌మేన్‌లా మిద్దె మీద నుంచీ దూకి
కాళ్ళు విరగ్గొట్టుకున్న వైనం
కళ్ళ బుల్లి తెరకు అప్ప చెప్పిన పెళ్ళాం సస్పెన్స్‌తో
అన్నం పెట్టక అపరచితుడిని చూసినట్టు చూడటం
ఇంటికొచ్చిన సన్నిహితులు చూపులు రంగులహరివిల్లుకు చిక్కి
మిడిగుడ్లేసుకొని ఇంటిని పరికించటం
ఇంట్లోరంగుల పిట్ట టి.వి. తిష్టవేసింది మొదలు
ప్రతి ఇల్లూ ఒక వస్తు ప్రదర్శనశాల
ప్రపంచంలోని అందగత్తెలెందరో అయిన దానికీ కాని దానికీ
అర్ధనగ్నంగా తమ అందాలను ఆరబోసుకోవటం
జాన్సన్ వడి వడిగా నడిచొచ్చి రాక్ మ్యూజిక్‌తో డాన్స్ చేయడం
అప్రయత్నంగా ఇంటిల్లిపాది తేలియాడ్తూ పాదాలు కలపడం
ఇంటర్ మీడియట్ కొడుకు యంగ్ ఈడియట్ అమెరికా వైపు అర్రులు చాచడం
అంతా అగమ్యగోచరం!
అంతా అర్థమవుతున్నట్టేవుంటుంది. ఏదీ అంత చిక్కదు!
అందుకే!
ప్రపంచీకరణ అంటే అరచేతిలో స్వర్గాన్ని చూపించడం
సరళీకరణ అంటే నీ దేశాన్ని సుతారంగా కొల్లగొట్టి
డొల్లతనాన్ని మిగల్చటం.

✣✣✣

చాపకింద నీరులా
అగంతకుడి దాడి విస్తృతం అవుతుంది
కష్టపడకుండా మిలియనీర్ కావడం ఎలా?
లోకమంతా లోలకంలా దేగ కరకు గోళ్ళ పంజాకు వేళ్ళాడుతూ
ఈజీ ఎర్నింగ్... ఈజీమనీ... అని పలవరిస్తూ
స్వార్థం క్రిమి మనిషి మెదడును తొలిచేస్తూ... ఉన్మాదిని చేస్తోంది!
ఉన్మాదంతో ఊరేగుతున్న మనిషి లక్ష్యం
డాలర్ల చెట్టును పెరట్లో నాటుకోవడం
డాలర్ల చెట్టు అగంతకుడి చేతిలో ఆయుధం కదా!
స్వార్థాన్ని ఆయుధంగా ధరించిన వాడు ఎప్పటికీ హానికరమే!
అప్రయత్నంగా చివరి అంకానికి తెరవేస్తుంది!

✣✣✣

చివరి సన్నివేశంలో
దేవర దున్నను ముస్తాబు చేసినట్టు
నీ మాటను నీ భాషను నీ సంస్కృతిని నీ నాగరికతను
చివరికి నీ జాతి అంతరాత్మను పసుపు కుంకుమల్తో అభిషేకించి
పోలేరమ్మ గుడి కాడకు తీసుకెళ్తారు
డాలర్ చెట్టు కొమ్మల్తో పూనకంతో వూగుతూ
నిన్ను ఆవాహన చేసే ప్రయత్నంలో!

✣✣✣

ఇప్పుడు నిన్ను వేధిస్తున్న ఒకే ఒక ప్రశ్న
డాలర్ చెట్టుకు ఉరివేసుకోవడమా?
డాలర్ చెట్టును కూకటి వేళ్ళతో పెకలించటమా?
అగంతకుడు కరవాలాన్ని గాలిలోకి లేపే లేపకనే
ఉవ్వెత్తున ఎదురు నిలిచిన జన సందోహం లేచిన జనకెరటంగా...
కాలికి బుద్ధి చెప్పాలన్న అగంతకుడి పన్నాగం వ్యర్థమవుతుంది
చివరికి దున్న కొమ్ముల్లో చిక్కుకొని గాల్లోకి లేచిన
అగంతకుడి జీవశ్చవం
డాలర్ చెట్టు జనం పాదాల కింద నలుగుతూ
డప్పులు కొమ్ము బూరల్లో జనసంస్కృతి బ్రద్దలవుతుంది
ఆకాశం దద్దరిల్లుతుంది

"నేడు ప్రపంచమంతా ఒక పల్లెటూరు"
- మార్షల్ మాక్ లూహాన్

# తెలుగు సాహిత్య చరిత్ర రచన

ప్రాచీన సాహిత్య చరిత్ర రాయటానికి పెద్ద శ్రమ పడలేదు. విషయసేకరణ తేలిక. యుగ విభజన అంతకు ముందు ఉన్నదే. అలవాటైన పద్ధతిలో - విషయవిభజనతో రాయవచ్చు. ఆధునిక సాహిత్యం దగ్గరకి వచ్చేటప్పటికి సందేహాలు మొదలయ్యాయి.
అధ్యాయాల విభజన ఎలా?
కవుల పేరుతోనా? ఉద్యమాల పేరుతోనా?
ప్రక్రియల పేరుతోనా? కాలాన్ని బట్టి చెయ్యాలా? వంటి ప్రశ్నలు ఎదురయ్యాయి.

ద్వా.నా.శాస్త్రి

నేను రాసిన 'తెలుగు సాహిత్య చరిత్ర' ఇంత పేరు తీసుకు వస్తుందనిగానీ, మూడు ముద్రణలు పొందుతుందనిగానీ రాసేముందూ రాసేటప్పుడూ అనుకోలేదు. రాసిన తర్వాత - అచ్చులో చూసుకొని బాగానే రాశాను - అందరికీ నచ్చాలిమరి'' అనుకొని ఆత్మానందం పొందాను.

ఈ పుస్తకం నేను రాయడానికి మూల పురుషులిద్దరు - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ మేనేజర్ పి. రాజేశ్వరరావు. ప్రముఖ అభ్యుదయ రచయిత కేతు విశ్వనాథరెడ్డి, మొదటి నుంచి వాళ్ళకి నా మీద నమ్మకం వుంది. నాకే - ఒకసారి నమ్మకం, మరోసారి నమ్మకం లేకపోవడం.

ఆరునెలల్లో రాయాలి
సరళంగా వుండాలి
పోటీ పరీక్షల విద్యార్థుల్ని, విశ్వవిద్యాలయ తెలుగు విద్యార్థుల్ని, జనరల్ రీడర్స్‌నీ దృష్టిలో పెట్టుకోవాలి
రెండు సంపుటాలుగా కాకుండా ఒకే సంపుటంగా
వుంటే మంచిది
విషయం, అధ్యాయం, భాష నీయిష్టం.

ఇవీ ప్రచురణకర్తల ఆదేశ సూత్రాలు 'సరే' అన్నానుగానీ సంకోచమే - నేను ఒక్కడ్నీ రాయగలనా? బాగా రాయగలనా? ఎప్పటి లోగా రాయగలనో? - ఇంత కష్టపడినా 'ప్రతిఫలం' తక్కువేగదా? - ఇటువంటి సందేహాలతో ప్రారంభించాను.

ప్రాచీన సాహిత్యానికి తక్కువ పేజీలు కేటాయించి ఆధునిక సాహిత్యానికి ఎక్కువ పేజీలు కేటాయించాలన్నది నా లక్ష్యం. ఇప్పటి వరకు వెలువడిన సాహిత్య చరిత్రలన్నీ ప్రాచీన సాహిత్యానికే పెద్దపీట వేశాయి. పైగా పోటీ పరీక్షలలోగానీ, ఎం.ఎ. తెలుగు సిలబస్‌లోగానీ ఆధునిక సాహిత్యానికీ ప్రాముఖ్యం వుంది. ఆధునిక సాహిత్యంపై విడివిడి పుస్తకాలున్నాయిగానీ - ఒకే చోటగల పుస్తకాలు లేవు.

ప్రాచీన సాహిత్య చరిత్ర రాయటానికి పెద్ద శ్రమ పడలేదు. విషయసేకరణ తేలిక. యుగ విభజన అంతకు ముందు ఉన్నదే. అలవాటైన పద్ధతిలో - విషయవిభజనతో రాయవచ్చు. ఆధునిక సాహిత్యం దగ్గరకి వచ్చేటప్పటికి సందేహాలు మొదలయ్యాయి.
అధ్యాయాల విభజన ఎలా?
కవుల పేరుతోనా? ఉద్యమాల పేరుతోనా?
ప్రక్రియల పేరుతోనా? కాలాన్ని బట్టి చెయ్యాలా? వంటి ప్రశ్నలు ఎదురయ్యాయి. విషయసేకరణ కూడా ఒక చోట పోగు చేసి లేదా. ఆధునిక కవిత్వానికి సంబంధించి పెద్ద దిక్కు సినారె సిద్ధాంత వ్యాసం. అయితే అది మాత్రమే చాలదు. ఒక్కొక్క ఉద్యమంపై, ప్రక్రియపై చాలా పుస్తకాలు వచ్చాయి. సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి. వ్యాస సంపుటాలు వచ్చాయి. ఇవన్నీ సేకరించడం ఎలా? ఎవరు సహాయం చేస్తారు? సమయం కూడా లేదు. నా లైబ్రరీలో చాలా వున్నాయి - కానీ అవీ చాలవు. అప్పుడు పని చేస్తున్న ఎస్.కె.బి.ఆర్. కళాశాల, అమలాపురం గ్రంథాలయం కొంత తోడ్పడింది. ఒకసారి హైదరాబాద్ వచ్చినప్పుడు ఆదివారం ఆబిడ్స్‌కి వెళ్ళి కొన్ని పాత పుస్తకాలుగా కొన్నాను. విశాలాంధ్ర బుక్ హౌస్‌కి వెళ్ళి పుస్తకాలు కొనకుండా - నాకు కావలసిన మేరకు గబగబా రాసుకొన్నాను. గుంటూరు వెళ్ళినప్పుడు అరండల్‌పేట గ్రంథాలయంలో కొన్ని దొరికాయి. తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి గ్రంథాలయం, బేతవోలు రావి బ్రహ్మం ఇంట్లోగల కొన్ని పుస్తకాలు... ఇలా సేకరించడం, నోట్సు రాసుకోవటంతో చాలా కాలంపట్టేసింది.

అప్పుడు నిరాశ ఆవహించింది. చెప్పాను గదా - పుస్తకానికి ఇచ్చే పారితోషికమూ తక్కువే. అమ్మో - ఎంత శ్రమ పడాలో? ఇంత శ్రమపడినా ఈ పుస్తకం నాగయ్యగారి పుస్తకంతో, జి.వి. సుబ్రహ్మణ్యంగారి (సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు) వంటి వాటితో పోటీ పడగలదా? అనిపించింది. దీనికితోడు నా భార్య "ఎందుకొచ్చిందీ రాత? ఉన్న ఆ నాలుగు వెంట్రుకలూ ఊడిపోతాయి" అనే సాధింపు. ఎందుకంటే ఏ రాత్రి వేళలేస్తానో, ఎప్పుడు రాస్తానో తెలిసేది కాదు. ఎప్పుడు ఆలోచన వస్తే అప్పుడే... నిద్రపోయిన రోజులు తక్కువే. ఈ సమస్యలవల్ల "తెలుగు సాహిత్య చరిత్ర" రాయటం మానేద్దామనుకొని రాజేశ్వరరావుకి చెప్పాను. ఆధునిక సాహిత్యం వేరొకరితో రాయించమన్నాను. అలా ఎలా కుదురుతుంది? అన్నారు. కేతు విశ్వనాథరెడ్డితో చెప్పాను. "నువ్వేరాయాలి, రాయగలవు" అన్నారు. రాజేశ్వరరావు పారితోషికాన్ని కొంచెం పెంచారు. కొంచెం సంతోషం - కొంచెం నిస్పృహ

ఈ స్థితిలో మా వియ్యంకుడు, మంచి పండితులు, అష్టావధాని కొత్తపల్లి ఘన శ్యామల ప్రసాద్ మా ఇంటికి వచ్చారు. టేబులు మీద కాగితాలున్నాయి. చూశారు. అప్పటికీ మూడు వందలకిపైగా పేజీలు రాశాను. ఏమిటిది? అని చూసి తెలుసుకొన్నారు. 'బాగుంది, రాయండి' అన్నారు. 'రాయటంలేదు - చాలా కష్టంగా వుంది" అని నా బాధలు చెప్పాను.

"శాస్త్రిగారూ - ప్రారంభించారు. కొనసాగించండి. మీకిది మంచి పేరు తీసుకు వస్తుంది. మీ శైలి బాగుంటుంది. కొన్నాళ్ళు ఈ సమీక్షలూ - ఈ చిన్న చిన్న రచనలూ మానెయ్యండి . మీకు వచ్చిన నష్టం ఏమీ లేదు. పుస్తకం 'క్లిక్' అయితే రాబోయే సంవత్సరాలు మీ పుస్తకమే పఠనీయంగా వుంటుంది. లేదూ - మీ డబ్బేమీ పోదుగా. పైగా మీరెప్పుడైనా ఇంత పెద్ద పుస్తకం రాసి అచ్చువేసుకోగలరా? మానకండి" అని హితబోధ చేశారు.

అప్పుడు ఉత్సాహంతో మళ్ళీ మొదలు పెట్టి చకచకా ముగించాను. ఈ పుస్తకాన్ని ఎవరికి అంకితం ఇవ్వాలి? అనే ఆలోచన వచ్చింది. నిజానికి రాజేశ్వరరావు, విశ్వనాథరెడ్డి గార్లకే ఇవ్వాల్సి వుంది. కానీ - సైన్సు చదివి వచ్చిన నాకు సాహిత్యంపట్ల

అభిరుచి కలగజేసిన వారు ఆచార్య తూమాటి దొణప్ప. పాఠం చెప్పాలంటే ఆయనే చెప్పాలి. క్రమశిక్షణ అంటే దొణప్పే. ఆయనే నాకు స్ఫూర్తి. అందుకని ఆయనకే అంకితం ఇచ్చాను. దొణప్ప జీవించివుంటే ఎంత ఆనందించేవారో అంతగా కఠినమైన సూచనలూ ఇచ్చి వుండేవారు. "బుద్ధి చెప్పువాడు గుద్దితేనేమయా?" అనుకొని ఆయన దగ్గర నేర్చుకొన్నదే ఈ విద్య.

అచ్చయిన తర్వాత ఆనందమే ఆనందం. రోజూ పుస్తకాన్ని చూసుకొని మురిసిపోయేవాడ్ని - ఇది నేను రాసిందేనా? అనుకొనేవాడ్ని.

హైదరాబాద్‌లో ఆవిష్కరణ సభ జరిగింది. సినారె ఆవిష్కరించి - "ఇదొక చిన్న సూట్ కేసులాంటిది. చిన్న పెట్టెలో ఎక్కువ బట్టలు పెట్టడం వంటిది. ఎవరిని ఎక్కడ పెట్టారో, ఎవరికి ఏ స్థానం ఇవ్వాలో చాలా పరిశీలనతో చేశారు. చదివించే శైలి" అన్నప్పుడు పొంగిపోయాను. దీనిని సమీక్షిస్తూ మృణాళిని సూచనలు ఇస్తూనే "రఢీరికనీర్" వంటి దన్నప్పుడు సంతోషించాను.

ఈ పుస్తకావిష్కరణ సభకి వచ్చిన గొప్ప సాహిత్య విమర్శకుడు మాత్రం వ్యతిరేక విమర్శ చేశారు. "ఇది చరిత్ర కాదు - విమర్శా కాదు. ఇది చదివితే మార్కులు వస్తాయట" అంటూ మాట్లాడారు. చివరగా నేను ఈయనకి సూటైన సమాధానమే ఇచ్చాను.

నిజమే - ఆయన అనుకొన్న చరిత్రకాదు. అంటే కుమార సంభవం నన్నెచోడుడు రాశాడా? క్రీడాభిరామం రాసిందెవరు? శ్రీనాథుని జన్మస్థలమేది? రాయల ఆస్థానంలో ఏ కవి ఉన్నాడు?... ఇటువంటి చర్చలు లేవన్నది ఆయన భావం. వీటివల్ల పాఠకుడికి ఒరిగిందేమీ లేదు. ఆ కాలం చెల్లింది. శ్రీనాథుడు కాల్పట్టణంలో పుట్టాడాలేడో? ఆ కల్పట్టణం ఎక్కడ వుంది? శ్రీనాథుడు ఏ ఏ రచనలు ఏ ఏ కాలాలలో రాశాడు? వంటి వాటి జోలికి నేను వెళ్ళలేదు. నేటి పోటీ పరీక్షల విద్యార్థికి, సాహిత్యాభిలాష గల పాఠకుడికి ఇవి కాదు కావలసింది. ఆ కవి, అతని రచనలు, అతని కవిత్వం కావాలి. చారిత్రకాంశాలపై ఆసక్తిగలవాళ్ళకి ఆరుద్ర పుస్తకం ఉండనే వుంది. వాటిని చర్చిస్తూ పేజీల నింపుడు కార్యక్రమం చేపట్టలేదు.

ఇందులో విమర్శలేదనటం సరికాదు. అది సహృదయ విమర్శ. నా అభిప్రాయాలు, కొన్ని చోట్ల మాత్రమే - సూక్ష్మంగా వుంటాయి. ఎందుకంటే నా ఉద్దేశం ప్రధానంగా - ఉన్నది ఉన్నట్టు చెప్పాలనుకోవడం. నేను థర్డ్ ఎంపైర్"గా వున్నాను. నన్నయనీ - వేమననీ - దేవుల పల్లినీ - గద్దర్ నీ సమాన హృదయంతో వారితో మమేకం చెంది రాశాను.

ఇంతకు ముందు గల సాహిత్య చరిత్రలలో లేని చాలా ప్రక్రియల్ని, అంశాల్ని రాశాను. అయితే సవిస్తారంగా రాసే అవకాశం కలగలేదు. వెసులుబాటూ లేదు. అంత మాత్రాన ముఖ్యాంశాలు కానీ, ముఖ్యమైన వారిని గానీ వదలలేదు. కొందరికి కొన్నిటికి మరి కాస్త ప్రాముఖ్యం ఇచ్చివుంటే బాగుండేది.

ఈ పుస్తకం వచ్చిన తర్వాత చాలా మంది పెదవి విరిచారు. "ఇది అమ్ముడవటం కష్టం" అని నా మొహం మీదే అన్నాడొక మిత్రుడు. "ద్వానా శాస్త్రితో ఎందుకు రాయించారు?" అని రాజేశ్వరరావుని అడిగారు. ఒకాయన సమీక్షిస్తూ ద్వా.నా.శాస్త్రితో విశాలాంధ్ర వారు రాయించటం ఒక విడ్డూరంగా పేర్కొన్నాడు. ఒకరిద్దరు సమీక్షలలో నాపై చురకలు వేయకపోలేదు.

దీనికి కారణం - నేను ఎందుకు ఈ పుస్తకం రాశానో అది తెలుసుకోవడం.

రెండో కారణం - నాకు పేరు వస్తుందన్న అసూయ.

ఇప్పుడు వీళ్ళ పెదవి విరుపులు, వీరి విసుర్లు పటాపంచలయ్యాయి. గాలి మాటలని తేలిపోయింది. నా సాహిత్య చరిత్ర ఇవాళ అన్ని మూలలా విస్తరించింది. మూడు ముద్రణలు పొందింది. ఎం.ఎ. విద్యార్థులు ఈ పుస్తకం చదివి పాసయ్యామని చెప్పారు. పోటీ పరీక్షల విద్యార్థులకి కరతలామకంగా వుందని తెలిసింది.

ఒక ఎసిటివో - మరొక బ్యాంక్ మేనేజర్ మరొక సైన్సు ప్రొఫెసర్ - వేరొక జర్నలిస్ట్... ఇలా ఎందరో నన్ను మెచ్చుకొన్నారు. సభలకీ, ఉపన్యాసాలకీ, సందేహాలకీ - 'రిఫరెన్స్' గ్రంథంలా వుందని మెచ్చుకోలుగా చెప్తూంటే నా కృషి ఫలించింది - అన్న తృప్తి ప్రతి విశ్వవిద్యాలయంలోనూ ఈ పుస్తకం విద్యార్థుల చేతుల్లో, అధ్యాపకుల దగ్గిర చూసినపుడు నా ప్రయత్నం ఫలించింది అన్న సంతృప్తి. దొణప్ప పట్ల, రాజేశ్వరరావుపట్ల, కేతు విశ్వనాథ్‌రెడ్డి పట్ల కృతజ్ఞతాభావం!

అంత మాత్రాన ఈ సాహిత్య చరిత్ర - సమగ్రం, అపూర్వం అన్న గర్వం ఏ కోశానా లేదు. నా పరిధులు నాకు తెలుసు. నా లోపాలూ నాకు తెలుసు. ఆరుద్ర అంతరాక్షసకృషి చేసినా అది సమగ్రం కాదన్నారు. మారుతున్న భాషకీ, సాహిత్యానికీ "సమగ్రత" ఉండదుగాక ఉండదు. మళ్ళీ తిరగరాసే అవకాశం వస్తే నా లోపాలు నేను సరిదిద్దుకుంటూ కేతువిశ్వనాథరెడ్డి అన్నట్లు ఈ ఒక్క పుస్తకంతో నీ స్థానం పదిలం" అనిపిస్తుంది. ఎంత కాలం నిలుస్తుందో ఎవరూ చెప్పలేరు. మరో ద్వా.నా. శాస్త్రి, మరో నాగయ్య తప్పకుండా వస్తారు - కాదు రావాలిగదా!!

---

## ఉరిపోసుకున్న శిరస్సులన్ని

ఉరిపోసుకున్న ఒక్కొక్క శిరస్సును
ఉరితీసిన ఒకానొక శిరస్సులను
మట్టి తన ఒంటికి చుట్టుకున్న వస్త్ర పొరలో
దాచుకుంటుంది...
ఆయుధాలను భద్రపరచుకున్న
జమ్మి చెట్టులా
ఏదో ఒక రోజు
మట్టి శిరస్సులన్నింటిని
ఆయుధాలుగా అందించక తప్పదు
మహా సంగ్రామం మళ్ళా జరగకతప్పదు

జనజ్వాల



## మొగిలిపూల వాసన

ఒకానొక మహా సర్పాల క్షేత్రం
మరో ఒకానొక రహస్య చర్యల రాసలీలా బహిర్గత దృశ్యం
ఇక్కడి... మా తరం వందే మొగిలిపూల ప్రజాస్వామ్య పరం-
నువ్వు - నేను... రెప్పవాల్చకుండా చూడడం ఎన్నోసార్లు
నువ్వు-నేను... మోసపోవడం అన్నిసార్లు
లోహితుడి మరణం మనమే
మరణ దహన సంస్కార కాటి కాపర్లం మనమే
ఎటొచ్చి... మన భార్యల తాళి బొట్లు మనకు కనిపించకపోవడమే
మన వందే మాతరం మొగిలిపూల పొద వాసన పరిమళం

# వాన పాములు



ఎప్పుడో ఎండిపోయిన మెంటబాయిగడ్డ మీది తుమ్మ చెట్లు. బంగారు రంగు బుటాలున్న జరీ అంచు ముదురాకు పచ్చ పట్టుచీర కట్టుకున్న ముత్తైదువుల్లా చిన్న, చిన్న పువ్వులతో, సన్న, సన్న ఆకులతో కళకళ్లాడుతున్నాయ్.

శిరంశెట్టి కాంతారావు

వెండి పట్టీల్లాంటి ఎండు తుమ్మకాయలు, అప్పుడప్పుడూ రాలిపడుతూ... చేస్తున్న చప్పుడు సద్దుల బతకమ్మ ఆడుతున్న తెలంగాణా పల్లెపడుచుల మువ్వల పట్టీల చప్పుడులా హాయిగా విన్పిస్తుంది.

ఆ బాయిగడ్డకు కొంచం ఎడంగా వున్న పుచ్చతోటలో కలుపు తీస్తున్న కూలీలు ఆ తుమ్మచెట్ల కొమ్మలకు వేళ్ళాడగట్టిన వాళ్ళ పైటన్నం క్యారియర్లు ఉట్ల పండుగ నాడు కొట్టబోయే పెరుగు బుడ్లను తలపిస్తున్నాయి.

ఆ చెట్ల నీడన విడిచిన ఎడ్ల బండి చిర్రెను తీసి తుమ్మ కొమ్మల మీద వాలిన రింగన పురుగుల కోసం గురిచూసి విసురుతున్నాడు ఏడేండ్ల చందర్‌గాడు.

అది చూసిన సోమయ్య "వారీ! చందరూ! గా తుమ్మ చిర్ర సెడబర్వుంటుంది బిడ్డా! రెక్కల్ నొస్తైగాని ఊకో... బైటి బువ్వకు దిగినప్పుడు నేనా పుర్గులు రాల్పిస్తగాని గా సత్తెయ్య తాత దుక్క తోట్లకు బోతున్న బరె దుడ్డె నిట్ల మల్పకరింఫో...." అన్నాడు మనవడితో.

"హే ఫో.... గాదుడ్డె నాకు మల్లది" జారిపోతున్న నిక్కర్‌నుపైకి జరుపుకుంటూ అన్నాడు చందర్‌గాడు.

అప్పుడే పైటన్నం గంప నెత్తిన బెట్టుకొని ఎండిపోయిన మడికట్లల్లో నుండి వస్తున్న మంగమ్మ "ఓ... అయ్యో! గట్ల జూస్తవేంది? ఆమీక్కతోట్ల బడితే... ఊకుంటరా? పొయి మీల్పకరాక ఆపిలగానికి చెబుతున్నవ్!? ఆడేనా తోలుకొచ్చేది?" భర్తతో అంది మంగమ్మ

"పోతున్నలే.. ఒర్లకు" అంటు పక్కనే గెనెం మీదున్న తంగేడు మండనొక దాన్ని ఇరుసుకొని "హే హే... ఖ, ఖ, ఖా..." అని రిచ్చగొట్టుకుంటూ బర్రెదూడను మలుపుకు రావడానికి ఉరుకు జూపాడు సోమయ్య.

అన్నం గంపను బండి తొట్టి గడల మధ్య దింపిన మంగమ్మ 'గోసి' పోసుకుంటూనే పుచ్చ తోటలోకొచ్చి "ఓ.. అమ్మలాలా! జర చెయ్యాడిచ్చుండ్రి! ఈ కల్పు పాడుగాను నాల్గుదినాల్నుంచి తీసినోల్లం తీసినట్టే... ఉంటింగాని కసిగందకబాయె! చెట్టు మీది తుమ్మ బంక లెక్క తీసేది దీస్తుంటే... పుట్టెది పుడుతుండె! ఇంకెట్ల సద్దుం!?" అంటూ కలుపు దీస్తున్న కూలీల మీద ముట ముట లాడింది.

సోమయ్య, మంగమ్మలకు ఫణిగిరి గుట్ట కింద మొత్తం గొడితే... ఓ పదెకరాల చెలక ఉంది. దాంట్లోనే ఓ రెండెకరాలు

బీడు. దాన్నిండ తుమ్మలు ఉన్నాయి. తాతల కాలం నాటి మోటబాయి ఎప్పుడో ఎండిపోవడంతో ఇప్పటికి మూడు చోట్ల బోర్లెయించితే.... రెండు ఫేలై, ఒక్క దాంట్లో మాత్రం అంతంత మాత్రంగా నీళ్ళు దొరుకుతుండడంతో ఓ ఎకరం సుమారు అచ్చుగట్టిన పాబొలంలోనే నాటువెడుతూ... మిగిలిన చెలకలో కందో, పెసరో, ఆముదాలో, నువ్వులో జల్లుతుంటారు.

వాళ్ళకు ఇద్దరాడ పిల్లలు, ఒక్క మగపిల్లవాడు ఉన్నారు. ముగ్గురికీ పెండ్లిండ్లైనాయి. బిడ్డలిద్దరూ కాపురాలకు వెళ్ళిపోగా, కొడుక్కి ఒక కొడుకు. వాడే చందర్‌గాడు. వాణ్ణి నానమ్మ, తాతయ్యల మీద వదిలేసిన సోమయ్య కొడుకూ, కోడలు "నాలుగు నెల్లపాటు ఏదో పని చేసుకొని నాల్గు పైసల్ సంపాయించుకొస్తాము" అని ఈ మధ్యే హైదరాబాద్ వెళ్ళారు.

మంగమ్మ మాటలకు వడి వడిగా కలుపుదీస్తూనే... "మంగక్కా! ఇయ్యాల నువ్ కూలిపైసలియ్యకుంటే గన్క రేపు మా ఇంట్ల పొయిల పిల్లిలేవది ఎట్లనన్న జేసి పొద్దుగుంజాముల జరపైసల్ జూడు" అంది కలుపు కూలీల్లో ఒకావిడి.

"లే... నేను గూడ ఇయ్యాల్ననే అనుకుంటున్న అగో! గా... కుర్మోల్లా ఎంకులు మామ జివాలకు తుమ్మ మండ గొట్టుకుంటనని వొచ్చిండు. మాపటికి బేరంగుదిరితే... ఎమ్మటే బయానిస్తనన్నాడు...గా... పైసలొచ్చినయంటె ఎమ్మటే ఇస్తతియ్యి." కూలీలు పీకిన కలుపంతా పసులక పనికొస్తుందని గెట్టు మీద బెడుతూ... అంది మంగమ్మ.



మాటల్లోనే ఓ.... .ఇద్దరు మనుషులు గుట్టల సందులంగబడి సోమయ్య వాళ్ళు కంచెలోకి వస్తూ కన్పించారు. వాళ్ళ చేతుల్లో పెద్ద పెద్ద గెడకర్రలున్నాయి. ఆ గెడకర్రల చివర చిన్న, చిన్న డోకుడు పారలు బిగించి వున్నాయి. వాళ్ళ నడుములకు ఒడి గుడ్డలున్నాయ్. వాళ్ళ భుజాలకు గోనెబస్తా సంచుల్లో దిగేసిన నీళ్ళ సీసాలు వేళ్ళాడుతున్నాయి. వాళ్ళ నా ఎండలో చూస్తుంటే... పడమర సాంబ్రానికి పోదారి పోయిన కాకుల్లా వున్నారు!

బీట్లోదాకా వచ్చిన వాళ్ళను చూసిన మంగమ్మ "ఓ... యవలల్లా...! గట్ల కంచెలబడి తిర్గుతుండ్రు!?" పెద్దగా కేక వేస్తూ అడిగింది.

"బంకోల్లం" అన్నాడు వాళ్ళల్లో ఒకడు.

"ఐతేందిమరి!? ఇక్కడేందో మీ.... అయ్యముల్లె దాసినట్టే తిర్గుతుండ్రూ!"

"మీ... అయ్య ముల్లే తియ్యవ్వా! మా... అయ్యగ్గీ మాత్రముంటె గుట్కెడు, గుట్కెడు నీల్లు దాక్కుంటగీ... అగ్గిలబడి సెట్టు, సెట్టు దేవులాడుకుంటు ఎందుకు దిర్గుతం!" ఓ... తుమ్మచెట్టు చివరి కొమ్మల్లో ఉన్న బంకను చేతిలోని గెడకర్రకున్న డోకుడుపారతో కెళ్ళగించి నడుముకున్న ఒడిగుడ్డలో వేసికుంటూ అన్నాడు వాళ్ళల్లో ఒకడు.

వాడి మాటలకు కోపమొచ్చిన మంగమ్మ "ఓరారి! ఏంద్రో? లావే నీల్గుతున్నవ్! గంత నీల్గుడున్నోడివి, మా కంచెలకిందుకొచ్చినవే?" అంటూ ఇంకా గట్టిగా అరిచింది.

"వస్తె, నీ సొమ్మేంకొంచబోట్లే... తియ్యమ్మ!"

"మాటలు మంగజెప్తరు. గిట్లనే మొన్నొకడొచ్చి కొడార్ల నాగలి తుంటెత్కపొయిందు"

"మేం గసుంటోల్లంకాదులే"

బంకోళ్ళిద్దరూ మంగమ్మ మాటకు మాట సమాధానం ఇస్తూనే... అక్కడున్న తుమ్మ చెట్లన్నీ తిరిగి బాయిగడ్డ మీదుగా వెళ్ళిపోయారు.

✤✤✤

పైటన్నాలకు దిగిన కూలీలు తెచ్చుకున్న నాలుగు ముద్దలు గబ, గబా తిని, బిట్లోబడి ఎండిన తుమ్మ మండల్ని పొయిలోకి చెలుక్కోసాగారు.

వాళ్ళనట్లా వదిలేస్తూ... ఊరుకోలేని మంగమ్మ "ఓ... ఏందల్లా! రోజు గిదేకతనా!? తొడుగు అర్వై రూపాయలంటుండ్రు. గీకర్వురోజుల్ల పైసకు, పైసా ఆసరైతదిగాదు?!" ముఖమాటం లేకుండా అంది.

"పట్టు, పట్టు మంటె నీకు దగ్గవ్వ పొయి మీదికి సేరు బియ్యం గావాల్నన్న ఇస్తదిగాని, పొయి కిందికి నాల్లుపుల్లలియ్యమంటె ఇస్తదా... ఒదినా! ఐనా, ఏదో మీపన్లకొచ్చినంగాబట్టి గీ... నాల్గు పుల్లలు ఏరుకుంటున్నం బాంచన్!" అంటూనే తలోమోపు కట్టి పెట్టుకొని మాపటి జాం పనికి లేబరు, కూలీలంతా.

ఇట్లా కూలీలు పనికి ఒంగుతుండగానే... అట్లా అయ్యోరి కుంటలోబడి దుబ్బ లేపుకుంటూ వస్తున్న జీపును జూసిన మంగమ్మ "గీ... కరీంటోల్లు బోర్ల సుట్టు నిసువాసన పసిగట్టిన జంగు బిల్లులెక్క ఒక్కటే తిర్గుడు తిర్గుతండ్రు! గీ.. ఉచిత కరంటు మానమన్నువడ, ఇదొచ్చిన కాన్నుంచి ఇంకింత మొదలార్నట్టే ఉంది, పైసల్ బొయిసా గప్పుడే పానానికి సుక మన్పిచ్చి. గిప్పుడు జూడు దొంగకనెక్సన్లున్నయని, గదని, గిదని పూటకో తీరుగ మాట్లాడుతుండ్రు! రైతులంటె ఈల్ల కండ్లకు దొంగలెక్క గొడుతుండ్రేమో!? పొద్దంత జూసిన నాలుగ్గంటలు కరంటియ్యపాయిరి. అదె పాయ ఎప్పుడో గప్పుడిచ్చిండ్రు లెమ్మని మోటర్లేస్తే.. ఓలుటేజీ తక్కువై మోటార్లు గాలవట్టె! గట్ల జెయ్యవట్టే... సక్కగ దుబ్బు గట్టె పొట్టకొచ్చిన పొలం నిలువు నిస్తారంగ ఎండిపాయె. మల్లగా... శిరికొండ రామన్న కాళ్ళు, గడ్డం బట్టుకొని మిత్తికి దెచ్చి మోటర్ బాగుజేయిచ్చి, గీ... పుచ్చులైతె, నీల్లు జర ఎడ్డెం, మడ్డైనా తట్టుకుంటయని బెడితే... ఈ కలుపు మొదలారిపోను పాపం బెరిగినట్టు పెరగవట్టె" బక్కరైతుల బతుకుల్లో అలుముకున్న గుండె చెదిరే వాస్తవాలను తవ్వి తలకు పోసుకోసాగింది...

మంగమ్మ ఆలోచనల్లో మంగమ్మ ఉండగానే, జీపొచ్చి వాళ్ళ పుచ్చతోట పక్కనే ఉన్న డొంకలో తుమ్మల కింద ఆగడమేంటి! ఆబ్కారీ పోలీసుల్లాంటి ఐదారుగురు మనుషులు దిగడమేంటి! క్షణాల్లో జరిగిపోయింది.

అప్పుడే పైటన్నందిని, చుట్ట నిప్పుకోసమని కాడిగెట్టున్నే మీక్కతోటకు కావలున్నీ కర్రెయోళ్ళ సత్తెమ్మ దగ్గరకు బొయి చుట్టగాల్చుకుంటూ... ఆ మాట, ఈ మాట మాట్లాడుతున్న సోమయ్య జీపొచ్చి ఆగడం జూసి "ఏందే...సత్తెన్నా! ఆ కరంటోల్లు మల్లొచ్చినట్టుండ్రుగాదే!" చికాగ్గా అన్నాడు.

"మల్లెందుకొచ్చిండ్రో.. కనుక్కుందాంపా...." అంటు లేచాడు సత్తెయ్య. వయసుతో వచ్చిన అనుభవం అతని మాటల్లో తొంగిచూస్తుంటె...

వాళ్ళిద్దరూ జీపు దగ్గరకొచ్చేసరికి, ఆ చుట్టు పక్కల చెలకల్లో

పని చేసుకుంటున్న రైతులంతా వచ్చి జీపులో వాళ్ళను చుట్టు ముట్టి–

"ఓట్లేయించుక నూకేటప్పుడు ఉచిత కరంటిస్తం, ఉచిత కరంటిస్తం' అని బెల్లం మాటలు జెప్పి, గిప్పుడే మీ మేము దొంగోల్లమైనట్టు మా చెలకల సుట్టు ఏటకుక్క ల్లెక్క దిర్గుతంగ్రు!'

"ఉచిత కరంటియ్యమని మేమెవలకాడికి బొయి అడ్గలే.. కుర్సీ లెక్కేటందుకు ఆల్లే మాతాని కొచ్చి కతలిన్పిచ్చి ఓట్లేయించుకుంగ్రు. గిప్పుడేమో సెకల్‌బడుతుంగ్రు"

"మాబాయిల సుట్టు గీ తీర్గతిర్గుతుంగ్రుగాని, గా... అల్లం సాయిరెడ్డికి ఆయద్దైతేంది పదిబోర్లు నడుస్తున్నె... ఒక్కనికి గన్ని కనెక్షన్లు ఎట్టిచ్చింగ్రు?! గాయిన బిల్లులు గడుతుండా? గసుంటోల్ల జోలికి ఎందుకు బోట్లే?

"గీ... వచ్చీరాని కరెంటుతోటి, మీతోటి ఏగేదానికంటే... యవసాయులు బందువెట్టి ఎటన్ని బతక బోవుడు మంచిది" అటు ఒక్కొక్కడే తమ గుండె గులేర్లను సంధించి విసురుతున్న ఆక్రోశపు మాటల గులకరాళ్ళకు వచ్చిన వాళ్ళంతా చిత్త ఉబ్బకం ఊపిరాడ తలవాల్చిన బ్రాయిలర్ కోళ్ళలా కన్పిస్తున్నారు.

వచ్చిన వాళ్ళందరిలోకి హోదాలో పెద్దవాడైన కుర్ర ఎ.ఇ. గుక్క తిప్పుకొని "చూడంగ్రీ! దేవుడు వొరమిచ్చినా... అయ్యోరోడియ్యనట్టు గవర్నమెంటోడు ఉచిత కరెంటు ఇద్దామనుకున్నా,గా... వొరల్లు బ్యాంకోడు మెల్కె బెడితడు. గాడు జెప్పినట్టు ఇనకబోతే రుణికి అప్పుబుట్టది. గా... అప్పుబుట్టకపోతే, ఈనికతనడవది. ఈనిరాజ్జెముండది! గిదంత పెద్ద సాలెగుడు. రెక్కల పురుగుల్లెక్క అందరు అండ్లజిక్కి సచ్చుడేగాని, బతుకుడు లేదు. మేమంత గవర్నమెంట్ మనుసులంగాబట్టి చెప్పింది చేసుడేగాని, గిదేందని అడగ్గూడది! మెదడు బెట్టి ఆలోచించగూడదీ!" ప్రజలకు సేవజెయ్యాలనే ఆశయంతో, ఆదర్శంతో ఇటీవలనే ఉద్యోగంలో జేరిన ఆ...యువ అధికారికి వాస్తవ పరిస్థితులు అర్థమౌతుంటే...ఏం చెయ్యాలో తోచక ఒడ్డున బడ్డ చేపలా అల్లడ, తల్లడౌతున్నట్టుగా సమాధానం చెప్పాడు.



ఆ తరువాత ఆ చుట్టు పక్కల కనెక్షన్స్ అన్నీ ఓసారి పరిశీలించి వచ్చిన దారిన్నే వెళ్ళిపోయారు.

✣✣✣

పడమటి పొద్దు గూట్లో పడుతుంది.

రాత్రి వంటకోసం అంటించిన పొయిల్లోని పొగ ఊరుతల్లి మెడను చుట్టుకున్న వెండికంటెలా వుంది.

అడవంతా తిరిగినా డొక్కలు నిండని బర్లూ, గొర్లూ పాలమూరు వలస కూలీల్లా ఉసూర్మంటూ ఊళ్ళో కొస్తుంటె.. లేస్తున్న దుమ్ము దారి పక్క చెట్ల మీద తెరలు, తెరలుగా పేరుకుపోతుంది.

పుచ్చతోట నుండి ఎడ్లబండి మీద ఇంటికొస్తున్న సోమయ్య వాళ్ళను దాటి ఊళ్ళోకి పోతున్నరెండు జీపుల్ని చూసిన మంగమ్మ, ఆ జీపుల్లో వస్తున్న వాళ్ళెవరో అర్థమై ఈల్లమొకం అంగడిబోను, దీపాలు గూట్లె బెట్టే యాల్లకొస్తుంగ్రు, ఏంకతజేస్తరో!? ఒక దిక్కు ఆనల్లేక, బోర్లల్ల నీల్లుదొరక్క పంట, పైర్లెండి జస్తుంటే... గీల్లంత పీతిరి గద్దలెక్క ఇండ్ల మీద బడుతుంగ్రు!

గీ మొదనస్టపోల్లు జెయ్యబట్టేగా... ఇసాక మోన్‌రెడ్డి పానందీస్కుండు. గట్లెంకెంత మందిని మింగి నీల్లుదాగాల్ననో గిట్ల ఊర్ల మీద బడి తిర్గుతుంగ్రు" ఓ పక్క గుండెలో సన్నగ బుగులైతుంటె మనసులోనే అదిమిపెడుతూ అంది.

ఇల్లుజేరిన సోమయ్య వాళ్ళు బండి ఇడిచి కాళ్ళు చేతులు కడుక్కుంటున్నారో లేదో... మంగమ్మ భయపడ్డట్టుగానే కోపరేట్ బ్యాంకు మేనేజర్ రానేవస్తున్నాడు..

అతణ్ణి జూసిన సోమయ్య "కూసోంగ్రి!" అంటు నులక మంచం దెచ్చి వాల్చాడు.

"గీ... మర్యాదలకేమొచ్చెగాని, ముందలగా... కిస్తీపైసల సంగద్దేల్సు. బ్యాంక్‌లకెల్లి పైసల్ దెచ్చుకొనే టప్పుడున్నంత ఉశారు కిస్తీలు గట్టబొయ్యే వరకు ఏమైద్దో దెల్వది!? సమయానికి కిస్తీలొసూల్ జెయ్యకుంటె మాపయ్యోల్లు మమ్ముల్ని సంపకతింటుంగ్రు. మీ ఇండ్లకొస్తె మీరేమొదొరల్లెక్క ఉల్కరు, పల్కరు. మద్దెల కగ్రుగాలు పడ్డ బిక్కెద్దుల్లెక్క మేంజిస్తున్నం." మాటల్ని ఈటెల్లా రువ్వుతూ మాట్లాడసాగాడు. బ్యాంకాఫీసర్ మంచం మీద కూర్చోకుండానే.

ఆఫీసరన్న మాటలకు చేదు మింగి నట్టుగా బాధపడుతూ..." ఏం జెయ్యాల సారూ! బోర్లెల్ల నీల్లుబిక్కి పోతుండె, నీల్లు జాలక ఏసిన పైర్లు ఎండుతాంటే రోజింత పసులు మేపు తాంటిమి. గాపైర్లు గూడ బపోయినంక ఒక్కొక్క పగ్రాన్ని కట్కోనికి అమ్ముతుంటిమి. గీ... సందుల్నే మీరొచ్చి గడి, గడికి కిస్తీలు గట్టమంటే యడికెల్లి దెచ్చి కట్టకపోతిమి!? కాదుకక్క సంకిస్తీలు గట్టవల్సిందేనంటే మేంగూడగా ఇసాక మోన్‌రెడ్డి లెక్క ఇంత ఇసం బాద్దుకొనుడే ఉంది." జరుగుతున్న పరిస్థితులను అధిగమించేందుకు ఏదారీ కన్పించని అశక్తత నుండి పుట్టిన నైరాశ్యంతో చావే అంతిమ పరిష్కారం అన్న తప్పుడు భావనకు లోనౌతూ అన్నాడు.

"ఏందిదయా!? ప్రతోడు చస్తం, చస్తమని బెదిరిస్తరేంది? బెదిరిస్తె దద్దుకొని పోత మనుకుంటుంగ్రా! ఏంది? మాముందలగా... కతలన్ని జెల్లవ్‌గాని, కిస్తీగడతవా? లేకుంటె బర్రెను, దుడ్డెను లంకె బెట్టి కొట్ట మంటవా?" సోమయ్య ఆవేదనను ఏ మాత్రం పట్టించుకోని బ్యాంక మేనేజర్ మరింత కటువుగా మాట్లాడాడు.

"తోలక్కపోతె తోల్కపోంగ్రి! గిప్పుడు నాతాన బొక్కల్‌దప్ప అమ్ముదమంటె వొంట్లె సేరు నెత్తురు గూడ ఎల్లది" ఏమీలేని తనంలో నుండి పుట్టిన తెగింపుతో అంకెకేశాడు సోమయ్య.

"నీగ్గంత ముచ్చెటుంటె నేనేం జెస్తతియ్యి" అన్నీ బ్యాంక్ మేనేజర్ అప్పుడే కుడి అదాగి, కిట్టుగుంజు దగ్గిర నిల్చున్న బర్రెను, దూడను కల్పి బయటకు తోలసాగాడు.

బర్రెపాలు దీద్దామని ఇంట్లో కెళ్ళి చెంబుదీసుకొస్తున్న మంగమ్మ నిజంగానే బర్రెను, దూడను తోలుకుపోతున్న బ్యాంక్ మేనేజర్‌కి అడ్డం దిరుగుతు "నా బొందిల పానముండంగ బర్రెను దోల్క పోనియ్య. గిది నా పెండ్లప్పుడు నా తల్లిగారోల్లు అర్నందోలిచ్చిన సంగడం, గసుంటిదాన్ని బదులుకుంటనా!" అంది.

"నీ... అస్సంటోళ్ళను ఇంత మందిని జూసిన" అంటూ తలమీది వెంట్రుకలు పట్టుకొని చూపిస్తూ మంగమ్మను ఏ మాత్రం లెక్క జెయ్యని మేనేజర్ బర్రెను, దూడను బైటికి తోలాలని చూడసాగాడు...

అంతలోనే మిగతా రైతుల ఇండ్లల్లో నుండి గూడా దొరికిన పశువుల్ని దొరికినట్టే తోలుకొని వచ్చినా మిగతా బ్యాంక్ ఉద్యోగులు

సోమయ్య ఇంటి ముందు మందనాపి, బలవంతంగా మంగమ్మ నుండి తప్పించిన బర్రె, దూడల్ని అన్నిటితోపాటు ఊరు దాటించసాగారు...

సమయంగాని సమయంలో ఊరెల్లదిస్తున్న పశువులు "అంబా...! అంబా...!" అంటూ మోరీలుపై కెత్తి అరుస్తుంటే... వాటి వెనుక ఆడవాళ్ళు, పిల్లలు 'లబ, లబ' మని ఏడుస్తూ... నడుస్తుంటే ఊరంతా బందిపోట్లు పడ్డంత గందరగోళంగా తయారైంది.

అప్పుడే మనవడి బండి మీద సూర్యాపేట బోయ్ వస్తున్న రామానుజరావు పంతులుగారు జరుగుతున్న దృశ్యానికి స్తబ్దుడౌతూ... 'మేనేజర్ సాబ్! ఊరు మీద ఏందీ అరాజకం!? పైర్లన్ని ఎండిపోయి రైతులంత" అలో లక్ష్మణా! అని "ఏడుస్తుంటే.. ఇంత జబర్దస్త్ జేసుడు నైజాం కాలంల గూడ జూడలే!" అంటూ బ్యాంక్ వాళ్ళను మందలించాడా స్వాతంత్ర్య సమరయోధుడు.

"ఏం జెయ్యమంటర్‌సార్! మాకు పై నుంచి ఆర్డర్లు గట్లున్నై. చెప్పినట్టు జెయ్యకుంటె మిమ్ముల్ని గూడ వి.ఆర్.ఎస్.లు బెట్టి ఇండ్లకు బొమ్మంటుండ్రు. మేం మా పెల్లం పిల్లల్ని బతికిచ్చుకోవాల్నంటె గిదంత జెయ్యక తప్పది" పెద్దాయన్ని జూసిన భయంతోనో, భక్తితోనో కొంత వెనక్కి తగ్గుతూ అన్నాడు బ్యాంక్ మేనేజర్.

"మీరన్నది గూడ నిజమేగాని, రైతుల్నింతగనం ఏడ్పించుడు ఎవనికీ మంచిదిగాదు. నా మాట మీద ఒక్క నెల రోజులు గడువియ్యండి ఏదో ఒకటి జేసి ఆళ్ళే గడితరంగాని" అన్నాడు పంతులుగారు.



ఆయన మాటలకు మరింకేమీ అనలేని బ్యాంక్ మేనేజర్ ఊరోళ్ళవైపు దిరిగి "ఏదో... పెద్ద మనిషి జెప్తుండు గనక ఒక్క నెల రోజులు వాయిద బెట్టిపోతున్నం. మళ్లగీ పొద్దటి రోజూస్తం. అప్పుడు కూడా ఇట్లనే జేసింద్రనుకో! అటెంక మీ ఇష్టం–" అనుకుంటు జీపులెక్కి వెళ్లిపోయారా బ్యాంక్ ఉద్యోగస్తులు.

ఊరుకొట్టుకుపోతుందనుకున్న ఉప్పెనేదో పక్కకు తొలిగిపోయినంతగా ఊపిరి దీసుకుంటు ఎవరి పశువుల్ని వాళ్ళు ఇండ్లకు తోలుకుపోయారు రైతులంతా.

బ్యాంక్ వాళ్ళిచ్చిన గడుపు ఇంకో పదిహేను రోజులే ఉంది.

"ఆ ఊళ్ళో భూములు జప్తు చేస్తున్నారు. ఈ ఊళ్ళో భూములు జప్తు చేస్తున్నారు" అన్న వార్తలు వింటున్న రైతులంతా చెప్పిన వాయిదాకు కిస్తీలు గట్టకుంటే బ్యాంకోల్లేంజేస్తరో?" అని బెంబేలెత్తిపోసాగారు..

ఓ రోజు మధ్యాహ్నం ఇంటి ముందు పందిరికింద కూర్చున్న మంగమ్మ పాత చీర కుట్టుకుంటుంది.

పాత మంచం కాళ్ళకట్ట బిగదీస్తూ కూర్చున్నాడు సోమయ్య.

అంతలోనే "తాతా! ఫోన్" రాజు మాష్టారు ఇంట్లో ఆడుకుంటున్న చందర్‌గాడు పరుగెత్తుకొచ్చాడు.

"మూల్గే నక్క మీద తాటి పండు బడ్డట్టుగుంది కత! కలో, గంజో దాగి ఇంట్లనే పడుందదామంటె నా నుదిటినకుండ పని, పనని పట్నం బోయ్ దెబ్బలు దగిలిచ్చుకొనె, ఇప్పుడేం జెయ్యాల మరి?" ఫోన్ దగ్గరకు వెళ్ళి మాట్లాడి వస్తూ... వస్తూనే అన్నాడు సోమయ్య.

"ఏందయ్యా! ఏమైంది? నీ ముచ్చెట నాకేం అంతుబట్టట్లే...! ఆదుర్దాగా అడిగింది మంగమ్మ.

"ఏముంది! కంపిన్ల పనికి బొయిన కాడ మిషిన్ల చెయ్యిబడి ఇరిగిందంట" వివరించాడు సోమయ్య.

ఆ మాట వింటూనే పెద్దగా ఏడ్చిన మంగమ్మ పాత్ర గంట తరువాత "ఆడేనున్న ఒల్లు బల్సి పట్నం బొయిండా!? ఆ బ్యాంకోల్ల మీద మన్నువడ ఆల్లకి, కిస్తి గట్టకుంటె ఏం లొల్లి జేస్తరోనన్న బయంతోటి అట్లబొయి ఏదన్ని పన్జేసి నాల్గు పైసలు జమజేసుకొస్తనని బాయె. కర్మం పొదుగాను కర్మం బాగలేక ఇట్లాయె" కొడుకును తల్చుకుంటు పెనిమిటిని అడ్డుకుంది.

"గిప్పుడా దండకమంత ఎందుగ్గాని, పట్నంబొయ్ ఆన్ని దీస్క రావాల్నంటె బస్ కిరాయిలు గట్లగావాల ఏంజేద్దమంటవ్? మొన్న, మందగొట్టుకున్నందుకుగా... కుర్మోల్ల ఎంకులిచ్చిన పైసలు కల్పుగూల్లకే సాలవాయె! గా... ఔసలుప్పయ్యకు తొడుగులమ్మిన పైసల్ బెట్టి పుచ్చతోటకు పిండి బస్తాలు దెస్తిమి!" రోజు రోజుకు బతుకు జారుడుబండ మీద, పట్టుదప్పి జారిపోతున్న బేలతనం, తన మాటల్లో తొంగి చూస్తుంటే... అన్నాడు సోమయ్య.

"నిన్నగా... వొడ్ల రామనర్సయ్య దర్వాజకమ్ములకు రొండు తుమ్మచెట్లుగావాల్నని వొచ్చిండు గాదు! అడిగిరాఫో..." వెంటనే డబ్బులు దొరికే మార్గం చూపిస్తూ... అంది మంగమ్మ.

"ఇగో... గీ... రాళ్ళకట్ట గట్టిపోత" అంటూ గబ, గబా కాళ్ళ కట్ట బిగించసాగాడు సోమయ్య.

ఈలోగా ఊళ్లోవాళ్లో నలుగురైదుగురు మనుషులు ఇంటి ముందుకు రావడంతో "ఎవరా?!" అనుకుంటు అటు జూచిన సోమయ్య "ఏందే? పెద్దులు మావ! ఏమో ఎండలబడి వస్తుంద్రేంది?" సాలె పెద్దుల్ని అడిగాడు.

"నీకెర్కగాలే... అల్లుడా!? గా... కుమ్మరి బాలకిష్టమ్మ బొంయిందుగాదు! ఆనికేమొ మొగ పోరగాండ్లు లేరైరి. ఉన్ని ఆడిపోరలు అత్తగారిండ్లకుబోయిరి. ఆల్లొచ్చే తలికి తలో చెయ్యేసి ఏర్పాట్లు జేద్దామని తిర్గుతున్నం." హైటెక్ నాగరికతా, విదేశీ ఛానళ్ళ సంస్కృతి వాడ, వాడలా ఊడలు దిగుతున్న సమాజంలో ఇంకా మానవ సంబంధాలు అరుదుగానైనా బతికే ఉన్నాయి అన్నట్టుగా తామొచ్చిన పనేంటో చెప్పాడు పెద్దులు.

"అయ్యో! ఎప్పుడే చిన్నాయినా!? నాల్గు రోజుల కిందనే కుమ్మరామిలకు గావాల్నని కంచెల కంపంత మెలక్కపోయిండుగాదె!" అంది మంగమ్మ.

"రోగం, నొప్పి ఏం లేదు బిడ్డా! ఇయ్యాల మబ్బుల్నే లేసి కుండలేసుకొనిగా... ఈటూరు దాన్క బొయ్యొస్తనని జెప్పి ఆ... ఇంద్రపాల ముత్తాలమ్మ దాన్కబొయ్యి ఆన్నే ఇర్సకబడి ఊపిరొదిలిండంట" చెప్పాడం సాలె పెద్దులు.

"అర్రె...! ముసలోనికి బంగారమసుంటి సావొచ్చింది గాదే" అంది మంగమ్మ సానుభూతిగా

"సర్లే...! ఉంటుంటె ఇంకా పొద్దు బోద్దిగాని, చెల్కల బాయిగడ్డ దిక్కు ఎండుతుమ్ముందిగాని కొట్టకపొండ్రి" వాళ్ళొచ్చింది ఎందుకో తెలిసిన సోమయ్య అడక్కుండానే దహనానికి చెట్టు దానంజేశాడు.

కోస్తాలో కొబ్బరి చెట్టెంతో, తెలంగాణాలో తుమ్మ చెట్టంత ప్రజల జీవనంలో పుట్టుక నుండి చావు దాకా ప్రతిక్షణం మమేకమై ఆదుకుంటుంటాయి.

✤✤✤

చేయడానికి చెలకల్లో పని లేని రైతులు చాలా మంది రాముల వారి గుడి ముందు సప్టా మీద కూర్చుని కరువు మీద, కరంట్ మీద, బ్యాంకు వాళ్ళు పంపిస్తున్న నోటీస్ లందుకొని కిస్తీలు కట్టె శక్తి లేక పరువు కోసం ఆత్మహత్యలకు పాల్పడుతున్న రైతుల స్థితిగతుల మీద, రాజకీయాల మీద ఏదేదో మాట్లాడుకుంటున్నారు.

గుడికి ఎదురుగా వున్న అచ్చయ్య సేట్ దుకాణంలో కంకరగొట్టి వడ్డెరోళ్ళు సరుకులు దీసుకుంటు గాసర బీసరగా అరుస్తున్నారు...

గుడిలో గొడుతున్న జేగంట నాదం గుండె గోడల్ని మీటుతూ... దూర, తీరాలకు సాగిపోతుంది...

కుర్మోళ్ళ వెంకులు దుందనిడిచాడు.

"బా... బా..." మని అరుస్తు "తుస్క్, తుస్క్' మని తుమ్ముతు బజారున పోతుంటే లేస్తున్న దుమ్ము గుడి ముందు కూర్చున్న వాళ్ళ మీద పారుతుంది...

జీవాలు సీదరోళ్ళ మూల మలుపు తొంగిపోయినా, గాలిలో తేలివస్తున్న తెల్లటి దుమ్ములో పాలనురగ లాంటి క్వాలిస్ దూసుకొచ్చి సరిగ్గా గుడి ముందు ఆగింది.

అక్కడ కూర్చున్న వాళ్ళంతా "ఎవరబ్బా!?" అనుకుంటూ ఆసక్తిగా చూడసాగారు.

అంతకు ముందు, ఆ ఊరుతో ఏ సంబంధమూలేని నలుగురు కొత్త వాళ్ళు నింపాదిగా బండి దిగి, అక్కడున్న వాళ్ళందరితో పరిచయమున్న వాళ్ళల్లా నవ్వుకుంటూ రాసాగారు...



వాళ్ళు గంజిపెట్టి ఇస్త్రీ చేసిన ఖద్దరు బట్టలు తొడుక్కున్నారు. వాళ్ళు కొట్టుకున్న 'స్ప్రే' ఏంటోగాని, చల్లటి వాసన వాళ్ళకంపే ముందే గాలిలో తెలివస్తూ... రైతుల్ని తాకింది. వాళ్ళందరి వేళ్ళకు, రకరకాల ఉంగరాలు, ముంజేతులకు బ్రాస్‌లెట్స్, మెళ్ళల్లో గొలుసులు ధగ ధగ లాడుతున్నాయి. వాళ్ళు ఎటు చూస్తున్నారో అర్థం కాకుండా కూలింగ్ గ్లాసెస్ పెట్టుకున్నారు.

"వీళ్ళెవరోగాని బాగా బలిసినోళ్ళే...!" అనుకోసాగారంతా.

వాళ్ళను చూసిన క్షణంలోనే కొడుకును బేరం జూసుకొమ్మనిజెప్పి 'నర్రే నర్రే'న వాళ్ళ దగ్గరకొచ్చి "ఎవలింటికొచ్చింద్రుసార్!?" "చూశారా!? మీ అందరి కంటే ముందే నేను వీళ్ళతో మాటలు కలిపాను" అన్నట్టుగా అక్కడున్న వాళ్ళ వైపు చూస్తూ అడిగాడు అచ్చయ్యసేట్.

"మాది హైద్రబాద్. కట్టె బేరం జేస్తుంటం. ఈ ఊళ్ళ తుమ్మలు బాగున్నాయని ఎవలో జెప్తే తెల్సుకుందమని వొచ్చినం" కళ్ళజోడు దీసి జేబులో పెట్టుకుంటూ అన్నాడు వచ్చిన వాళ్ళల్లో ఒకడు.

"గిట్లనా? వీళ్ళెవరో పెద్ద సేట్లే!" అనుకున్న అచ్చయ్య దుకాణంవైపు తిరిగి "ఆరే! శీనయ్యా! ఆ... ఉప్పరోల్ల పొలగాండ్లతోని నాల్గు కుర్సీలిటుబంపు" అంటు కొడుకును కేకవేసి అవసరంలేని హడావిడి చెయ్యసాగాడు.

కుర్చీల్లో కూర్చున్న కలప వ్యాపారుల చుట్టూ మూగిన రైతులకు వాళ్ళు చెబుతున్న మాటలు వింటూనే, వర్షం లేక నెర్రెలిచ్చిన రేగడి నేల మీద కురిసిన తొలకరి జల్లుకు వస్తున్న మట్టివాసన పీలుస్తున్నంత ఆనంద పడిపొయ్యారు.

వాళ్ళేదో మాట్లాడుతుండగానే వచ్చిన పోస్ట్‌మాన్ లక్ష్మయ్య "అరే! ఊరంత తిర్గకుండా అందరీన్నే దొర్కింద్రే!" అంటూ సైకిల్ దిగి సంచిలోని కాగితాలు బయటికి దీస్తుంటే... ఏదో అనుమానం పెనుభూతంలా మనసు పొరల్లో రూపు దిద్దుకుంటుంటే "ఏందయ్యో!? ఏందో కాయితాలు దీస్తున్నెవేంది?" అక్కడున్న వాళ్ళల్లో ఎదరో ఒకరు అడిగారు.

గత ముప్పై ఏళ్ళుగా ఉత్తరాలు బట్వాడా చేస్తూ... ఎన్నెన్నో ఉద్విగ్న సన్నివేశాలకు సాక్షీభూతుడైన పోస్ట్‌మాన్ కర్మయోగిలా చూస్తూ... "ఏమున్నె! గా.. కోపరేట్ బ్యాంకోల్లు నోటీసులు బంపింద్రు" అంటు ఎదరి నోటీసులు వాళ్ళకు అందించాడు.

"అబ్బ! మంచి టైమ్‌ల వొచ్చినం" అనుకున్న కలప వ్యాపారులు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. అసలే పట్నంలో దెబ్బదగిలి ఉన్న కొడుకును తీసుకు రావడానికి మూడు రోజుల్నుండి డబ్బులు దొరక్క ఇబ్బంది బడుతున్న సోమయ్యకు బ్యాంక్ వాళ్ళ నోటీస్‌తో మతిబోయినంత పనైంది. దీర్ఘంగా ఆలోచించిన మీదట ఓ నిర్ణయానికొస్తూ...." మాకో అర్వై, డెబ్బై తుమ్మలున్నైగాని పంథర బెద్తరో చెప్పంద్రి" అక్కడున్న రైతులందరి కంటే ముందుగా అడిగాడు.

"తుమ్మల్ల బర్రెను బెట్టి కొమ్ములు బేరం జేసినట్టు మాట్లాడితెట్ల? చెట్లు జూడాల, మాట్లాడాలగాని" అన్నాడు బేరగాళ్ళల్లో ఒకడు.

"సూస్తనంటె, సూపిస్త" అన్నాడు సోమయ్య

"చూద్దాం ఫా..." ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా వెంటనే లేచి నిల్చున్నారు బేరగాళ్ళు నలుగురు.

"అన్నే మాయిగూడ ఓ... ముప్పై, నలభై చెట్లున్నై సూద్దురుగాని పాంది" అన్నాడు కర్రెయ్యోళ్ళ సత్తెయ్య.

"మాయున్నై, మాయున్నై" ఆలస్యం జేస్తే మళ్ళా పద్దంటారేమోనన్నంత తొందరపడుతూ అడిగారు అక్కడున్న రైతులంతా.

రైతుల ఆరాటం జూసిన బేరగాళ్ళు. "ఇయ్యాల నక్కను దొక్కొచ్చినంరాభాయ్!" అనుకుంటు క్వాలిస్ నిండా రైతుల్నెక్కించుకొని సోమయ్య చేను వైపు పోనిచ్చారు.

✣✣✣

అవసరం ఆత్రపెడితే... అవకాశం సొమ్ము జేసుకుంటుంది.

ఇప్పుడు రైతులకు డబ్బులవసరం ఎంతుందో గ్రహించిన బేరగాళ్ళు చెట్లను చూసింతర్వాత 'అడ్డికి పావుశేరు' అన్నట్టుగా అడిగారు.

అన్యాయంగా అడుగుతున్నారని తెలిసినా అమ్మటానికి తమ దగ్గర ఇంకేం మిగలని రైతులు విధిలేక వాళ్ళడిగిన తెలవాపారు.

నాలుగు వేలు బయానాదీసుకున్న సోమయ్యా కొడుకును, కోడల్ని తీసుకురావడానికి పట్నం బస్సెక్కాడు.

రెండో రోజు తెల్లారే సరికి ఓ మినీ లారీలో ఇరవై, ముప్పై మంది కూలీలతోబాటు గొడ్డళ్ళు, రంపాలు, తాళ్ళు పంటపాత్రలు వేసుకొని వచ్చిన కలప బేరగాళ్ళు తిన్నగా సోమయ్య పాత బాయి గడ్డ మీది తుమ్మ చెట్ల కింద దిగిపొయ్యారు.

దిగీ దిగంతోనే ఒకరిద్దరు కూలీలు వంట ప్రయత్నాల్లో పడితే మిగతా వాళ్ళు పనిలోకి దిగిపోయారు.

గొడ్డళ్ళ చప్పుళ్ళతో ఫణిగిరి గుట్టలు ప్రతిధ్వనింపసాగాయి. ఒక్కో చెట్టు కసాయివాళ్ళ చేతుల్లో మేకల్లా ముక్కలు,

ముక్కలుగా తిరగబడి పోగులు పడసాగాయి....

అసలే వానల్లేక భూములన్నీ వల్లకాడులా కన్పిస్తుంటే... ఉన్నచెట్లను గూడా కొట్టెయ్యడంతో ఊరంతా పసుపూ, కుంకుమ కోల్పోయిన ఇల్లాలిలా అన్పించసాగింది.

రోజంతా పని చేసిన కూలీలు సాయంత్రం అయ్యేసరికి గుండె పూడి నుండి రెండు కుండల నిండుగా కల్లు దెప్పించుకొని తాగుతూ... కోడి మాంసం తింటూ జల్సా చేసుకుంటుంటే చూస్తున్న రైతులు" ఎద్దూ, యవసాయం ఉన్న మనకంటే గీ... కూలోల్లే నయం పొద్దుగూకులు పన్జేసి పొద్దుగుంజాముల కల్ల ఇంతిదిని, తాగుతుండ్రు" అనుకోసాగారు.

కూలీలకు పని ఒప్పజెప్పి "రొండురోజుల్లవస్తం" అని వెళ్లిన బేరగాళ్ళు వారం రోజుల దాకా తిరిగి చూడలేదు. కానీ, ఊళ్ళో చెట్లు మాత్రం ముప్పాతిక మందం తెగిపడ్డాయి.

బ్యాంక్ వాళ్ళు నోటీస్‌లు పంపించి కూడా పది రోజులు దాటుతుంది. దాంతో కిస్తీ కట్టాల్సిన వాయిదా దగ్గర పడుతుండడంతో రైతులంతా భగ్గగ్గలాడిపోసాగారు... దానికితోడు బ్యాంక్ వాళ్ల దౌర్జన్యానికి భయపడి రైతులు చేసుకుంటున్న ఆత్మహత్యల గురించి పేపర్లల్లోనూ, టి.వి.లల్లోనూ చూస్తూ... "మాగతేమైద్దో..." అనుకొని కర్ర బేరగాళ్ళిచ్చ బోయే డబ్బుల మీద ఆశలు పెట్టుకోసాగారు...

✣ ✣ ✣

తూర్పున తెల్లగా పొద్దుపొడిస్తుంది...

పిచ్చుకల 'కిచ, కిచ'లు, కాకుల 'కావ్ కావ్'లు విన్పించడంలేదు.



నిన్నటి చల్లకవ్వాలను మరిపిస్తున్న హ్యాండ్ బోర్ల చప్పుళ్ళు దూరంగా విన్పిస్తున్నాయి.

అప్పుడు,

ఓ పది, పదిహేను లారీలు ఒక దాని వెనుక ఒకటిగా ఊళ్ళో కొస్తుంటే చూసిన వాళ్ళంతా "గిదేంది!? పొద్దున్నే గిన్ని లారీలొస్తున్నై!?" అనుకుంటుండగానే వాటిని దాటుకొని వస్తున్న క్వాలిస్ కన్పించడంతో "ఓ... కట్టె బేరగాల్లా!" అనుకున్నారు.

వాళ్ళను జూసిన అచ్చయ్య సేట్ రయ్యున ఉరికొచ్చి "ఏంది సేట్లూ! రొండ్రోజుల్ల వస్తమని జెప్పినోల్లు గిన్నొద్దులు బోతిరి? అడుగుతుండగానే ఒక్కో రైతూ వచ్చి వాళ్ళను చుట్టు ముట్టసాగారు...

"జె, సేట్! గట్లనే అనుకొని బొయినంగాని, తీర ఇంటికి బొయినంక మెదక్‌ల మామిడి చెట్లు బేరానికొచ్చినయని దెల్సి గటు బొయ్యొచ్చినం" అన్నారు వాళ్ళు.

"అదెపాయెలే... ఇప్పుడన్నొచ్చిండ్రు...గా.. బ్యాంకోల్ల గోల లేకుంటబోతె గంతేసాలు" అనుకున్నారు. చెట్లమ్మిన రైతులంతా.

వచ్చిన లారీలను, కూలీలను ఊళ్ళో నాలుగు పక్కలా సరుకెత్తమని పంపించిన బేరగాళ్ళు ఆ తర్వాత సోమయ్య బాయిగడ్డ మీది మోదుగాకుల గుడిసెలో కూర్చుని సిట్టింగ్ వేశారు.

తమ చెలకల్లో కొచ్చిన కర్ర లారీలకు దగ్గరుండి సరుకెత్తిచ్చిన రైతులంతా సాయంత్రానికల్లా లారీలతోపాటు సోమయ్య బాయి దగ్గరకు చేరుకున్నారు.

వచ్చిన లారీకి, వచ్చినట్టే వే బిల్లులు రాస్తూ... డిజిల్‌కి, బేటాలకు డబ్బులిస్తూ... హడావిడి చేస్తున్న కర్ర బేరగాళ్ళు రైతుల్ని చూసిగూడా చూడనట్లే మెదలసాగారు.

బేరగాళ్ళ వ్యవహారం నచ్చని రైతుల్లో కొందరు "జర లెక్క జూసి మాపైసల్ మాకిస్తే... మాతోవన మేం బోతం" అంటూ అడగడం మొదలు పెట్టారు.

"అరే! గీ... లారీల రందిలబడి అసలు సంగతి మర్సినం గాదు! లారీలు గిట్ల మాట్లాడుకొని తీర బ్యాంక్‌కు బోదుంగద! బ్యాంక్‌ల్ల ఇస్ట్రైక్ నడుస్తుందని దెల్సింది. ఇంగేం జెయ్యాల జెప్పుండు!? దగ్గెరున్న పైసలు తోటే బైలెల్లొచ్చినం గా... ఫైనల్ గూడ మీ కండ్ల ముందల్నే లారీలోల్లకిస్తిమి! ఆకాడికి ఎ.టి.ఎమ్.ల్ల గూడ ట్రైజేసినం. అటిల్ల గూడ పైసల్లేవ్. గందుకే పైసల్ దీస్కరాలే... ఐతే ఇంతకు ముందల్నే సెల్లుల మాట్లాడినం. ఇస్ట్రైక్ ఐపోయిందంట. గీ... సర్కు మండిల దించి, పైసల్ దీస్కోనొస్తం. ఇంతల మిగిలిన చెట్లు గూడా నర్కుడైతది. ఇంగమేమొచ్చి మీ ఫైనల్ మీకు సుప్తాగిచ్చి, మా సర్కు మేమెత్తుకపోతం" తాము డబ్బులు లేకుండానే సరుకెత్తుకు పోతున్నామన్న సంగతి రైతులకే మాత్రం నొద్యకుండా ఒకరి తరువాత ఒకరుగా బేరగాళ్ళు నలుగురూ చెప్పసాగారు.

డబ్బులు లేకుండానే వచ్చామన్న బేరగాళ్ళ మాటలన్ని రైతులకు నడుము తిరిగి నట్టే కూలబడిపోయారు.

పట్నంలో యాక్సిడెంటై మొన్న, మొన్ననే ఊళ్ళోకొచ్చిన సోమయ్య కొడుకు బేరగాళ్ళ మాటలకు కోపంతో నిలువునా ఊగిపోతూ... "ఓ... గీ ముచ్చెట్లన్నీ మాకు దెల్వది. ఇస్తే మొత్తం పైసలియ్యుండ్రి, లేకుంటె బండ్లకెల్లి నుంచి సర్కు దించుండ్రి. మాబాపు. మామేనత్తకు బాగలేదంటె నిన్ననే జనగాం బొయిండు. ఇయ్యాలరేపట్ల గా... బ్యాంకోలొచ్చి మా చెలక ధర్రాజ్ బెట్టిండ్రంటే! మా పర్వేంగావాల? గీ వచ్చని సెట్లన్ని ఎందుకమ్ముకున్న మనుకుండ్రు!? అసలే మా చెందర్‌గాన్కి నాల్గుదినాల్నుంచి మూసిన కన్ను దెర్వకుంట ఒకటే జరమొస్తుంది. దవఖానకు కొంచబోదామంటె చేతుల పైసలేక జస్తున్నం గందుకే పైసలిచ్చుడో.. సర్కునించుడో... తేల్చుకోండ్రి" హద్దుదాటిన సహనంలో నుండి పుట్టుకొచ్చిన తెగింపుతో గట్టిగా మాట్లాడాడు.

సోమయ్య కొడుకు చర్యతో దిమ్మెరబోయిన బేరగాళ్ళు "వామ్మో! గీ... దెవడోగాని ఆకర్ మూమెంట్ల కతంత ఉల్టా.. పల్టా జేసేటట్టుండు!" అనుకొని "అరే! ఏందిబాయ్! గంత పరేశానైతున్నవ్? మా తాన పైసలుంచుకొని ఇయ్యట్లే దనుకుంటున్నవా ఏంది?! బ్యాంకులు ఇస్ట్రైక్ లుండబట్టి గాని లేకుంటె ఎందుకుదేం? గీసరుకట్లదించి, ఇట్ల పైసల్ దీస్కొచ్చి ఇస్తంగాను. ఒక్కరొండు పూటలు జర వోపిక బట్టుండ్రి "పరిస్థితిని చల్లబడేలా మాట్లాడారు.

"ఆ... గీ... కతలన్ని నాకినిపిచ్చకుండ్రి పైసలియ్యంది సర్కుగదల్నియ్య" ఖరాకండీగా అన్నాడు సోమయ్య కొడుకు.

"అరె! మమ్ముల్ని జరంత అర్థం చేసుకోబాయ్!" అంటు తలబట్టుకొని "అంతగ్గావాల్నంటే ఇంగో...గీ... ఐదొందలుంచుకో" అంటూ జేబులో నుండి డబ్బులు దీశాడు బేరగాళ్ళల్లో ఒకడు.

"ఏందయ్యా! మీకేమన్న సోయుందా? ఔతల పోరడు జరంతోటి సాల్తిమి దగ్గిర బద్దడని మొత్తుకుంటుంటే ఏందో... బిచ్చెమిచ్చినట్టు ఐదొందలిస్తమంటరేంది?!" మరింత గట్టిగా అన్నాడు సోమయ్య కొడుకు.

"అసలు మీరేంది? పద్ది నాలున్నోల్లు, ఇంకో రొండొద్దులుండి పైసల్ దీస్కోనే రాక పోయింల్రు! ఔతల యమునోల్లలెక్క, బ్యాంకోల్లెప్పుడొచ్చి ఇండ్ల మీన బడ్తరోనని అదురుక జస్తుంటిమి" చెరువు కట్టకు బుంగ బడ్డట్టుగా ఒక్కొక్క రైతే బేరగాళ్ళ మీద నోరు జేసుకోసాగారు...

పరిస్థితి ఎలాగో అయ్యేటట్టుందనుకున్న బేరగాళ్ళు మెల్లగా కాళ్ళ బేరానికొస్తూ... "చూడండ్రీ! గిప్పుడు మీరు లొల్లి జేసినా పైసలైతెరావుగా... అట్ల పట్నం బొయ్, ఇట్ల పైసలందుకోస్తం" అంటూ నచ్చజెపుతూ... సోమయ్య కొడుకు వైపు దిరిగి నీ... కొడుకును దీస్కరాఫో... మా బండ్లె సూర్యాపేట దీస్కపొయ్ పెద్ద దవాఖాన్ల జూపిస్తం. ఆడికి బోతె ఏ.టి.ఎమ్‌లకెల్లి పైసల్ దియ్యనీకి కుదురుద్ది ఎంతగావాల్నంటె అంత దీస్కోవొచ్చు." అంటూ చాలా నేర్పుగా మాట్లాడారు.

వాళ్ళ మాటలు ఎందుకో నమ్మబుద్ధిగాని సోమయ్య కొడుకు వెనుకా, ముందులాడుతుంటే చూసిన రైతులంతా" వారీ! అంతగనా జెప్తుండ్రుగా... ఇంగేం జేస్తంగాని పిల్లగాన్ని దీస్కబొయ్యి పేట్ల జూపించకరాఫో..." ఎదుటి వాళ్ళను తేలిగ్గా నమ్మడమనే మంచితనపు బలహీనత మనసు నిండాపొర్లుతుంటే అన్నారు రైతులంతా సోమయ్యకొడుకుతో.

మళ్ళీ వాళ్ళ మనసు మారుద్దేమోనన్నంత తొందరగా... లారీలను బయలుదేర దీయమని డ్రైవర్లకు సైగజేశారు బేరగాళ్ళు.

అంతే...

లారీ వెనుక లారీగా కదిలి రైతుల కళ్ళల్లో దుమ్ము గొట్టుకుంటూ... వెళ్ళి పోయాయి కర్రలోళ్ళు.

రైతులంతా ఆ మాటా... ఈ మాటా మాట్లాడుతుండగానే 'సర్రు'న ఇంటికి బోయిన సోమయ్య కొడుకు చందర్‌గాణ్ణి భుజం మీద వేసుకుని, భార్యను వెంటబెట్టుకుని రాగానే క్వాలిస్‌లో ఎక్కించుకున్న బేరగాళ్ళు చూస్తుండగానే సూర్యాపేట వైపు దూసుకుపోయారు.

అప్పటికే రాత్రి పది కావస్తుండడంతో రైతులంతా ఎవరి ఇండ్లకు వాళ్ళు బయలుదేరారు.

✣✣✣

అర్ధరాత్రి జనగామా నుండి లారీ దిగి వచ్చిన సోమయ్యకు రాత్రి జరిగిన సంగతులన్నీ వివరించింది మంగమ్మ.

జరుగుతున్న సంగతులన్నీ ఒక్కొక్కటే కళ్ళ ముందుకదులుతుంటే ఎంతో సేపు ఆలోచించి, ఆలోచించి ఎప్పటికో నిద్ర బోయ్యాడు సోమయ్య.

అప్పుడే కప్పర, కప్పర తెల్లారుతుంది...

దూరంగా ఎక్కడో... కుక్కలు మోరలు పైకెత్తి ఏడుస్తున్న చప్పుడు వినిప్పిస్తుంది...

కరెంట్ వైర్లకు తగిలి చచ్చిపోయిన ఓ... కాకి చుట్టూ చేరిన పెద్ద కాకి గుంపు గోల, గోలగా అరుస్తున్నాయి.

అంతలోనే...

'దడ, దడ'మని వాకిలి తలుపులు కొడుతున్న చప్పుడు విన్న సోమయ్య గబ, గబా వెళ్ళి తలుపు దీశాడు.

ఎదురుగా!

జ్వరంతో కలవరిస్తున్న చందర్‌గాణ్ణి భుజం మీద వేసుకుని వంటినిండా దెబ్బల్తో నిలబడ్డ కొడుకునూ, కోడల్నీ చూసిన సోమయ్య అదిరిపడుతూ... "అరే! ఏమైంది బిడ్డా! వొంటి నిండగా... దెబ్బలేంది!?" అంటూ గాబరాగా అడిగాడు.

తండ్రిని చూడగానే అప్పటిదాకా ఆపుకున్న దుఃఖం కట్టలు తెంచుకోగా "బాపూ!" అంటూ తండ్రిని పట్టుకొని బిగ్గరగా ఏడుస్తూ... "ఆ... బేరగాని ముండకొడుకులు పెద్ద దొంగ బాడకావులు బాపో! భర్వపెల్లి దాట్నంక బండాపి "ఏంద్ర కొడకా! పెద్ద మొగోనిలెక్క లొల్లిజేస్తున్న వేంద్రా?" అన్కుంట మమ్ముల్ని సొక్కగొట్టి కిందికి నుంకి దెంకపోయిండ్రే...! కమిలిపోయి, కదుములు గట్టిన వాళ్ళంతా తడుముకుంటూ జరిగింది వివరించాడు.

విషయం నిమిషాల మీద ఊరంతా చుట్టేసింది!

ఊరి రైతులంతా పడుతూ... లేస్తూ... సోమయ్య చేను వైపు పరుగులు పెట్టారు.

ఏముందక్కడ!? చూడ్డానికి!

అందర్నీ నమ్మించిన బేరగాళ్ళ కళ్ళముందే సరుకుతో సహా మాయమైతే

ఎవ్వరికీ చెప్పకుండా చీకట్లో కలిసి పొయ్యారు కూలీలంతా!

జరిగిన మోసం అర్థమైన రైతులు నిర్ఘాంతపోయి చుట్టూ చూసుకుంటే.. నరికేసిన తుమ్మచెట్ల మొదళ్ళు చేతినిండా గోరిల్లా కన్పిస్తుంటే గొల్లుమన్నారు.

ఇది జరిగిన మూడో రోజు.

"రేపటికిల్లా ఇచ్చిన వాయిదా ప్రకారం కిస్తీలు కట్టని వాళ్ళ భూముల్ని జప్తు చేస్తాం" అంటూ ఇంటింటికీ బ్యాంక్ వాళ్ళు నోటీస్‌లు అంటించిపొయ్యారు.

తెల్లవారితే బ్యాంక్ వాళ్ళు ఊరి మీద బడి ఎంత గోల జేస్తారోనన్న బెంగతో ఏరైతూ కంటినిండా నిద్రబోలే...

తెల్లవారుతూనే దుక్కతోట దగ్గరకు కావలి బోతున్న కర్రెయ్యోళ్ళ సత్తెయ్యకు బాయిగడ్డ మీది తుమ్మ చెట్టుకు వెళ్ళాడుతున్న సోమయ్య కన్పించాడు.

❖

# చాలులే; ఇక ... రా

**జుగాష్‌విలి**

చాలులే; ఇక... రా
వైతరణిలో ఈదులాడింది చాలులే
జీవనదిలో యిక స్నానించులే

విశృంఖల వడగాల్పులో షికారు చాలులే
వసంత సమీరంలో యిక ఓలలాడులే

నేలందని వ్యామోహపు
సుడిగాలిలో కొట్టిన గిరికీలు చాలులే
మమతానుబంధాల ఆవరణలో నర్తించులే

పులినీడన నిద్ర యిక చాలులే
నింబ వృక్షపుచ్ఛాయలో నిర్భీతితో చరించులే

చాలులే;
ఈ బొమ్మ లాటలిక చాలులే
పరస్పర హింస నుంచి
పరస్పర ప్రేమలోకి
ప్రయాణించులే...

హరితస్వప్నం
నేలమీద నడుస్తుండేది
నవ్వులు గొడుగులు పట్టేవి
ఇక్కడి నేల మీద
బతుకులోకి చల్లగాలులు వీస్తుండేవి

కడుపులోని ఎండ తరిమితే
దూరాల్లోని ఈ నీడలవైపుపడినోళ్ళు
అన్నం ముద్దలందించి నోళ్ళం
అవమానాలగుంజుకు
కన్నీళ్ళతో కట్టేయబడ్డాం

నీళ్ళతడితాకితే
ఎవరైనా వృక్షాలై విస్తరిస్తారు
పక్కన నడిచే నీవూ
ఉషోదయరేఖల్లో ఎగిరావ్
ఒకరి వెలుగు ఎవరికి నీడైనా
లోలోన స్మశానాలు మోస్తున్నట్లే

అనంతకాలం నుండి పారుతున్న
కలలకాలువలం కదా
ఇపుడు కరచాలనంలో
కాంతి తళుక్కుమనడంలేదు
నెత్తురు చిట్లుతున్నది

# హృదయం ముక్కలు కాని స్వప్నం

**పరిమళ్**

మన జీవితాల రెపరెపల గాలికోసం
కత్తుల్లా కదలాల్సిన మనం
ముక్కలు ముక్కలవుతున్నాం

ఎక్కడి నుండోవచ్చి
బతుకుల ఎదల మీద కూర్చున్నవాడు
మరెక్కడినుండో వస్తున్న
అమ్మకందారుడితో కలుస్తున్నపుడు
కాళ్ళకింది నేలకదిలే వేళలు వేచిచూస్తున్నాయి

చాలీచాలని ముద్దల పంపకంలో
కనిపించని దారప్పోగుల మెలికలు
ముద్దొచ్చే మాంత్రిక ఐక్యతా రాగాలు!

ఈతలలొంచిన ఏబీసీడీలు
వర్ణాలు దాటిన మనుషులు
పాముతలను చక్రంలా కత్తిరించే భూగోళం
చరిత్ర తెరమీద
సుందరంగా ప్రకాశిస్తాయి.

# ద్వితీయ పౌరసత్వం

**అడిగోపుల వెంకటరత్నమ్**

ఉప్పుకు కర్పూరానికీ
అమృతానికి హాలాహలాలకీ
ఆమెకు భేదం తెలియదు
అన్నీ కర్పూరాలే
అన్నీ అమృతాలే
ఆమె రూపంలో చంద్రబింబం
ఓర్పులో భూదేవి
వాళ్ళ వైవాహికం తీగలా పెనవేసుకుంది
అభివ్యక్తి వేరైనా సారాంశం ఒక్కటే
నడకలు వేరైనా నడతలు ఒక్కటే
వాళ్లు జంటగా వెన్నెల్లో తడవటం చూసి
చంద్రుడు తారతో జతకట్టేవాడు!
ఆమె గర్భం చిగురించింది
అమ్మాయి పుడుతుందని
అయ్యలా వుంటుందని
అబ్బాయి పుడతాడని
అమ్మలా వుంటాడని
అమ్మలక్కల ఊహారాగాలు
మురిపాల చిలిపి కవ్వింపులు
అతనికి గుండెల్లో గుబులు
మనసున బెదురు కమ్మి
మౌనం మనిషిని మింగేసింది!
లింగ నిర్ధారణ జరిగాక
భర్త మౌనం బ్రద్దలైంది
మొదటి కాన్పు మగయితే బావుణ్ణు
గర్భస్రావమే శరణ్యం
భర్త భావం బైట పడింది!
నేను తల్లిని
సృష్టిని
ప్రతి సృష్టిని
సృష్టించే క్షేత్రాన్ని
మాంచాల
బాల చంద్రుడు
ఇద్దరూ నాకు కావడికుండలు
భార్యమనస్సు బహిర్గతమైంది!
శౌర్యానికి ఆమె సాత్త్వికి
సహనానికి ఆమె జానకి
కర్మభూమి జన్మభూమిలో
పురుషుడు పూజితుడు
పడతి పూజారిణి!

# భూతనక



ఎలికట్టె శంకర్

**బ**తుకంతా ఎవడో తరుము తున్నట్లు వురుకులు పరుగులు. దినం తీరిక లేదు దమ్మిడి ఆదా లేదు. ఓ పండుగ పబ్బంలేని బతుకు. బస్సు దిగింది మొదలు వొకటే పని. ఎరువులు, యిత్తనాలు, యింట్లసామాను, పిల్లల బట్టలు వోదాని తర్వాత వోటి... సూస్తుండంగనే పొద్దూకింది. ఆరింటి బస్సు యెల్లిపోయింది. మల్లా ఆకరి బస్సే. నల్లగొండకు వొచ్చినపుడల్లా అనుకుంట యెల్లెం పోదామని. కాని యెప్పుడు ఆయితయ్యిందని?

ఆకరి బస్సుకు యింకా అర్ధగంటుంది. పొద్దున యింట్లెతిన్నదే యింత సద్దిబువ్వ. అమ్మటేల్లకు కూడా పచ్చిమంచినీల్లేనాయె. గోకినట్లయితుటె కడుపుల యేవన్న యేసుకుందామనిపించింది. బస్టాండు యెదురుంగ వున్న బండి దగ్గరికిపోయిన.

ఓ పొట్లంల రొండు బజ్జీలు యేసిస్తె తినుకుంట ఆమెదిక్కే సూస్తున్న. తెలిసిన మనిషోలిగనే అనిపిస్తుంది గాని యాదికొస్తలేదు. మనిషి నల్లబడి నకిరం బట్టినట్లుంది. మొకమంతా ముడుతలు. ఎండు కట్టెపుల్లోలిగ వుంది. మొకంలో యేదో అలసట. అది ఈ వొక్క రోజుది మాత్రం కాదనిపిచ్చింది. తరాలు యుద్ధం చేసిన అలసటోలిగుంది.

ఆలోచిస్తున్న నాకు యాదికొచ్చి 'నువు సత్తెమ్మత్తవు కదూ?" అన్న.

ఆమె నా దిక్కు గుర్తుపట్టనట్లుగా చూసింది. నా పేరు, నాయిన పేరు చెప్పినంక ఆమె మొకంలో నన్ను యెరక్కబట్టిన ఆనవాలు.

'బావున్నవా అత్తా' నేనే అడిగిన మల్లా.

'ఏదోనయ్య యిట్ల బతుకుతున్న' వో నిట్టూర్పు యిడిసింది. యెమ్మటే తేరుకొని నవ్వే ప్రయత్నం చేసింది. ఆ నవ్వు పెదవుల మీదనే వుంది. ఆ నవ్వులో పానం లేదు. ఆమె మొకాన్ని దిగులు కమ్మినట్లుంది.

ఎట్ల వుండే మనిషి యెట్లయ్యింది?

'బావున్నవాయ్య! యెర్కబట్టలేక పోయిన. చిన్నపుడు పీలగ గింతంత వుంటివి. గడ్డం మీసాలొచ్చేసరికి పోల్సుకోలేకపోయిన' నొచ్చుకున్నట్లుంది.

'నాయినా బావుండాయ్య?'

నేను ఊ కొడుతున్నా నా మనసు నిండా ఆలోచనలే.

'చానా రోజులయ్యింది నాయినా మనూరోల్లు కనబడక. పూల్లంత బావుండ్రా నాయినా? ఆ పెద్ద మనిషి వుండా? ఆ వూరి బైటోళ్ళ పిల్ల పెండ్లయ్యిందా? రోటికాడి గంగమ్మ కాపరానికొస్తుందా?'

తన వూరి మనిషి కనపడే సరికేమో ప్రశ్నల మీద ప్రశ్నలు వుశారుగా అడుగుతుంది. మొకంలో కొద్దిగా కళ కనబడ్డది. అదంతా యింట్ల మనిషి సచ్చినపుడు సానుభూతి సూపిస్తే కలిగే ఆనందమోలిగుంది.

నుదురు బోసిబోయి వుంది. మాట్లో దిగులు. గొంతులో జీర. నవిసిన మనిషోలిగ. చివరి యుద్ధం చేసే మనిషోలిగ వుంది.

అత్త యేదో అడుగతనే వుంది. ఆమె మొకం దిక్కే సూస్తున్న. మాట్లాడుతుంటే ఆమె పండ్ల దిక్కే చూస్తున్న. అదే పన్ను. సగం యిరిగి సగం నల్లబడి. అత్త బతుకోలిగ పన్ను కమిలిందో, పన్నోలిగ అత్త బతుకు చితికిందో గని పన్ను సూడగానే నేను చిన్నప్పుడు సూసిన అత్త యాదికొచ్చింది.

✦✦✦

మా యింటికి రొండిడ్ల ఆవల వో తాతా వుంటోడు. ఇంతకు ముందు కులవృత్తే చేసేటోడు. వొయిసు మీద బడ్దంక బందు జేసిండు. ఎట్లనో అట్ల కష్టపడి నాలుగెకరాలు సంపాయించిండు. కులవృత్తులు మూలకు పడుతుంటే యవుసాయం జేసుకోవాలనుకుండు. కొడుకు రాజాలు సేతికందిండు. సదివిన సదువుకు సర్కారు కొలువేం రాదని గమ్మునుండు. కొడుకు ఆసరతో తాత యవుసాయం చేయాలనుకుండు. కాని వున్న దుబ్బశెల్కకు వసర్తి లేదు. బాయిగుంట పట్టుకుందామన్నా చేతులపైసలేదు. తండ్రి ఆలోచన తెల్సుకున్న రాజాలు భూతన్క బ్యాంకోళ్ళు అప్పిస్తరని తెలుసుకుండు. పైరవికార్ని పట్టుకొని చెప్పులరిగేటట్లు తిరిగి మంజూరు చేయించుకుండు.

భూతన్క బ్యాంకు అప్పు మంజూరయ్యిందనంగనే తాత సంబూరబడ్డడు. తన కొడుకు ఆసామోలిగ బతుకుతడని కలలుగన్నడు.

మంచి రోజు చూసి బాయిపూజ జేసిండు. యెమ్మటే వొడ్డెరోళ్ళకు గుత్తకిచ్చిండు. నెల తిరగకముందే నాలుగు కోలల బాయి తెగింది. బాయిల జల చూసే సరికి తాతకు యెక్కడలేని సంబూరమైంది.



రాజాలు మనసైతే రెక్కలొచ్చిన పిట్టపిల్లోలిగ యెగిరింది. ఆ వూపుతోటే బాయిగడ్డ మట్టి యెత్తి బోదె పోసిండు. ఉన్న నాలుగెకరాలు నీళ్లు తిప్పాలని వుపాయం చేసిండు. కింది రోకున్న రొండెకరాలు అచ్చుగట్టిండు. పైరోకు సదనం చేసిండు. ఆ కారు నాలుగెకరాలు పంటేసిండు. వొడ్లు, శెనిక్కాయలు, మొరంగడ్డ... తీరొక్క కూరగాయ పెట్టిండు. పొద్దుమాపనక చెమట తీసిండు. ఆ యేడు పంట సూస్కొని తాతైతే తను బతుకంతా పడ్డ కష్టాన్ని మర్సిపోయిండు.

సంసారం గాడిన పడ్డదని తాత తుర్తిపడ్డడు. ఆ సంతోసం లోనే రాజాలుకు వో పిల్లను సూసి పెండ్లి చేసిండు.

'రాజాలు పెండ్లం దొండ పండోలిగుంది. పెద్దింటి పిల్లోలిగ సక్కదనంగుందని' సుట్టు పక్కల అమ్మలక్కలు గుసగుసలాడుకుండ్రు.

ఆ రాజాలు భార్యే సత్తెమ్మత్త. కలగోలుపు మనిషి కష్టం తెల్సిన మనిషి.

రొండేండ్లు కాలమైంది. కంటినిండ పంట చూస్కుండ్రు. కడుపునిండ తిన్నరు. సత్తెమ్మత్తకు కూడా కడుపు పండింది. ఇంటి రాజులు సంబూరంగ వుండ్రు.

కాలానికి కన్నుకుట్టిందేమో! ఆ యేడు అదునైనా పదును కాలేదు. మబ్బులు దాగుడు మూతలాడినయ్. సాఫీగా సాగుతున్న ప్రయాణంల చెప్పు తెగినట్లయింది. బాయిగుంటలనీళ్ళు పీక్కపోయినై. రాజాలు నవనాడులు పీకి నట్లయింది. గొంతు పిసికిన కోడి పిల్లోలిగ గిజగిజ లాడిండు.

కొడుకు గుండె బలిగినట్లయి తిరుగుతుంటె తాతకు మనాది బట్టుకుంది. కాలం కడుపు మీద తన్నింది. కంట్లె నీల్లూరుతున్నయ్. ఇంట్ల కంచాలు పెరిగినయ్. సంసారం కంపలబడ్డది. కంటి మీద కునుకు కరువైంది.

మూల్గేనక్క మీద తాటి పండొలిగ భూతన్కోల్లు యింటి మీద బడ్డరు.

'యెవనయ్య సొమ్మనుకుండ్రు. రొండేండ్ల సంది అసలు లేదు. మిత్తిలేదు. ఎన్నిసార్లు చెప్పినా కబర్లేదు. తమాషా చేస్తుండ్రా? తట్టి చెంబులు బజాట్ల యేస్త' మన్నరు.

తాత కాళ్ళ యేల్లా పడి బతిలాడినా 'కాదు కక్కసం' అన్నరు, ఇంట్ల యిజ్జతు బజాట్ల యేసిండ్రు. 'ఆర్నెల్లల్ల అప్పు కట్టకపోతే నిలబెట్టి అమ్ముత'మన్నరు.

భూతన్క అప్పు తిస్కున్నందుకు మొదటిసారి తాత తల బాదుకుండు. చేతులు కాలినంక ఆకులు పట్టుకుని యేం లాభం? రోట్లె తల్కాయబెట్టి రోకలిపోటుకు భయపడేదేందని గుండె దిటవు చేసుకుండు.

రాజాలు మాత్రం తట్టుకోలేక పోతుండు. తనోటి తలిస్తే కాలమోటి తలిసె అని తలపట్టుకొని కూసుండు. తిండి తిప్పల్లేదు. కంటి మీద కునుకులేదు. గుండె ధైర్యం జెడ్డది. తోవ తప్పింది. గుబులు పట్టినట్లయి యింత సుక్కేసుకుంటె నన్న కునుకు బడ్తదని సుక్కకు అలవాటైండు. మంచాన్ని కర్సుకొని పండుకుంటుండు.

కొడుకును సూసిన తాతకు ఫికరు బడ్డది. తనలో తానే పిసక్క సస్తుండు. ఇరుసు యిరిగి బండి కూలబడి నట్లయ్యేసరికి తట్టుకోలేకపోయిండు. 'ఫట్'మని నడిజాము కాడ గుండాగి తన బాకీ తీర్సుకొని పోయిండు.

తాత వున్నప్పుడు అప్పుడప్పుడన్నా మందలించేటోడు. అట్లయితే యెట్లరా అని గుండె ధైర్యం చెప్పెటోడు. రాజాలుకు పెద్దదిక్కు లేకుంట పోయేసరికి నడూల్లెనే ఆగమ్మపక్షయ్యిండు.

రాజాలు వాలకం సూస్తున్న సత్తెమ్మత్తకు గుండె తరుక్కపోతుంది.

'పిచ్చులోనోలిగ యిట్ల జేస్తున్నవేంది? బతికుండంగనే మమ్ముల సంపుతవా? అప్పుల అప్పు యింకో బోరు యేద్దామ'ంది వూల్లె సావుకారు కాడ అప్పు పుట్టిచ్చింది.

రాజాలుకు కొద్దిగా ధైర్యం పుంజుకున్నట్లయింది. లేసి తిరగాడిండు. బోరుబండి మాట్లాడిండు. కాని అక్కడా రాజాలు కంటే దురదృష్టమే ముందుంది. బోరు యెంత లోతు యేసినా దుమ్ములేస్తుంటే చూసిన రాజాలుకు దుక్కం చిమ్ముకొచ్చింది.

సత్తెమ్మత్త మనసు చెదిరిపోయింది. అప్పు తీసుకొచ్చి బోరు బొందల బోసినట్టాయె అని బాధపడ్డది.

అల్లు యీల్లు చెప్పేసరికి పానం ఊకుండలేక సరే సూద్దాం అని యింకో బోరేపిచ్చింది. అదీ అంతే. సంసారం నడుగుల యిరిగినట్లయింది.

'సీ తల్లీ! బాయిబొంద వొదిలిపెట్టి యెటన్నబోయి బతుకుదామనుకుంటె నువు బోడ తెలివి జేస్తివి. ఇంకో బోరేద్దామని యాగరబెడ్తివి. కట్టలు కట్టలు అప్పుదెచ్చి యెవని కాష్టం మీదనో యేసి నట్టాయే!' తాగొచ్చిన రాజాలు పెండ్లాన్ని యాదర బాదర బాదిండు.

సత్తెమ్మత్త సతికిల బడ్డది. ఉన్న అప్పు మోపయ్యింది. మొగని

సూడబోతే యిట్లయ్యిందు. దిక్కుతోసక పిల్లల పట్టుకొని వొలవొల యేడ్సింది.

రాజాలు రోజురోజుకు చెయ్యిదాటి పోతుండు. పరిగదుపున్నే పొట్లం చించుతుండు. అప్పు, యవుసాయం, సంసారం... యిట్లాంటి జంజాటాలన్నీ మర్సిపోయినట్లుంది. యెప్పుడు చూసినా 'గుర్రం' మీదనే వుంటుండు.

ఓనాడు అర్ధమ్మ రేత్రి కాడ సోయితప్పిన రాజాలు యింటికొచ్చిండు. 'ఆట్... నాకు తునకలు పెట్టవా సస్తవా' అని పెండ్లం మిదికి లేసిండు.

'చీకట్ల నేనేడ సావన్రా మొదనష్టపోడా?' అని సత్తెమ్మత్త తలబాదుకుంది. 'ఆయ్... నా కెదురు ముల్లుతావె' అని గుండ్రాయి తీసుకొని మొకం మీదికి యిసిరేసిండు. అత్త మొకం సింతపండయ్యింది. పటపటమని నెత్తురు కారింది. ముందలి పండ్లు యిరిగినై. ఇదంతా గమనించే సోయిల లేని రాజాలు కసితీర బాదిండు. అత్త తట్టుకోలేక వురికి దేవుని బాయిల దునికింది. యెమ్మటి బడ్డ రాజాలుకు అది సూసే సరికి తాగింది దిగింది. లబోదిబోమని మొత్తకుంటుంటే సుట్టు పక్కలోల్లు చేరిండ్రు. ఎవరో సత్తెమ్మత్తను బైటికి తీసిండ్రు.

సుట్టుపక్కలోల్లు మీద మీద పడి రాజాలును లిట్టిండ్రు. 'లంజె కొడక మంచిగుండేటోనివి యేం మాయరోగం బుట్టిందని' దులిపిండ్రు.



'ఇల్లు కాలి వోడేడుస్తుంటె సుట్టనిప్పు కోసం యింకోడేడ్సినట్లు అది పిల్లల పెట్టుకొని కన్న శెర దీస్తుంటె తెగ తాగి దాన్ని బాదుతావ్? శెరం వున్నోనివైతె యేదో పని జేస్కోవాలె గని పీకల్దాక తాగి పెండ్లాన్ని కొడతావురా? దిగిజారిన ముండా కొడుక. తాగి బొక్క బోర్ల పంతె యెట్లయెల్లది?' జల కడిగిండ్రు.

సత్తెమ్మత్త రొండు మూడు దినాలల్ల తేరుకుంది. రాజాలు మాత్రం యేదో మనాది పెట్టుకుండు. ఎవల తోటీ మాట్లాడ్తలేడు. రొండు రోజుల్నుంచి పొట్లం జోలికి పోతలేడు.

దెబ్బలు పడ్డే పడ్డయిగని నా మొగుడు మారిండని సత్తెమ్మత్త మా సంబూర బడ్డది. అత్త సంబూరం శానాకాలం నిల్వలే. ఆ మాపే రాజాలు పొట్లంల యెండ్రిన్ పోసుకొని తెల్లారే సరిగి బిర్ర బిగిసిండు.

సత్తెమ్మత్త గుండెలు బాదుకుంది. రాజాలు మీద పడీ పడి యేడ్సింది. పిల్లల దగ్గెరికి తీస్కుని యేడ్సింది. 'ఆ మొదనష్టపు దేవుడు నాకే యిన్ని శెరలు పెట్టాల్నా?' అని శాపనార్దాలు పెట్టింది. ఏడ్సి యేడ్సి కండ్లెండినయ్. అత్త మొకం కల తప్పింది.

రాజాలుకు దినకర్మలు చేస్తుండ్రు సత్తెమ్మత్త గడ్డకట్టిన శోకసముద్రమోలిగుంది. పిల్లలు నోటమాట రాక బిక్క సచ్చిపోయిండ్రు. వొకలిద్దరు సుట్టాలు యేదో తంతు సూస్తుండ్రు.

ఇంటి ముంగల భూతన్న జీపు ఆగింది. తాతను పిల్సిండ్రు. తర్వాత రాజాలును పిల్సిండ్రు. ఇద్దరు పోయిండ్రని తెలుసుకొని 'అయినా సరే యింత దూరమెచ్చినంక యింటామెనన్న కల్సిపోదామనుకుండ్రు.

'సరే బాధ యెవలికైనా వుంటదిగని బాకీ సంగతి యేంద'న్నరు.

అత్తకు కాళ్ళకింద నేల గిర్రున తిరిగినట్లయింది.

'మన్సులు పోయినా అప్పులు బతుకుతున్నయ్. రేపు నేను సస్తె మాత్తరం నా పిల్లల్ను వొదులుతారు? ఈ అప్పు మీద మన్నుబొయ్య అంత అమ్ముక దొబ్బయినా తీర్వాలె' అనుకుంది. ఆ మాటే భూతన్నోల్లతో సెప్పింది.

సత్తెమ్మత్తకు బతుకుమీద విరక్తి పుట్టింది. కాలం మీద విరక్తి బుట్టింది. కట్టుకున్నోని మీద విరక్తి బుట్టింది. మట్టిమీద విరక్తి బుట్టింది. భూతన్నోల్లమీద అసయ్యం బుట్టింది. కాని పిల్లల మీద మాత్రం పాపురం సావలె. అడుక్కోనైనా సరే సాదుకుంట అనుకుంది.

భూమి బేరం పెట్టింది. భూతన్న అప్పుపోను మిగిలిన రొక్కం సావుకారికి చెల్లగట్టింది. కట్టు గుడ్డలతోని రెక్కలు తెగిన పక్షోలిగ కదిలింది.

✦✦✦

'ఇంకో బజ్జేసుకో నాయినా' అత్త మాటకు తేరుకున్న.

అత్త యెంతగనంగ మారిపోయింది? ఎట్ల దెర్వు చెడ్డది?

'కట్టుకున్నోడు పోయినా కన్నపిల్లలుండ్రుగా నాయినా! ఆల్లను తల్లిలేని పిల్లల సేయలేనుగా? నల్లగొండ కొచ్చినంక తావు కోసమే శానా తంటాలు పడ్డ. అలవాటులేని పానమైనా అడ్డమీద కూలికిపోయిన. తట్ట పట్టుకొని పని సేస్తుంటే పానం తల్లడిల్లింది. సిమిటీ పనికి చేతులు సీము బుడ్డలైనయ్. అయినా పిల్లలు కండ్లముంగల కనబడుతుంటె పండ్ల బిగువున దిగమింగిన. రొండు మూడేండ్లు సేసే సరికి వొల్లు సొక్కినట్లయింది. పానం శాతగాకుంట అయ్యింది. అడ్డమీదికి పోవుడు బందుబెట్టి యిగో యీ బండి బెట్టిన' చెపుతున్న అత్తకంట్ల పటపటమని నీల్లు దునికినయ్.

అత్త బాధలు యింటున్న నాకు తెల్వకుంటనే కండ్లు తడిబారినై.

'మిరప కాయ కొరికినవా నాయినా' నీల్లు అందిచ్చింది.

అదే పనితనం. ఇంకా మంచి తనం. కాని రూపే అరవైయ్యేండ్లు మీద బడ్డట్లుంది. భూమండలాన్ని మోస్తున్నట్లుంది.

'ఉంచు అత్తా' వో యాభైనోటు సేతుల బెట్టిన.

'వొద్దయ్యా! నీకంత కియ్యాలనిపిస్తే బజ్జీల మందమియ్యి. కాలం ముంచినా కష్టాన్ని నమ్ముకున్న. దేవుడు రెక్కలిచ్చిండు. నీ సొమ్మెందుకు నాయినా? మనిషి యాదికుంటె సాలు'.

మనసంతా దిగులుతో 'వొస్తా అత్తా' అని రోడ్డు దాటుదామనే సరికి కేకలు పెడబొబ్బలతో టాక్టరొస్తుంది.

'గుట్టకింద గూడెం రైతు అప్పులు తెచ్చి బోర్లేసిండు. అప్పులోల్లు మీద బడేసరికి వొశం కాక పానం తీసుకుండు. పీనిగను పొద్దున పంచనామాకని గొల్లగూడెం దవకానకు తీసుకొచ్చిండ్రు. రైతు యెందుకు సస్తడో పానం వుండంగ తెల్వని సంగతులు పీనిగనుకోస్తే యేం కనబడ్తయో?' ఎవరో రైతు 'యేమైందని' అడిగిన పక్కాయనతో అంటుండు.

కండ్లల్ల అత్త మెదులుతుంటే కాల్లు బస్టాండ్ దిక్కు కదిలినయ్.

మెడలో ఉరితాడునుచూసి మొసలి కన్నీరు కార్చే హెల్ప్‌లైన్లకు రెక్కలు నమ్ముకుని యెగిరిపోయిన అత్త అడ్రసు వోటరు లిస్టుల తప్ప యాడకనబడ్తది?

ఎన్ని సర్కార్ల వరాల జల్లులకు అత్త బతుకు అవురోస్తది?

# తెలుగు కథానిక - జానపద కళలు

**జా**నపద కళలు తెలుగు సంస్కృతి నిలయాలు. మట్టిలో మాణిక్యాలు. కులాశ్రయాలు. వారసత్వ కళానిధులు. జానపదులకు వినోదాత్మకాలు. విజ్ఞాన ప్రదాతలు. పల్లెపల్లెనా వీధివీధినా ప్రదర్శింప బడిన కళలు. ఇంటింటా సంభావనలు పుచ్చుకున్న కళలు. పల్లీయుల ఆదరణలో కళకళ లాడిన జానపద కళలు. నేటి సామాజిక పరిస్థితుల్లో సంక్షోభంలో పడ్డాయి. వెలవెలపో తున్నాయి. కళాకారులు దిక్కులేని పక్షాలవు తున్నారు. పొట్టకూటి కోసం అలమటిస్తున్నారు.



ఆచార్య యం. విజయలక్ష్మి

ప్రపంచీకరణ నేపథ్యంలో, ప్రసార మాధ్యమాల దాటికి జానపద కళల రీవి కొడిగట్టింది. ఫలితంగా జానపదకళలు తూర్పు గాలికి కొట్టుకుపోతున్నాయి.

సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్న జానపద కళల సంరక్షణ సంస్కృతి పరి రక్షణలో భాగం. ఒక సామాజిక సమస్య.

రచయిత సామాజికుడు. సమాజ పరిశీలకుడు. విశ్లేషకుడు. క్రాంతదర్శి. సమాజంలో మారు మూల ప్రాంతాల చీకటి కోణాల్లోంచి ముడి సరుకు ఎన్నుకొంటున్నాడు. సామాజిక స్పృహతో రచనలు సాగిస్తున్నాడు. స్త్రీ, దళిత, మైనారిటీల సమస్యలపట్ల అనుభూతి లేదా సహానుభూతి పొందారు. అక్షరీకరించారు. చైతన్య స్ఫూర్తి రగిలించారు. ప్రాంతీయ సమస్యలపట్ల, మానవతా సంబంధాలు, మానవతా విలువలకు పలుపాట్లు, కల్పిస్తున్న ప్రపంచీకరణ పట్ల స్పందించారు.

అయితే జానపద కళల స్థితిగతుల పట్ల రచయితల స్పందన అంతగా లేదు. వేనవేల కథానికల్లో జానపద కళల స్థితిగతులను స్పృశించిన కథలు వేళ్ల మీద లెక్క పెట్టగలిగినన్నే. ఒకటి రెండూ తప్పిస్తే తక్కినవి దళిత స్పృహ నేపథ్యంలో వెలువడినవే. జానపద కళలు, కళాకారుల సమస్యలను చిత్రీకరించిన పుడిసెడు కథల్ని పరిశీలిస్తే ప్రధానంగా కళాకారులను పట్టి కుదుపుతున్న పేదరికం, పొట్టనింపని ప్రదర్శనలు, ప్రసార మాధ్యమాలు ధాటికి కొట్టుమిట్టాడుతున్న కళలు. అగ్రకులాల ఆధిపత్యంలో అణిచివేత, ఆధిపత్యంలో ఎదురవుతున్న అవమానాలు, పొట్ట కూటి కోసం కళాకారులు పడుతున్న కష్టాలు కడగండ్లు. అటకెక్కుతున్న వాయిద్యాలు, మూగపోతున్న గొంతులు. మారు రూపు పొందుతున్న కళారూపాలు. పదునెక్కుతున్న పాటలు, కళ్ళకు కడ్తాయి.

ప్రసార మాధ్యమాలు జానపద కళల అస్థిత్వాన్ని ప్రశ్నార్థకం చేస్తున్నాయి. జానపదకళలపై ప్రసార మాధ్యమాల ప్రభావం, అభంశుభం ఎరుగని వారిపై పడుతున్న విష సంస్కృతి ప్రభావాన్ని కళ్ళ ముందుంచిన కథలు 'ఏటి పాట, 'విధ్వంసం', 'రంగు రంగుల చీకట్లోకి'.



కాలం తెచ్చిన మార్పుతో, జానపద వాయిద్యాలు అటకకెక్కింది. పాట సంగం కార్యకలాపాలను ఆటపట్టింది. అగ్రవర్ణాల ఆధిపత్యంలో నలిగిన దళిత జానపద కళాకారుని విషాదాంత జీవితం గంటేడు గౌరు నాయుడు "ఏటిపాట".

పైడయ్య జముకు కథకుడు. సన్నని రాగం. రాగానికి తగ్గ అభినయం అతని సొత్తు. ఊరూరు తిరిగే పాటకుడు, పైడయ్య పాటకు ఆకర్షితురాలయ్యింది. నాయుడోళ్ళ కోడలు. బిడ్డ తల్లి సూరమ్మ. పాటకుడుతో జత కట్టింది. అంటరానివాని వెంట వెళ్ళిందని అమ్మలక్కలు ఆడిపోసారు.

కాలం మార్పులు తెచ్చింది "జముకు మూలబెట్టీ పోవలసిందే నా పాట పాతబడిపోయింది. గడపకి గంట నిలబడి పాడినా ఏయమ్మా సేరడు బియ్యం ఎయ్యదు. అదిగా టీవి, రేడియో, సినిమాలు వచ్చి నా పొట్ట కొట్టేసినాయి" అని దిగులు పడ్డాడు. ఇంటి వాసానికి వేలాడే దుమ్ము కొట్టుకుపోయిన జముకును చూసి సూరమ్మ గుండెలవిసిపోయేది.

సంగంలో చేరి పాటలు పాడాడు. భుక్తి కోసం నాయుడు బాబు దగ్గర రైతరకం చేశాడు. సంగం ప్రభావంతో నాయుడు పొలాలు దున్నారు. నాయుడు మనుషులకు, గిరిజనులకు పోరు జరిగింది. పోలీసులొచ్చారు. పట్టుకెళ్ళారు. విడుదలైన పైడయ్య ఇంటికి తిరిగి రాలేదు. సూరమ్మను 'పువ్వునాగా' చూసుకున్న పైడయ్య నాయుడు మనుషుల చేతుల్లో ఏటి ఒడ్డున శవమయ్యాడు.



ప్రపంచీకరణ, ప్రసార మాధ్యమాల ప్రాచుర్యం వల్ల పొట్టకూటికి లోటు చెయ్యని 'దొమ్మరాట' ఆదరణ కోల్పోయి, నిరాశ నిస్పృహాలతో ఆటకే చరమ గీతం పాడాలనుకున్న వైనాన్ని జాతశ్రీ 'విధ్వంసం'లో చిత్రించారు.

గురవ్వ పోశాలు భార్యాభర్తలు. కూతురు పోలి కొడుకు కొండాలు వారి వృత్తి, జీవన భృతికి ఆధారం దొమ్మరాట. వారి ఆటకు చేదోడు వాదోడు కోతి, పాము, ముంగిస సంచారంలో 'గాడిద బరువు' మోసే గాడిద.

పోశాలు చిన్నతనంలో 'దొమ్మరోడొస్తే - ఊర్లల్ల పోటీలు పడి ఎవురింటి ముంగిట వాళ్ళు ఆళ్ళు బెట్టిచ్చోటుళ్ళుగా దూదొర మారాజులు సల్లగుండ, ఆటకు రెండు కుండల గింజలూ, పూటకు సరిపడా బువ్వా పెట్టొటూళ్లు, ఉన్న సాములయితే, పాతకోకలూ, మియ్యకి పంచెలూ దానం జేసేటూళ్ళు..."

మరి ఇప్పుడు నడివీధిలో నకనకలాడే కడుపుల్తో రండిబాబూ... రండి బాబూ అంటూ అరచిగీపెట్టినా, డోలు పగిలేలా వాయించినా పట్టించుకొనే నాధుడు లేడు. చూసే పిల్లపిట్ట లేరు. కరువు కాటకాలు తమ కూటిని కాటేశాయని కలవరపడ్తున్న పోశాలుకు..." పంటల్లేక తిండికి కరువొచ్చిందేమోగాని

టి.వి.లకు గిరాకితగ్గలె. అన్న పెద్ద మనిషి మాటతో తలదిమ్మదిరిగి బొమ్మలాటాడింది. "బువ్వలేని ఆటాడే బదులు అడివిల దిరిగి పసిరిగాయలేరుకున్నా మారాజుల్లా, బతుకుతం' అని నిర్ణయించుకున్నారు వారసులు పోలి కొండాలు.



తరాల అంతరాలు – సాహిత్యం పట్ల సినిమాల పట్ల ఇష్టాఇష్టాలు తెల్పుతూ ప్రసార మాధ్యమాల వెదజల్లుతున్న విష సంస్కృతీ ఫలితాలను కళ్ళ ముందుంచారు. 'రంగురంగుల చీకట్లో – గంటేదు గౌరు నాయుడు.

శాంతమ్మ గాత్ర మాధుర్యానికి ఊరంతా గడపలో గుమిగూడి పాటలో లీనమైపోతారు. కూతురు పద్మకు మాత్రం అవి ముసిలోల పాటలు. సినిమా పాటలంటే చెవి కోసుకుంటుంది. బూతు సాహిత్యం, బూతు సినిమాలు ఆమె ప్రపంచం. శాంతమ్మకు మాత్రం అవి "ఏం సినిమాలో ఏం పిల్లలో... వినాయక చవితి వచ్చినా... గౌరీ పున్నమి వచ్చినా... కార్తీక ఏకాదశి వచ్చినా... జాలారి బాగోతమె... గంగా వివాహమో హరిశ్చంద్ర నాటకమో, బాలనాగమ్మ బుర్రకథో... పాడిఁ.చీవోలు. ఈధిలో పందిరేత్తే ఒకటే సందడి... పిల్లల్నుంచి ముసిలోలందరికి అదొక సంబరం.... జముకులు పాట పాడించుకుంటే తెల్లగ తెల్లారిపోయింది.... ఇప్పుడవేవి... వీడియో సినిమాలట నేపోతే రికార్డింగు డాన్సులు, మిగతా సినిమాకి ఎల్తే మొదుల్నుంచి కొనదాక గుడ్డలిప్పుకొని గెంతడాలు. అది పాటో దెబ్బలాటో యేటో తెలీదు.... యింత పిసరు కతేటో తెలీదు. పైటింగులట... పైటింగులు... రత్తాపోరు.... సినిమానిండా..."

ఒక రోజు సినిమా కెళ్ళిన పద్మ తిరిగి రాలేదు. ఉన్మాదిగా మారింది శాంతమ్మ "ఒరే బద్దలు గొట్టండరా.. మీ టీవీలు బద్దలు కొట్టండి. ఒంటి మీద గుడ్డల్లేకుంట వేసిన డేన్సులు రాకుంట మీ టీవీలు బద్దలు కొట్టండి. అదా... బూతుకతల బొమ్మల పుస్తకాల్ని తగలబెట్టండ్రా... తగలబెట్టండి. ఒరే.... నా మాట యినకపోతే ఘోరం జరిగిపోద్దిర్రా మీ పిల్లలు మీకు కాకుండా పోతారొరే... అని వీధి వీధి తిరుగుతుంది.



అగ్రవర్ణాల ఆధిపత్యం, దోపిడి, ఆచారాల పేరుతో, అడుగడుగునా ఎదురవుతున్న అవమానాల మధ్య నలిగిపోతున్న కళాకారుల,



మానసిక క్షోభ, దయనీయ స్థితి 'హోమం', 'నాదస్వరం', 'వీరజాటి' కథలు ప్రతిబింబి స్తున్నాయి.

అగ్రవర్ణాల ఆధిపత్యంలో అంటరాని వారుగా అవమానాలు పొందేకంటే, కులాలను గుర్తుకు తెచ్చే వాద్యాలనే విడనాడి, అగ్రవర్ణాల ఆధిపత్యాన్ని సవాలు చేసిన కథ వి.ఆర్. రాసాని 'హోమం'

తరతరాలుగా మిట్టూరు రైతులకు చెప్పులు, కపిలబానలు కుట్టిచ్చి, ఊడిగం చేసి ఎదుగూబొదుగూ లేకుండా జీవించే జనం వాళ్ళు. ఊరందరికీ బావిలో నీరు అందుబాటులో ఉన్నా వారికి అందనివి. ఊరి చెరువే ప్రాణాధారం. చెరువు కొల్లబోతే (ఒక్కుమ్మడిగా చెరువులో దిగి చేపలు పట్టడం) తీరని దాహం వారిది. చేపలు పట్టుకోవాలన్న అగ్రవర్ణాల వారు పట్టుకున్న మూడు దినాలకు వీరికి అనుమతి. అది ఆచారం. దళిత ప్రతినిధి సిన్నాయుడు. నీటి సమస్య కోసం పంచాయితీలో స్థానం కల్పించుకున్నా, ఫలితం సున్నా. అదే అక్కసు సర్పంచ్ కొండ్రెడ్డికి.

అందుకే రెండు నెలలకు సరిపడా నీళ్ళుండగానే గ్రామస్థులకు చేపలు పట్టడానికి అనుమతిచ్చాడు. కూడబలుకున్న దళితులు తామూ చేపలు పట్టుకుంటామన్నారు. అగ్రవర్ణాలు అంగీకరించలేదు. మాటమాట పడింది. చిలికి చిలికి గాలివానయింది. 'అంటరానివారని' పెద్దింటి నా కొడుకుల'నీ దూషించారు. మేము కాదంటే సావులకీ... సభలకీ కొమ్ములూదీ, పలకలు కొట్టి బతకాల్సిందేరా అని హూంకరించారు. పనులకు రానీయకూడదని నిర్ణయించుకొన్నారు.

అదే సమయంలో దహన సంస్కారాలకు డప్పులు, కొమ్ములు కావాలని పిలుపొచ్చింది.

తామంటే ఏమిటో తెలియ చెప్పాలనుకున్నారు దళితులు, కులాలను గుర్తుకు తెచ్చే వాద్యాలనే వదిలేయాలనుకున్నారు.



పలకలు, డముకులు, కొమ్ములు మంటలకు ఆహుతి చేశారు. 'వాద్య హోమం' నిర్వహించారు.

సమాజంలో మహావిద్వాంసునికైనా కులం ప్రాతిపదికన గౌరవాదరణ లభిస్తాయని తెలుసుకొని, అగ్రకులాల అవమానాలు భరించలేక సంగీతానికి స్వస్తి చెప్పి, జీవన భృతికి కులవృత్తి నాశ్రయించిన 'మహావిద్వాంసుని' జీవన చిత్రాన్ని ఆవిష్కరించారు తుమ్మల రామకృష్ణ.

సాంబయ్య కొడుకు కన్నదాసు. తనకులాగే గడపల్లో, గడీల్లో నాదస్వరం వాయిస్తూ, అవమానాలు పొందుతూ, ఎదుగుబొదుగూ లేని జీవితం తన కొడుక్కు ఉండకూడదనుకొన్నాడు.

కన్నదాసుది గంధర్వ గాత్రం. శేషశాస్త్రి ప్రేరణతో కొడుక్కి శాస్త్రీయ సంగీతం అభ్యసింపచేశాడు. కన్నదాసు మహావిద్వాంసు డయ్యాడు. కచేరీలలో ప్రశంసల జల్లులు కురిసాయి. అప్పుడే ఆరా తీరా తీసారు. కన్నదాసు పూర్వాపరాలు, అపచారం జరిగిందని వాపోయారు. మాటల్లో చేతల్లో తేడా చూపించారు. సంగీత ఆరాధనోత్సవాల్లో పాల్గొన్న కన్నదాసుకు చేదు అనుభవం ఎదురైంది. సంగీతానికి కులం, మతం ఉన్నాయని తల్లడిల్లాడు. బొందిలో ప్రాణముండగా పాట పాడకూడదనుకున్నాడు. సంవత్సరాలు గడిచాయి. శేషశాస్త్రి మరణించిన రోజు "మహా విద్వాంసుడు" మనిషి ముందు బతకాలి కదా' అనుకొని బతుకుదెరువు కోసం.

"అవమానాలకు ఆనవాలుగా మిగిలిన నాదస్వరం. వెక్కిరింతలా గూటాన వేలాడుతున్న నాదస్వరం. సప్తస్వరాలను సరళీ వరసలుగా, జంట స్వరాలుగా, దాటు స్వరాలుగా, గీతాలుగా, వర్ణాలుగా, కీర్తనలుగా, సంకీర్తనలుగా... రాగాలుగా.... పల్లవులుగా... ఇంకా ఎన్నో రకాలుగా పలికే... ఒలికే... పలవరించే నాదస్వరం పట్టుకున్నాడు.



సంచార జీవనాన్ని బిక్షుక వృత్తినీ వదిలి, స్థిర నివాసమేర్పరచుకోవాలని కలలుకన్న వృత్తి కళాకారుని జీవితం దోపిడీదారు చేతిలో కకావికలమయిన రీతి కళ్ళ ముందుంచారు. 'వీరజాటి' కథలో వి.ఆర్. రాసాని.

పల్లెలో ఇల్లిల్లూ తిరిగి ధనం, ధాన్యం సేకరించుకోవడం కోటప్ప వృత్తి ఒక రెట్టకు తాయెత్తు ఒక రేట్టకు రాగి కడియం, నొసట కుంకుమ బొట్టు, కాళ్ళకు గజ్జలు, నడుముకు పాత లంగా, చుట్టూ వేలాడేటట్లు పాత చీర

పేలికలు, మెడ చుట్టూ పాతపైట, భుజాన వీరజాటీ, చంకకు వేలాడుతూ డప్పు, చేతిలో చిటికెన పుల్లలు – నెత్తిన గంగమ్మ – ఇది వేషధారణ.

నడేదిలో గంగమ్మను దించి డప్పుకొడుతూ డప్పు దరువుకు అనుకూలంగా అడుగులేస్తుంటే, ప్రజలు నోళ్ళు వెళ్ళ బెట్టుకునే వాళ్ళు. అంతే కాదు వీరజాటితో శరీరానికి దెబ్బ తగలకుండా ఎంతసేపైనా కొట్టుకోవడంలో కోటప్ప సిద్ధహస్తుడు.

అయితే ప్రతి సంవత్సరం వచ్చే కరువు కాటకాలవల్ల, ప్రజల్లో నాగరికత ముదరడంవల్ల, గంగమ్మ పట్ల ఆదరణ కొరవడిపోయింది. భుక్తికి కరువైంది. ఇలాంటి పరిస్థితుల్లో అడవి మొగదల ఇంటిల్లిపాదీ శ్రమించి, పోడు కొట్టి రెండెకరాలు సాగు చేశాడు. అవసరమైన ఐదు వందలకు అడిగిన చోటల్లా వేలిముద్ర వేసి, వీరమనాయుడు వద్ద అప్పు చేశాడు. అదే కొంప ముంచింది. కోటప్ప పొలంలో నాయుడి పసులు పడటంతో మొదలైన గొడవ చిలికి చిలికి గాలివానయ్యింది.

ఆ గోసిపాతరాయుడిగాన్ని తిరిగి నెత్తిన గంగమ్మ పెట్టుకొని ఊరూరు తిరిగేటట్లు చేస్తాను. అట్ట చేయకపోతే నా పేరు తీసి వాడి పేరు పెట్టుకుంటాను...” అని అన్నంత పనీ చేశాడు. ఉన్నపళంగా అప్పు కట్టమని పీక మీద కూర్చొని పంట చేను స్వాధీనం చేసుకున్నాడు.

కోటప్పకు మిగిలింది నిరాశ అవమానం.

ఈ గడ్డపైన నాలోంటోడు కాసింత మడి చెక్క కాసింత పేనుగుడ్డ మోపెట్టుకొని బతికే దానికేలా... యెల్ల కాలమూ ఈ మాదిరిగా దేశంపైన తిరగతా ఉండాల్సిందేనా? వొగరు పోసే దానికి సెయొగ్గి, తిక్కలోళ్ళ మాదిర్తో బతకాల్సిందేనా! ఇట్టా ఎంత కాలం? మాలాంటోళ్ళ బతుకులు మారవా – ఈ ప్రశ్నకు జవాబే లభించలేదు కోటప్పకు. కథ మొదటి కొచ్చింది. నెత్తిపైకి గంగమ్మొచ్చింది. పగ, ద్వేషం, కసి కోటప్పకు గంగ వెర్రులెత్తించింది. అడిగిన చోటల్లా వేలిముద్ర లేసినందుకు ప్రాయశ్చిత్తంగా నైపుణ్యమేమైందో శరీరమంతా వాతలు తేలి రక్తం కమ్ముకొచ్చేలా కొట్టుకున్నాడు. హర్షధ్వానాలు కాసులు ధాన్యం కుప్పలు – కుప్పల తెప్పల కానుకల మధ్య కుప్పకూలిపోయాడు.

✦✦✦

ఆధునిక సమాజంలో ప్రజాకళలు, ప్రజాచైతన్యానికి ప్రభుత్వ పథకాల ప్రచారానికి



దోహదపడుతున్నాయి.

అమాయకులైన గూడెం ప్రజల గుండెల్లో చోటు చేసుకొని కంజీర పాటతో చైతన్యాన్ని రగిల్చి, దోపిడీ దారుని ఆటకట్టించి, అంతమయిన చంద్రన్న కథ గంటేడు గౌరు నాయుడి గారి ‘రాగాల చెట్టు’.

గూడెంలో డప్పు, తుడుం మోగని రాత్రి తెల్లవారదు. ధింసా నృత్యంతో దుమ్ము రేగకుండా పొద్దు గడవదు ఆ మనోహర దృశ్యాలకు ఉత్తరాలు పంచే ఉద్యోగంలో చేరిన చంద్రం కంజీర పాట తోడయ్యింది. గూడెంలో పిల్లనగ్రోవి సోదెన్న, కర్రల దరువు – సంగమేసు స్నేహ హస్తాలందించారు.

చంద్రం గూడెం మనుషులు గుండెల్లోని వాడయ్యాడు. చంద్రంపాట గిరిజనులు బతుకు బాటయ్యింది.

అమాయకులను దోచుకుంటున్న స్కూలు మాస్టారు తిరుపతయ్యకు చంద్రన్న పాట తూటాలా తగిలింది. అందుకే చంద్రన్నను గూడెం ప్రజలకు దూరం చేయాలని కంకణం కట్టుకున్నాను తిరుపతయ్య. చంద్రన్న అమాయకుల చీకటి బతుకుల్లో పాట దీపం కావాలి’ అని ఆరాటపడ్డాడు.

తరతరాల దోపిడీపై తిరుగుబాటుకు గిరిజనులను పురికొల్పాడు. ఫలితంగా దెబ్బలు తిన్నాడు. పాట మరింత పదునెక్కింది. పోలీసులకు పట్టించారు. గూడెం గూడెం కదిలి విడిపించుకొచ్చింది. పాటలకు కొత్త చిగుళ్ళు తొడిగేడు. ఎర్రర్రగా చంద్రన్న ఆఖరుకు చంద్రం శవం కూడా దొరక్కుండా చేసింది దోపిడి వర్గం.

తిరుపతయ్య మరదలు సిరిమెల పద్దెనిమిదేళ్ళ వితంతువు. సిరిమెల, చంద్రన్న కలిసిన మనసుల ఫలితంగా కడుపుతో మిగిలింది. సిరిమెల సెంద్రన్నాల పిల్లాడికి పాలు కాదు. పాటలు పోసి పెంచుతామని అన్నాడు సరిమెల నాటిన ‘రాగాల చెట్టు’ను (సరుగుడు) కౌగిలించుకొని సోదెన్న.

✦✦✦

వ్యసనాలకు, బానిసయిన పేద కళాకారుని దిగజారిన బతుకును, కడకు కడతేరిన దుస్థితిని చిత్రించిన కథ ఎండ్లూరి సుధాకర్ ‘రెప్పల మీన రూపాలు’

యాకోబుది రాది గుంట పల్లె – పలకవాయిచ్చే దాన్నో పదూల్ల మీనపై జెయ్యి యాకోబుది. డప్పుతో దరువేస్తా వుంటే భార్య చిందులేసేది. యాకోబు కొడుకు గురయ్యకు తన విద్యతోపాటు తాగుడు వ్యసనాన్ని వారసత్వంగా ఇచ్చాడు. ‘డప్పాట’లో గురయ్య తండ్రిమించిన కొడుకు అంతే కాదు “మట్టి మీన బడ్డ పచ్చనోటుని డప్పుగోడతానే తలకామొంచి నుదురుకి అంటిచ్చుకున్నక అట్టనే జాగర్తగ పైకి లేచి నుదురు మిన్నుంచి రెప్పల మీనకి పచ్చ కాగితాన్ని కళ్లజోడు మాదిరి మెక్కిచ్చుకున్నాడు. అట్టనే రెప్పలకాన్నుంచి మీసాల కాడకి దెచ్చి నాలికతో పచ్చనోటు మునిపంటితో కరిసి పట్టుకున్నాడు. యిదంతా దరువు ఆపకుండానే జేస్తా వుండాడు”

వయసుతోబాటు వ్యసనం గురయ్యను లొంగదీసుకుంది. ఒంట్లో ఓపిక నశించింది. ఆరోగ్యం పాడయింది.

వ్యసనం పిల్లలు చూపించే రూపాయి రెండ్రూపాయలకు ఆటాడే స్థితికి దిగజార్చింది. రెప్పలెత్తి నోటు అందుకునే ప్రయత్నంలోనే గురయ్య రెప్పలు శాశ్వతంగా మూతబడినాయి. ఆ కళ ఆపాయ కట్టులో అతనితోనే అంత మయ్యింది.

✦✦✦

జానపద కళల పట్ల, జానపద కళాకారుల జీవితాల పట్ల కథా రచయితలు స్పందించిన అంశాలు.

జానపద ప్రదర్శన కళలు – దొమ్మరాట, డప్పాట, వీరజాటి

జానపద సంగీతం – జముకు పాట, కంజీరపాట, నాదస్వరం

- జానపద కళ సంక్షోభాలు, సంక్లిష్టతల మధ్య కొట్టుమిట్టాడుతోంది.
- జానపద కళాకారులు పేదరికంలో మగ్గుతున్నారు.
- జానపద కళలు ప్రపంచీకరణ ప్రసార మాధ్యమాల్లో ప్రభావం వల్ల కనుమరుగవు తున్నారు. ఆదరణ కోల్పోతున్నాయి.
- జానపద కళా రూపాలు సంగం ప్రచార కార్యక్రమాలకు, జనచైతన్యానికి ఉపయోగపడుతున్నాయి.
- ప్రజాచైతన్యం, సామాజిక ప్రయోజనం కోసం జానపదకళలు వినియోగ పడ్తున్నాయి.
- కులం పేరుతో జరిగే అవమానాలను,



# నవ వసంతం కోసం

డా. కట్టా సత్యప్రసాద్

విధ్వంసపు నిప్పులు చెరగుతూ
ఉప్పెనలా
విజృంభిస్తున్న
పడమటి గాలి

ఒకటొకటే
ఒక్కుమ్మడిగా
నేల రాలుతున్న
ఆకుల అలజడి

యుద్ధంలో బిడ్డల్ని
కోల్పోతున్న తల్లిలా
చెదరని విశ్వాసంతో
నిలబడిన చెట్టు

రాలే ఆకుల్ని చూసి
ఎగతాళిగా నవ్వే
'సెనిసెన్సు'ను సెన్సు చేయలేని
పిల్లకాకులు

రాలిన ఆకుల్ని రంగరించి
రక్తం శక్తుల్ని కూడగట్టి
నిశ్శబ్దంగా
పుడమి ఒడిలో
నిరంతర ప్రసవ వేదనతో
నవ వసంతం కోసం
క్రొత్త చివుర్లకు
ఊపిరి పోస్తున్న తల్లి... చెట్టు.

---



# ఓ అద్భుత వర్ణ చిత్రం

వల్లభాపురం జనార్దన్

మట్టి పొరలలో దాగిన
ఖనిజ లవణాలను తిని
మట్టిలో దాగిన నీటిని తాగి
చెట్లుగా జీవం పోసుకున్న అడవి
ఓ అద్భుత వర్ణ చిత్రం
భూమిపై ప్రకృతి వేసిన రంగవల్లి
అవసరాలు తీర్చే ఊట చెలమ.
చెట్ల చేతులతో ఆకాశాన్ని ముద్దుపెట్టుకొని
అది అందించే జీవరసంతో విస్తరిస్తుంది
పండు వారి రాలే ఆకు
లాలిత్యం నింపుకున్న చిగురాకు
పచ్చదనం పోసుకున్న పత్రం
సారాన్ని కుప్పవోసుకున్న ఫలాలు
జీవన మహా ప్రస్థానానికిచ్చే ఇంధనాలు
వృక్షాలు - పురుగులు - పక్షులు - జంతువులు
మనుషులు
ఒక జీవన చక్రం
ఒక దాని నుంచి ఒకటి
అయస్కాంతత్వం పెంచుకుంటాయి.
సూర్యశక్తిని టానిక్‌గా తాగుతాయి
బదలాయించుకుంటాయి
కిరణజన్యసంయోగ క్రియతో
క్రియాశీలం చేస్తుంది అడవి
అడవికీ మనిషికీ ఉన్న అనుబంధం అద్భుతం
సంఘటిత బంధం
సౌందర్య బంధం
అడవి ఆటను నేర్పింది
పాటను నేర్పింది
వేటను నేర్పింది
వ్యూహాలను నేర్పింది
వ్యవసాయాన్ని నేర్పింది
నాగరికతను నేర్పింది
అడవి ఓ అద్భుత వర్ణచిత్రం
అది అదృశ్యమైతే అంతా అదృశ్యమే

---

భరించలేక, అరకొర ఆదాయంతో బతుకులీడ్చలేక, చైతన్యం పొందిన కళాకారులు కులవృత్తులను, జానపద కళలను వదలివేస్తున్నారు.

- ✦ శాస్త్రీయ సంగీత గుప్పిట్లో ఉన్న అగ్రవర్ణం, ఆ రంగంలో ఇతర కులాల ప్రావీణ్యాన్ని అంగీకరించటం లేదు.
- ✦ దుర్వసనాలు, కళాకారుల జీవితాలను బలిగొంటున్నాయి.

జానపద కళలు వస్తువుగా వెలువడిన కథల్లో 'ఏటిపాట' 1992 మొదటిది కావచ్చు. ఇప్పటి వరకు వెలువడిన కథా సాహిత్యాన్ని కాగడా వేసి వెదికినా జానపద కళల స్థితిగతులను వస్తువుగా స్వీకరించిన కథలు పది, పదిహేనుకు మించవు.

సాహిత్యానికి సమాజాన్ని ప్రభావితం చేయగల శక్తి వుంది. యువతరం కథకులకంటే పెద్దతరం కథకులకు జానపద కళల ప్రదర్శనలు, స్థితిగతులు మారుతున్న కళారూపాలు కరతలామీలకం. ఎట్టొచ్చీ ఆ వైపు దృష్టి సారించడమే కావల్సింది.

ఈ సందర్భంలో స్వాతంత్ర్యోద్యమ కాలంలో, ఆంధ్రోద్యమ కాలంలోనూ సాహిత్యం ప్రజలను ప్రభావితం చేసిన తీరును. మననం చేసుకోవాల్సి ఉంది. రచయితలు వివిధ సామాజిక సమస్యలపట్ల స్పందించినట్టే వివిధ ప్రక్రియల్లో జానపద కళల పరిరక్షణావశ్యకతను చాటి, జానపద కళాకారుల స్థితిగతుల పట్ల సహానుభూతిని ప్రదర్శించాల్సిన అవసరం ఉంది.

గ్రామీణ వాతావరణం నుంచి కథనరంగంలో కాలూనిన కథకులు జానపద కళాకారుల జీవిత మూలాల్లోకి వెళ్ళి కలాన్ని కదపాలి. ప్రాంతీయ సంస్కృతికి ప్రతినిధులైన కళారూపాన్ని అక్షరబద్ధం చేయాలి.

జానపద కళల మనుగడకు, పరంపర కొనసాగడానికి పరిష్కార మార్గాలు సూచించాలి. జానపద కళాకారులకు అండగా నిలవాలి. **(తానా 3వ తెలుగు జానపద కళోత్సవాలు, 2004లో డిశంబర్ 22, 23 సమర్పించిన వ్యాసం)**

❖

# సృజనకు, విమర్శకు ప్రమాణం జీవితమే

సాహితీ స్రవంతి, సుందరయ్య విజ్ఞాన కేంద్రం సంయుక్తంగా నిర్వహించిన రెండు రోజుల సాహిత్యశాలలో 27 వ తేదీ ఉదయం కేతు విశ్వనాథరెడ్డి అధ్యక్షతన భాషపై సెషన్ జరిగింది. ఆయన తన అధ్యక్షోపన్యాసంలో తెలుగు భాష పట్ల ఆధునిక దృక్పథం ఎలా రూపొందిందో వివరించారు. భాషకు ప్రమాణం జీవితమేనని అన్నారు. రచయిత తను ఏ తరగతిని ఉద్దేశించి రాస్తున్నాడో అందుకు అనుగుణమైన భాషను ఎంపిక చేసుకోవాలంటే ప్రగాఢ పరిశీలన అవసరమని చెప్పారు. పాత్రోచితమైన భాష వాడాలని, మాండలికాలలోనూ అపారమైన వైవిధ్యం వున్న సంగతి గుర్తెరగాలని సూచించారు.

భాషావేత్త చేకూరి రామారావు మాట్లాడుతూ సృజనాత్మకభాష జీవితంనుంచే వస్తుందని స్పష్టం చేశారు. సాహిత్యంలో వస్తువు రూపం రెండూ ప్రధానమేనని చెప్పారు. అయితే తనకు ముందు వస్తువుపై చాలా చర్చ జరుగుతున్నందును తాను రూపంపై కేంద్రీకరించానని వివరించారు. ఆయా దేశకాలపరిస్థితులలో సాహిత్య శిల్పం గురించి అనేక సిద్ధాంతాలు వచ్చినా అంతిమ ప్రమాణం జీవితమేనన్నారు. పత్రికలు పదసంపదను ఎంతగానో సుసంపన్నం చేశాయని తెలిపారు.

డి.చంద్రశేఖర రెడ్డి సాహిత్యం-భాష-పత్రికలు అన్న అంశంపై మాట్లాడుతూ తెలుగు పత్రికాభాష పరిణామక్రమాన్ని వివరించారు. గ్రాంధికం నుంచి వ్యవహారంవైపు దాని పయనాన్ని తెలిపారు. ఈ సందర్భంగా అది అనేక మార్పులకు లోనైందన్నారు. ఏమైనా కథకులు వాడుతున్నది ప్రధానంగా పత్రికాభాషేనని, కవిత్వంలో మాత్రం గ్రాంధిక వాసన సాపేక్షంగా ఎక్కువని తన పరిశీలనను వెల్లడించారు. నేడు పత్రికాశీర్షికలలో చమత్కారాలు బాగుంటున్నా వాటినే విపరీతంగా వాడటం వల్ల స్వారస్యం దెబ్బతింటోందన్నారు. కవిత్వంలోనూ కథలలోనూ కూడా చిత్ర కవిత్వం వంటివాటిని తక్కువ స్థాయికి చెందినవిగా పరిగణిస్తుంటే పత్రికలు శీర్షికలలో వాటికి పెద్దపీట వేయడం విచారకరమన్నారు.

## విమర్శ

మధ్యాహ్నం తెలకపల్లి రవి అధ్యక్షత వహించిన విమర్శ సెషన్‌లో ప్రొఫెసర్ కె.కె.రంగనాథాచార్యులు మాట్లాడుతూ విమర్శకు ప్రమాణం రచన తప్ప రచయిత కాదని అన్నారు. రచయిత జీవితం లేకుండా రచన లేదన్నది నిజమే అయినా రచయిత జీవితాన్ని బట్టి రచనను అంచనా కట్టడం దారితప్పిస్తుందని స్పష్టం చేశారు. విమర్శ ఎదగలేదన్న విమర్శను ప్రస్తావిస్తూ సునిశితమైన విమర్శను స్వీకరించడానికి అవసరమైన సంయమనం లోపిస్తున్నదని చెప్పారు. అర్థం కాని రచనలు వెలువడుతున్నాయని ఆరోపించేవారు రాసినవి కూడా అన్నీ అర్థం కావని సోదాహరణంగా చెప్పారు. విమర్శ అన్నప్పుడు వస్తువు రూపం వంటి విభజన లేకుండా అన్ని పార్శ్వాల నుంచి సాగుతుం దన్నారు. వివేచన, విచక్షణ, విశ్లేషణ వంటివన్నీ కలిస్తే విమర్శ అవుతుందని ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

హెచ్చార్కె మాట్లాడుతూ రచనా సృష్టిలో రచయిత సంఘర్షణను సాదక బాధకాలను దృష్టిలో పెట్టుకుని అక్కున చేర్చుకున్న చందంగా విమర్శ సాగాలన్నారు. తెలుగులో విమర్శకుల శైలి తరచూ ఇలా వుండటం లేదన్నారు. ఆధిపత్యాన్ని ప్రతిఘటించడమే అన్ని సాహిత్యాల ప్రధాన కర్తవ్యమైనపుడు ఆయా తరగతుల నుంచి వచ్చే గుర్తింపు రచనలను బేరీజు వేయడానికి ఆయా తరగతుల గురించి ప్రత్యక్ష అనుభవం అవసరమని అన్నారు. అభిరుచిని బట్టి సాగే సాహిత్య రచనకు శాసనాల చందంగా సూత్రాలు నిర్ణయించి బిగించరాదని, అదే సమయంలో ప్రాథమిక అంశాలు తెలునుకోవడం ఔత్సాహికులకు దోహదపడుతుందనే విషయంలో భిన్నాభిప్రాయం లేదని చెప్పారు.

శిఖామణి ప్రసంగిస్తూ తెలుగులో ప్రముఖ విమర్శకులను, వారి వారి ధోరణులను తెలిపారు. ఈ నాడు వివిధ రూపాలలో వస్తున్న తెలుగు సాహిత్యంపై సరైన విశ్లేషణ జరపడానికి సరికొత్త పరికరాలు అవసరమని అన్నారు. ప్రతివారూ ఒక బిందువు దగ్గర ఆగిపోతుండడంతో ఎవరి వాదాన్ని వారే సమీక్షించుకోవలసిన పరిస్థితిఏర్పడుతున్నదని అభిప్రాయం వ్యక్తం చేశారు.

సభకు అధ్యక్షత వహించిన తెలకపల్లి రవి మాట్లాడుతూ అన్ని ఆధిపత్యాలకు మూలమైన ప్రపంచీకరణను ప్రతిఘటించడమే కర్తవ్యం కీలకమనే చైతన్యంతో రచనలు, విమర్శలు కూడా సాగాలన్నారు. ఈనాడు సాహిత్యం ఈ స్థాయికి చేరడంలో విమర్శకుల దోహదాన్ని గుర్తించకతప్పదన్నారు. సాహిత్యాన్ని కెరీర్‌కు సంబంధించిన విషయంగా, వ్యక్తిగత అంశంగా పరిగణించక విశాల ప్రజా ప్రయోజనాల దృష్టితో చర్చించుకుంటూ పురోగమించాలన్నారు. అనంతరం విమర్శకు సంబంధించి వచ్చిన వివిధ ప్రశ్నలకు వక్తలు జవాబులిచ్చారు.

## ముగింపు సభ

చివరగా వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన ప్రతినిధులు సాహిత్యశాల తమకు ఎంతో ప్రయోజనకరమైన విషయాలు తెలియజెప్పిందన్నారు. ఇన్ని ప్రాంతాల నుంచి ఇంత మంది సీనియర్లు, యువత వచ్చి ఇంత ఆసక్తిగా పాల్గొనడం అరుదైన అనుభవమన్నారు. రాధిక, మాధవీలత, వెంకటయ్య, దుర్గాప్రసాద్, సత్యభాస్కర్ తదితరులు ఉత్సాహంతో తమ స్పందనలు తెలిపారు. ముగింపు సభలో జ్వాలాముఖి, సింగమనేని నారాయణ, అద్దేపల్లి, బివిస్‌రాములు తదితరులు కూడా పాల్గొన్నారు.

సాహితీ స్రవంతి కన్వీనర్ తెలకపల్లి రవి ముగింపు ప్రసంగం చేస్తూ సాహిత్యశాల ప్రసంగాలను, ప్రశ్నలు జవాబులను పుస్తక రూపంలో తెస్తామన్నారు. స్త్రీలకు సంబంధించి ఒక ప్రత్యేక కార్యక్రమం నిర్వహించడానికి ప్రయత్నిస్తామని, ఇకపై హైదరాబాదు సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ప్రతినెలా ఒక సాహిత్య కార్యక్రమం జరిపి యువకవులు రచయితలు ఉపన్యాసకులకు అవకాశం కలిగిస్తామని హర్షధ్వానాల మధ్య ప్రకటించారు. కార్యక్రమానికి సహకరించిన వారందరికీ ధన్యవాదాలు తెలిపారు. తమ సాహిత్య జీవితంలో రెండు రోజుల పాటు ఇంత మందితో ఇంత జయప్రదంగా జరిగిన సాహిత్య కార్యక్రమం చూడలేదని పలువురు సీనియర్ రచయితలు అభినందించారు. ❖

# 'ముందడుగు' - రైతు అభ్యున్నతికి వేసిన తొలి అడుగు

ఆచార్య టి. సత్యవతి

నాటి సమాజంలో జమీందారీల అధికారాలు, స్వార్థాలు, జల్సాలు పేద రైతులపై వారు చూపించే నిరాదరణ, అహంకారాలు, వారిపై చేసే అమానుష చర్యలను తెలియజేస్తూ జమీందారు చేసే ఆగడాలు సహించలేక తిరుగుబాటుకు సిద్ధపడ్డ సామాన్య రైతుల జీవితాలను చిత్రించి ప్రజా చైతన్యాన్ని తీసుకొని వచ్చిన సందేశాత్మక నాటకం 'ముందడుగు' నాటక కర్తలు సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావులు 'ముందడుగు' నాటకంలో జమీందారులు దౌర్జన్యాలు, రైతులు పడుతున్న ఆగచాట్లలో ఆనాటి రైతుల వాస్తవిక జీవితం ప్రతిబింబించబడింది.

జమీందారు చక్రధరరావు అన్యాయాలకు, అక్రమాలకు అడ్డేలేదు. అతని దుర్మార్గం అంతా ఇంతా కాదు. అతడి క్రింద పని చేసే ఠాణేదారు నాగేంద్రం, జమీందారు మిత్రులైన రామ్, మోహన్‌లు, రౌడీల నాయకుడైన పిల్లిభీముడు అందరూ చక్రధరరావు చేసే ప్రతి దుర్మార్గపు పనిలో తమ వంతు సాయం చేస్తుంటారు. సాధారణ రైతులైన నారాయణరావు, పుల్లయ్య, కోటయ్య, వీరయ్య, కాశిమ్‌లు జమీందారు చేస్తున్న అన్యాయాలు సహించలేక ఏదైనా చెయ్యాలనుకుంటారు.

శిస్తులు కట్టమని పిలిపించిన ఠాణేదారుతో రైతులు ఈ సంవత్సరం పంటలు సరిగ్గా పండలేదు వచ్చే సంవత్సరం కడతామంటే పోయినేడాది కూడా కట్టలేదన్నాడు ఠాణేదారు. పోయినేడాది పెద్ద రైతు అచ్చయ్యగారి దగ్గర అప్పు చేసి మరీ కట్టామని రైతులు చెబితే రసీదులు చూపించమన్నాడు. ఏనాడూ రసీదులివ్వని ఠాణేదారు శిస్తు కట్టని రైతుల్తో కట్టకపోతే కర్మ కాండలు జరిగి పోతాయని బెదిరించాడు.

జమీందారు రైతుల పరిస్థితి గురించి ఏ మాత్రం పట్టించుకోడు. తన జల్సాల కోసం ఎన్నో పనులు చేస్తాడు. రైతులు శిస్తుగట్టిన డబ్బులతో వాళ్ళ పంటలకు కావాల్సిన సౌకర్యాలేవీ చూడకుండా కోడి పందాలు వేస్తాడు. ఎప్పుడూ మందు తాగుతూ సిగరెట్లు కాలుస్తూ, చీట్ల పేకలాడుతూ ఉంటాడు. అమ్మాయిల పిచ్చి బాగా ఎక్కువ. ఈ బలహీనత చూసే అతని మిత్రులు రామ్, మోహన్‌లు జమీందార్ని వెర్రెత్తించి తమ కోర్కెలు కూడా తీర్చుకుంటుంటారు.

రైతులు శిస్తులు కట్టకుండా తననవమానించారని తెలుసుకున్న జమీందారు పిల్లిభీముడ్ని పంపించి రైతుల్ని కొట్టించాడు. తలపగిలిన పుల్లయ్య పరిస్థితి దయనీయంగా ఉంటే, మిగిలిన రైతులు భయపడసాగారు. రాత్రీ, పగలు కష్టపడ్డా పొట్టకు పట్టెడన్నం, కట్టుకోవడానికి గుడ్డా లేక రైతులు నానా బాధలు పడుతున్నారు. అందరం కలిసి ఒకే బాటన నడుద్దాం. జమీందార్ని ఎదిరిద్దామంటూ నారాయణరావు రైతు సంఘాన్ని ఏర్పాటు చేశాడు. నారాయణ తనకు ఎదురు తిరుగుతున్నాడని గ్రహించి అతడు ఉండే ఇల్లు ఎస్టేటుదని అతడు ఇంట్లోలేని సమయంలో పిల్లిభీముడి ముఠాను పంపించి నారాయణ తల్లి సీతమ్మ బతిమిలాడుతున్నా వినిపించుకోక బలవంతంగా ఖాళీ చేయించి తాళం



వేయించాడు. పల్లెలో ఇంకా ఆప్యాయతాను రాగాలు, మమతానుబంధాలు మిగిలిఉన్నాయి. నిరాశ్రయులైన తల్లీ కొడుకులకు తన ఇంట్లో ఆశ్రయమిచ్చాడు రైతు పుల్లయ్య. ఇల్లు ఖాళీ చేయించింది చాలక ఆ ఇల్లు తగులబెట్టించి తన మీద కసితో నారాయణే ఇల్లు తగలబెట్టాడని, దానికి పుల్లయ్య సహకరించాడని ఇద్దరిపైన కేసులు పెట్టి ఖైదులో వేయించాడు జమీందారు. ఇద్దరూ జైలుకు వెళుతున్న సమయంలో సీతమ్మ చూపే ఆప్యాయతలో తల్లిప్రేమ, హృదయ మార్దవం తొంగిచూస్తాయి. అప్పటిదాకా జమీందారు మంచివాడని భావించిన అచ్చయ్య కూడా ఇది తెలుసుకొన్న తర్వాత జమీందారిని వ్యతిరేకిస్తాడు. అచ్చయ్య కూతురు విమల నారాయణని అభిమానిస్తుంది.

జమీందారు కుటిలబుద్ధి, పొగరు వ్యక్తమయ్యేసన్నివేశాలివి. హిందూ ముస్లిమ్ మతాల నడ్డుపెట్టుకొని సంఘాన్ని విడదీయటానికి ప్రయత్నించాడు జమీందారు అది బెడిసి కొట్టింది. జమీందార్ల ఇళ్ళల్లో ఏ ఉత్సవమైనా జరిగితే దానికి రైతులందరి ఇళ్ళ నుండి పాలు పెరుగులు ఇవ్వడం ఆనవాయితీ. ఈ రోజు పెద్ద దొరగారు చనిపోయిన రోజని, ప్రతి ఒక్కరు పాలు, పెరుగు సిద్ధంగా ఉంచాలని ఠాణేదారు చెబితే రైతులు పశువులకు మేత లేక కొన్ని చనిపోయాయి. మరికొన్ని పాలివ్వడం లేదు పంపలేమన్నారు. మదమెక్కిన, కొవ్వు బలిసిన జమీందారు 'మనుషులు పాలు' పంపమన్నాడు. అచ్చయ్యతో సహా కోపించిన రైతులు "జాగ్రత్తగా మాట్లాడమ"ని ఎదురు తిరిగారు. రైతుల మీద ఆగ్రహంతో రాత్రిపూట మందులు పెట్టించి పశువులను చంపించ సాగాడు జమీందారు అచ్చయ్య గారింట్లోకి రౌడిముఠా ప్రవేశించి పశువులకు మందు పెట్టి నిద్రపోతున్న విమలను ఎత్తుకొని పోతుండగా ఆ రోజు ఉదయమే జైలు నుండి విడుదలైన నారాయణ విషయం తెలుసుకొని తనతోపాటు మరికొందరు రైతులతో మాటువేసి వాళ్ళను పట్టుకున్నాడు. విమలను ఎత్తుకొని పోతున్న పిల్లి భీముడు ఆమెను వదిలేసి కత్తితో నారాయణని పొడిచి పారిపోతున్నంతలో రైతులు అతడ్ని పట్టుకున్నారు. అందరికీ దేహశుద్ధి చేసి ధాన్యంకొట్లో బంధించారు. జమీందారు పట్నం పారిపోయాడు.

ఈ విధంగా అడుగడుగునా రైతుల జీవితాలను అనేక ఇబ్బందులకు గురి చేస్తూ, వారు తన లాంటి మనుషులేనని గుర్తించక, ఎదిరించినవాడ్ని యమపురికి పంపిస్తూ తన అధికారానికి అడ్డులేకుండా, తన విలాసాలకు ఆటంకం కలగకుండా దౌర్జన్యం చేస్తున్న జమీందార్లను ఇక సహించమంటూ ఆరని మంటలతో, ఆకలి కేకలతో, ఆగిపోని ఆవేశంతో తమ ఉనికిని చాటు కోవడానికి పల్లె ప్రజలు చైతన్యవంతమై ముందుకు వేసిన తొలి అడుగే ఈ 'ముందడుగు' వీరు వేసిన ముందడుగుకు ముచ్చెమటలు పట్టిన జమీందారు పల్లె విడిచి పట్నం పారిపోయాడు. రైతులందరూ దుర్మార్గుడైన జమీందారు చేతిలో నుండి విముక్తి లభించినందుకు సంతోషిస్తూ తమ బతుకులను చక్కగా పండించుకోవాలని ముందడుగు వేశారు.

→

# తెలంగాణా కవిత్వపు 'దర్వాజ'

శిలాలోలిత

తెలంగాణా ముఖాన్ని చూడదల్చుకుంటే, తెలంగాణా జన జీవితం అర్థం కావాలంటే, బడుగు బతుకుల వెతలు అవగాహన కావాలంటే, రంగు సత్యనారాయణ కవిత్వపు 'దర్వాజ' తెరిస్తే చాలు. అసలు తెరవనవసరంలేదు. వెలిసిన జాజిరంగు, పెచ్చులూడిన రత్నావళి రంగు, చిన్నబోయన్నదీగూడు, దాచుకునే ధనం లేదుకనక అవసరంబడని, వెయ్యని వేలాడే గొళ్ళెం, తలుపు పక్కనే లోపలి శూన్యాన్ని మోసుకొస్తూ జాగా నుంచి చూస్తున్న మట్టి గోడల కళ్ళు, వెరసి దర్వాజా ముఖచిత్రం.

ప్రముఖ ఫొటోగ్రాఫర్ భరత్‌భూషణ్ కెమెరా బంధించిన సజీవ చిత్రమది. తెలంగాణా వాకిలి గుమ్మమది.

తనను గురించి తానన్వేషించు కుంటూ, నిరంతర అంతర్గత పోరాటంతో, నిత్యచలన శీలి సత్యనారాయణ 'నా ఆచూకి ముండ్ల కంచెమీది/కట్లపూవు/చేయి కడిగిన చోట/ మట్టినయ్యే ముందు/నేనో వెలుతురు కావాలి/ నేను నడుం వాల్చిన చోట/ దీపం వెలుగుతూ వుంటుంది/ చీకటితో పోటీ పడుతూ... ఇదీ ఈ కవి ఆచూకి. అతడి కవిత్వతత్వ సారాన్నంతా నీలి రంగును దాచుకున్న దీపపు కాంతి వెల్లడించింది. 1993లో వచ్చిన మొదటి కవితా సంపుటి 'రగిలే గుండెలు' సాహిత్య రంగంలోని కలుషిత వాతావరణాన్ని చూసి నిరుత్సాహపడకుండా, వ్యక్తిగా 'ఇప్పుడు పాటించే విలువల్నే ఎప్పుడూ పాటిస్తూ, క్రమశిక్షణ కల్గి, నిజాయితీతో, ధైర్యంగా నిరంతరం రాస్తూ వుండాలనే తపనే, చైతన్య ప్రవాహంలో బిందువును కావాలన్నదే తన ఆశ' అని సత్యనారాయణ ఆ పుస్తకంలో ప్రకటించుకున్నారు. కవిలో వున్న ఆవేశం, అంతర్గమథనం కవిత్వమైనాయిందులో. 1997లో 'మట్టిస్పర్శ' అనే మరోకవితా సంపుటి వచ్చింది. ఇందులోని రావిచెట్టు, మట్టి పొరల మధ్య నుండి, పరావర్తనం, విప్లవ బీజాలై లాంటి మంచి కవితలున్నాయి. మళ్ళీ ఇప్పుడు 2002లో వచ్చిన మరో కవిత్వ సంపుటే 'దర్వాజ'

రగిలే గుండెల్తో, మట్టి స్పర్శనుభవిస్తూ, కవి, అంతరావిష్కరణకు తెరిచిన దర్వాజ గుండా ప్రయాణిస్తే కవి జీవన పరిణామ క్రమంలో వచ్చిన మార్పులు, కవిత్వ సాంద్రత ఇందులో కన్పిస్తాయి. ఈ దర్వాజున్న ఇంటికి 15 కిటికీలున్న కవితలున్నాయి. ఒకో కిటికీ రెక్క దగ్గరికెళ్ళినా, తెరిచినా, మూసినా, జీవితమంతా పరుచుకుని కన్పిస్తుంది. 'సైరన్ కూతలు' కవితలో 'నిరాకృతి/పురాతన కట్టడం/ వృద్ధాప్యం/ దిక్కూచిలేని/కాగితపు పడవ/ అడ్డ మీది కూలి - సుమా అన్న వాస్తవాన్ని వివరిస్తాడు. వేసవి గీతాలు, పగిలిన క్షణం, చెయి కడిగిచోట, ఐదోగోడ, జీవవాక్యం, జీవగణితం, ఆమె, రెండు ఉదయాలు, తుడుం, తఋగు, మన్నంటిని మనిషి, ఊపిరి కొన, వెతలగూడు లాంటి విలువైన కవిత్వమున్న కవితలున్నాయి. 'వెతలగూడ'లో నిశ్శబ్దాన్ని కవిత్వంలో వినిపించారు. చెప్పలేని దానిలో, చెప్పని దానిలోనే లోతైన అర్థాలెన్నో వుంటాయన్న చేదు నిజాన్ని విడమర్చారు. అలాగే రాచిప్ప సాక్షిగా, నుపద్దె కవితలు కవితలోని ఆర్ద్రత, తపనలకు నిలువటద్దాలు. 'నేనో వెలుతురు కావాలి' అనే ఆశావాద ప్రకటల్ని చేసే ఆశావాది. సాహిత్యం పట్ల అతడికున్న కమిట్‌మెంట్, నిజాయితీలు 'కొలిమి' అనే లిఖిత సాహిత్య పత్రికను నడపడానికి దోహదపడ్డాయి. ఆర్థిక సమస్యలతో తాను సతమతమవుతున్నా, ఒక పత్రిక నడపాలన్న అతడి సాహిత్య కాంక్షే దానికి చమురు. వెలుగుతున్న ఆ సాహిత్య దీపాన్ని, ఈ కాంక్రీటు నగరంలో, ఫ్లోరోసెంట్ దీపాల మధ్య, రెండు అరచేతులడ్డుపెట్టి, 'కొలిమి' కాపాడుకోవాల్సిన, చదవాల్సిన బాధ్యత, అవసరం, సాహితీ పిపాసకులందరికీ వుందని పించింది. కవిని, కవిత్వాన్ని, రక్షించుకోవాల్సిన తరుణమిది అనిపించింది.

# తిలక్ కవితల్లో మానవతా దృక్పథం

చెన్నా రామమూర్తి

సాహిత్య ప్రక్రియ ఏదయినప్పటికీ అది మనిషి జీవితానికి సుఖదుఃఖాలకు, ఆచారాలకు అలవాట్లకు, సామాజిక పరిస్థితులకు అద్దం పడుతుందని చెప్పక తప్పదు. ఆ విధమైన వైరుధ్యం తిలక్ రచించిన ప్రతి కవితలోనూ కనిపిస్తుంది. మానవ సమాజం నుంచి దూరంగా పోయి ఏ కవీ ఏమీ సాధించలేదు. మనిషి జీవితాన్ని మథిస్తూ అందులోని రసానుభూతులను పాఠకులకు గాని, శ్రోతలకుగాని అందించినపుడే దాని ఫలితం సమాజం మీద ఎక్కువగా ఉంటుందంటాడు తిలక్.

"నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు.

నా అక్షరాలు ప్రజాశక్తులు వహించే విజయ ఐరావతాలు.

నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు."

ఈ వాక్యాల్లో తిలక్ కవిత్వ ప్రయోజనాన్నీ, కవిత్వ శిల్పాన్ని గుర్తించవచ్చు. మొదటి పాదం కరుణ రసాన్ని అందిస్తున్నట్లుంటుంది. రెండవ పాదం సామాజిక స్పృహకు, మూడవ పాదం కవిత్వ శైలికి అద్దం పడుతున్నాయి.

ఒక కాలంలో నివసించిన కవి తన కాలం నాటి సమాజ వైరుధ్యాలను తన కవిత్వంలో ప్రతిఫలించడం పరిపాటి. అలాగే తిలక్ రచించిన ప్రతి కవితలో మనిషి కదలిక, ఆ మనిషి బతికిన తీరు, కాలం తప్పకుండా కనిపిస్తాయి.

తిలక్ కవితల్లో ఒకవైపు భావుకత, మరోవైపు అభ్యుదయ భావాల సమ్మేళనం ద్యోతకమవుతుంది. జీవితపు అన్ని కోణాల్లోకి వెళ్తుంది కవిత. కానీ, తన కవిత దేనికీ, ఏ ఇజానికీ నిబద్ధత కాదని నిర్మోహమాటంగా వివరిస్తాడు తిలక్.

"నా కవిత్వం నాదొక తత్వం
మరి కాదు మీరనే మనస్తత్వం
కాదు ధనిక వాదం,కాదు సామ్యవాదం
కాదయ్యా అయోమయం జరామయం"

ఏదీ కాదు కాదంటూనే, ఇది అయోమయం కాదు. నేను వివరించేదంతా జీవన సత్యమేనంటాడు తిలక్. ఆ జీవన తత్వం నుంచి మనకు కావలసినంత జీవితాన్ని

నేర్చుకోవచ్చు. విసిగి వేసారిపోయిన మానవ జీవితానికి మంచి కితాబునిచ్చిన కవితామూర్తి తిలక్. నిరాశను, నిస్పృహను పారదోలి, చైతన్యానికి నాంది పలుకుతాడు తిలక్.

"ఒక్కసారి
ఆశజారి
నిస్పృహలో నీరసించి
నెగడువంటి వేదనలో తూలిపోకు
కాలిపోకు
దిక్కులలో కార్మొయిళ్ళు
దిగులువోలె కమ్ముకొనెను
చుక్కలలో తలకు మాసి
ఒక్కొటొకటి రాలిపడును."

నిస్పృహతో నీరసిస్తే జీవితం చీకటిమయమవుతుంది. నిస్పృహను దరి చేరనీయరాదు అంటాడు తిలక్. అభ్యుదయ కవితాయుగం నడిమంత్రం దాకా కూడా అనేక మంది కవులు శైలికి, అక్షర రమ్యతకూ ప్రాధాన్యం ఇవ్వనందువల్ల అదొక లోపంగా పరిణమించి, అభ్యుదయ కవిత విస్తృత ప్రపంచాన్ని వెతుక్కోలేదని అనిపిస్తుంది. ఈ లోపాన్ని నిరసించి తిలక్ అభ్యుదయ భావాలకు రసరమ్యమైన శైలిని సమకూర్చడంలో కృతకృత్యుడయ్యాడు. మొత్తం మీద చూస్తే అభ్యుదయ భావనా, కాల్పానికోద్యమ కాలం నాటి శబ్ద సౌందర్యమూ – ఈ రెంటి మేళవింపు తిలక్ కవిత్వమని చెప్పవచ్చు.

'ఆర్తగీతం' అనే కవితలో అలాంటి లక్షణాలన్నీ కనిపిస్తూ, రమ్యమైన కవితా రీతులను గమనించవచ్చు.

'నేను చూశాను నిజంగా మూర్తీభవత్ దైన్యాన్ని, హైన్యాన్ని
క్షుభితాశ్రు కల్లోల నీరధుల్ని గచ్ఛత్ శవాకార వికారుల్ని
ఇది ఏ నాగరికతకు ఫలశృతి? ఏ విజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి,
ఏ బుద్ధదేవుడి జన్మభూమికి గర్వస్మృతి?"
అంటాడు.

"ఇంక నన్ను నిర్బంధించకు నేస్తం
ఈ రాత్రి నేను పాడలేను, ఈ
కృత్రిమ వేషాన్ని అభినయింపలేను
మానవత లేని లోకాన్ని స్తుతింపలేను
మానవునిగా శిరసెత్తుకు తిరగలేను
ఈ నాగరికతారణ్యవాసం భరించలేను" అన్న

నిక్కచ్చి మాటలను తన కవిత ద్వారా తెలియజేస్తాడు తిలక్. నేటి సమాజంలో మనిషి మనిషిలో కృతిమత్వం, కపటత్వం, మానవతాలోపం, అరణ్యంలాంటి సమాజం అంటూ గతిరీతుల్ని వివరించారు. అలాంటి వాటిని నిరసించాడు తిలక్.

ప్రాతఃకాలం ఫలదాయకం, శుభసూచకం అనుకోవటం పరిపాటి. ఎవరికది పరిపాటి? సుందరస్వాప్నికుడికా?! కటిక దరిద్రుడికా?! తెల్లవారితే రోజు గడవని సగటు మనిషికి ప్రాతః కాలం ఏపాటి శుభసూచకం! ఊహా ప్రపంచాన్ని సృష్టించుకుని అదే ఊహలో బ్రతికే ఊహా తపస్వికి ఊహే జీవితం అంటాడు తిలక్. తన కవిత "ప్రాతఃకాలం"లో కలను గురించి ఇలా రాస్తాడు.

"సురాంగనా సఖీ చిరవిరహ
నిద్రా పరిష్వంగము విడ
ఉడు పథమున జారిన
మంచు కలవా!" అంటాడు... ఎంతటి హృద్యమైన స్వాప్నికత కనిపిస్తుందీ కవితలో

"ఆకలి మాడుచు
వాకిట వాకిట
తిరిగే పేదల
సురిగేదీనుల
సుఖసుప్తిని చెరచే
సుందర రాక్షసివా" అని ప్రాతఃకాలానికి ముక్కు చెంపలెస్తున్నంత భీకర కవిత్వాన్ని చిత్రీకరిస్తాడు తిలక్.

"దేశ భక్తులూ, ధర్మపురుషులూ
చిట్టి తల్లులూ, సీమంతినులూ
ముద్దు బాలురూ, ముత్తైదువలూ
కూడియాడుచు కోకిల గళముల
పాడిన శుభాభినవ ప్రభాత
గీత ధవళిమవా!"

ఈ చిన్న చిన్న మాటల్లో ఆధునిక రీతుల్ని అనుసరిస్తూ, శైలిలో దోషం లేకుండా, భావానికి చేటు కలగకుండా, ప్రభాత గీతికను ఆహ్వానిస్తున్నాడు. ఇది కోకిల పాడిన శుభాభినవ గీతిక అంటున్నాడు. ఇది అందరికీ శుభోదయమే. కాల్పానికత ఎంత కాలం నిలుస్తుంది. కాలం చెల్లిపోగానే కనుమరుగైపోతుంది. కవితలోని ప్రతిపాదం, ప్రతిపదం మనిషి ఊహల్ని తాకుతూ వెళ్ళినపుడే దాని స్వతజనాత్మకత సమాజంలో పాతుకుపోతుంది అంటాడు తిలక్.

"కవిత్వం ఎంత హృదయ సంబంధి అయినా కవి చెప్పదలచుకున్న భావం ఛాయా మాత్రంగానయినా పాఠకుడికి అందకపోతే ఆ కవిత్వం నిష్ప్రయోజనం. కవిత్వం అందరికీ అర్థం కావాలనే నినాదం ఎప్పుడూ భ్రాంతీ పూరితమే అయినా అటువంటి అర్థంగాని సాహిత్యం ఏ హృదయాన్నీ చేరదు. అది ఉన్నా ఒకటే లేకున్నా ఒకటే" అంటాడు తిలక్. కవితా లక్షణాల్ని వివరిస్తూ, "కవి అందిస్తున్న భావ చిత్రాలు కవికే తప్ప మరొకడికి అర్థం కానంత, అందలేనంత సంక్లిష్టతతో కూడుకుని ఉండటం సత్కవితా లక్షణం కాదు" అన్నది తిలక్ అభిప్రాయం.

ఎప్పుడూ ఒకే రకమైన కవితారీతుల్లో రొటీన్‌గా కలాన్ని కదిలించక, ఆధునికతవైపు నవయుగాన్ని మేలుకొలుపుతూ ఆయన కలాన్ని కదిపాడు. సమాజాన్ని కుదిపాడని అనిపిస్తుంది. 'ప్రార్థన' అనే కవితలో తన ప్రార్థనను దేవుడికి వినిపిస్తాడు.

"మాకు నటనలు వద్దు
మా చుట్టూ కటకటాలు వద్దు
గొప్పలూ, గోసాయి చిట్కాలు వద్దు" అంటాడు.

వైరాగ్యం కూడా అక్కడక్కడ కనిపిస్తుంది. చిరుగాలి తాకితే ఆకు కదిలి అనుకోకుండా రాలిన మంచు బిందువులా ఒకే కవితలోనే నైరాశ్యం. వైరాగ్యం, ఆధునికత, శైలి అన్నీ అనుసంధానమైనట్లు అనిపిస్తుంది తిలక్ కవిత్వం. 'ప్రార్థన' అనే కవిత అందుకు మంచి ఉదాహరణ అని చెప్పవచ్చు.

తిలక్‌కు గల సమాజపరమైన అవగాహన, కరుణరస ప్రధానమూ, మానవతా వాద ప్రధానము అయిన కవితా ఖండికలవల్ల అతను సంపూర్ణమయిన ఆధునిక కవిగా గుర్తింపు పొందాడు. వ్యవస్థలో ఉన్న అనేక లోపాలు, ఆర్థిక అసమానతలు, దోపిడీ విధానం, అతన్ని కదిలించి కవిత్వం రాయించాయి. ఈ అనేకానేక సమస్యలన్నింటినీ అతను ఏదో ఒక సిద్ధాంత దృక్పథంతో దర్శించలేదు. మానవుడిగా సాటి మానవునిపై గల జాలి, దయ, కరుణ మొదలైన మానవతా లక్షణాలు భూమికగా తిలక్ కవిత్వాన్ని రాశాడు. అందుకే తిలక్ రాసిన ఏ కవితను తరచి చూసినా సమాజంలో మనకు నిత్యం కనిపిస్తున్న సగటు మనిషి చిత్రణ, అతడి వేడి నిట్టూర్పులు, వాడి చూపులే దర్శనమిస్తాయి.

తిలక్ కవితల్లో అంతర్జాతీయ భావన కూడా కనిపిస్తుంది. "సంకుచితమైన జాతి మతాల సరిహద్దుల్ని చెరిపేస్తాం" అని రాస్తాడు. "ఆకుంఠిత మానవీయ పతాకను ఎగురవేస్తాం" అని ఎలుగెత్తి చాటిన కవి కంఠం ఆయనది.

❖

## ధిక్కారమెప్పుడూ వర్తమానమే...

కందుకూరి దుర్గా ప్రసాద్

దాస్యాల దైనందినాల మధ్య
పరిగముళ్ళను పీకిపారేసి
కళ్ళనిండా...
కలల కంకుల్ని పొదుగుకున్న వాడెవడో!

మండుటెండల పహారాలుదాటి
మొదటిసారిగా...
ప్రియురాలి మంచుచూపుల్ని తెంపుకున్న వాడెవడో!

ఎవడో ఒకడు...
మరణం మీద మజిలీచేసి
పోతూపోతూ
శ్వాసించిన ధిక్కారాన్ని
తూర్పున వేలాడదీసి పోతాడు

అగాధాలమే కదా మనం!
తప్పని జలపాతాల తీర్పుల్ని ఆహ్వానిస్తూ
పెరుగుతున్న గుండెలోతుల్లో
గమనాల్ని గురి చూసే వాళ్ళం...
శిఖరాల పదునుభాష మనకర్థంకాదు!!
మన నాగరికపు పలుకులన్నీ...
పిరికి ప్రపంచపు పలుకులన్నీ...
పిరికి ప్రపంచపు బురదతీరాల్లో
కప్పగొంతుల్తో కలిసిపాడటానికే!

భయంతో అతికించుకున్న
మనరెప్పలు తెరుచుకోక ముందే...
వాడు సూర్యున్ని చప్పరించి
చరిత్ర మీదకు ఉమ్మేస్తాడు
వాడి పాదాలు ప్రవహించిన చోటే...
చీమలనడకలు సమూహాలైంది!
వాడినల్లని వేలికీ పలకకీ మధ్య...
అక్షరాలు మెరిసినప్పుడు
ఆకాశంలో నక్షత్రాలు...
కొత్త కవాతు నేర్చుకున్నాయ్!!

వాక్కులెవరియితేనేం...
నిర్వచనం...
జీవితానికే అయినప్పుడు
మృత్యువు చాటున
మనిషికోసం వెదకడం దేనికి!
ప్రశ్నించే ధైర్యం పంచబడ్డ...
ఏ రాత్రి జాడనడిగినా
తిరిగిరావడానికి వెళ్ళిపోయిన అతడ్ని
ప్రవక్తనే చెబుతుంది!!

## సాగర సంగమం

సత్యభాస్కర్ ఎ.

నది సాగరంలో కలవనంటోంది
తానొచ్చిన దారిలో
దాటొచ్చిన
తీరాలను
తల్చుకుని మరిమరీ
కన్నీరు పెడుతోంది
నది సాగరంలో కలవనంటోంది!

బాల్యంలో జలలా
యవ్వనంలో ఉధృతంగా
నడివయస్సులో నిండు గర్భిణిలా
సాగిన నది
చరమాంకం రాలేదింకా అంటోంది
నది సాగరంలో కలవనంటోంది!

వియోగ సంయోగాల మధ్య
వదిలి వచ్చిన వాళ్ళ స్మృతులు
గుండెల్లో సుడులయి తిరుగుతుండగా
తనలో దాచుకున్న
వాళ్ళ దోసిళ్ళ కొద్దీ కన్నీళ్ళు
ఒక ప్రవాహమయిన వేళ
నది సాగరంలో కలవనంటోంది!

నేలకొరిగిన వాళ్ళ స్ఫూర్తి
పడిలేస్తున్న కెరటమై
మమ్ముల వొదిలి పోవద్దని
నీట ముంచొద్దని
ఆక్రందిస్తుంటే
నది సాగరంలో కలవనంటోంది!

విరామమెరుగని
సాహసికుడి సంచారానికి
తాను నేపథ్య సంగీతమయి
మ్రోగుతానంటోంది
సమస్త సృష్టి ప్రక్షాళనకు
తాను హేతువయి నిలుస్తానంటోంది
నది సాగరంలో కలవనంటోంది!

# లే... జౌట్ నో.. డౌట్



మీనాక్షి శ్రీనివాస్

"అబ్బబ్బ... ఎండలు అప్పుడే మండిపోతున్నాయి. 'ఆఫీసు పని మీద... ఆ పని మీద. ఈ పని మీద అస్తమానం ప్రయాణం చెయ్యవలసి రావడం... ఈ నెలలో ఇది ఆరోసారి ఎంత దగ్గర ప్రయాణం అయినా ప్రయాణమేకదా..." బస్సులో చేరగిలపడి ఉస్సూరంటూ కళ్ళు మూసుకున్నాను. ఏ మాటకామాటే చెప్పుకోవాలి. ఎంత బస్సు ప్రయాణం అయినా నాన్‌స్టాప్‌లో అయితే ఎలాగో అలా లాగించెయ్యచ్చు... కాస్త కదులుతూ.. గాలాడుతూ ఉంటుంది కదా... అదే మామూలు బస్సయితే అస్తమానం ఆగడం... అదొహ ఆగడం ప్రాణానికి గాలాడక."

చల్లగాలికి కాస్తంత కునుకు పట్టింది.

కాస్తంత ఉక్కపోత, కావాల్సినంత రణగొణ ధ్వని... ఆవలిస్తూ కళ్ళు తెరిచాం. అబ్బా... అప్పుడే విజయవాడ వచ్చేసినట్లుంది. ఇదిగో ట్రాఫిక్ జామ్‌లా ఉంది. ఈ బ్రిడ్జి మీద. ఇదొక గోల ఎప్పుడూ జామ్ అవుతూనే ఉంటుంది. ఈ బ్రిడ్జి మీద "అవునూ... ఈ బ్రిడ్జి ఎందుక్కట్టారో ఊళ్ళో మధ్యగా... ట్రాఫిక్ జామ్ అవడానికి . కాకపోతే"

"ప్చ్.. చదవేస్తే ఉన్న మతీ పోయిందని... బ్రిడ్జ్ ఎందుక్కట్టడం ఏమిటి... ఇది కృష్ణానది కదూ... మర్చేపోయా... మరి మర్చిపోక... కొన్నేళ్ళుగా చూస్తున్నా పైన బ్రిడ్జి... కింద యిసుక పర్రా తప్ప.... నీళ్ళేవి, యిది "నది" అని గుర్తుంచటానికి".

"ప్చ్.... ఏమిటో కొన్ని వందల ఎకరాలు... యిలా నిస్తేజంగా... ఊరికే బీడులా పడుంటోంది....

.... ఎంచక్కా యిందులో ఏవైనా పైరు లెయ్యచ్చుకదా...

"ఛ... ఛ... నగరం నడిబొడ్డున పైరులు ... పంటలేమిటే కానీ... ఆ.... నాదో మహత్తరమైన ఆలోచన...."

"... అలా... చేస్తే...."

"ఇంకా ఏమిటాలోచన భేషుగ్గా ఉంటుంది" అంది అంతరాత్మ...

"కానీ... ఎలా... కుదురుతుందా" మనసు మెలిక.

"ఇదొహటి మధ్యలో.... అన్నింటికీ అడ్డంగా... భేషుగ్గా కుదురుతుంది, ఎందుక్కుదరదూ... ఎక్కడేక్కడి భూములు కబ్జా అవుతుండగా లేనిది... కాస్త జాగ్రత్తగా ప్లాన్ చేస్తే.... చచ్చినట్లు కుదురుతుంది.."

"ఆ యిదేదో మాంచి ఆలోచనలా వుంది. చెయ్యి దాటిపోనీయకూడదు. వెధవది జానాబెత్తడుద్యోగం.. గొర్రెతోక బతుకు ఎన్నాళ్ళు చేసినా..."

నాకో మాంచి దోస్త్ వున్నాడుగా, వాడిది అలాటిల్లాటి బుర్ర కాదు.... ఈ అయిడియాకానీ వాడితో చెప్పానా...

✤✤✤

"వహ్, కత్తిలాంటి ఐడియాగురూ... ఈ దెబ్బతో మన ఫేట్ తిరిగి పోవాల్సిందే..." అంటూ ఆనందంతో ఊగిపోయాడు నాతో సహా.

"అనుకో... అయినా యిది అలాటిలాటి విషయం కాదుగదా.... ఎలా గంటావ్..." గొంతునిండా ఆదుర్దా, అపనమ్మకం.

"అబ్బా... ఆ దేవదాస్ మార్క్ ఫేసు మార్చుగురూ... బంగారం.. ఛ... బంగారం ఏమిటి... ప్లాటినం లాంటి ఐడియా... ఆ... యింక అర్జంటుగా రంగంలోకి దిగెయ్యాలి... ఈ ఐడియా యింకోడికి రాకముందే."

"గురూ... నువ్వు ప్లాన్‌లు, పబ్లిసిటీ, కన్‌స్ట్రక్షన్... బుకింగులు వగైరా... వగైరా చూసుకో ఈ లోపున నే అసలు కార్యక్రమం

అదే ఆ భూమి (కృష్ణ) మనపేర్న ఎసైన్‌మెంటు, లే ఔట్ గట్రా చేయించడం... లీగల్‌గా అది మన పేర్న ట్రాన్స్‌ఫర్ అయ్యేలా చూడటం అవీ... చూస్తా..." అప్పటికీ వాడు ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయి మాట కూడా సరిగా రావడంలేదు.

"నాయనా... తగ్గు, కాస్త గుర్రం కట్టెయ్యి.. లే ఔట్, మన పేర్న ట్రాన్స్‌ఫర్ చేయించుకుందుకు అది మన తాతగారి జాగీరుకాదు... అధమం అది దేముడి మాన్యాలో, పోరం నాకు స్థలాలలో కూడా కావు... అది ప్రభుత్వ ఆస్తి.... అదీ.... "జీవనది".

"జీవనదా... మట్టి గడ్డలా" పెళ్ళున నవ్వేడు.

"గత కొన్ని ఏళ్ళుగా అందులో చుక్కనీరు లేదు... ఏదో కాస్తోకూస్తో వాన కురిసి వెలిసినంత ఉన్నా అది ఆ బ్యారేజి కవతిలే కాని యివతల కాదు. ఏమన్నావు... ప్రభుత్వ ఆస్థా... (మళ్ళీ ఫెళ్ళున నవ్వు) కనకే ఎక్కడ నొక్కాలో అక్కడ నొక్కి పని చేయించుకోవడం డబల్ ఈజీ... వీజీ ఏ వీజీ..." దాచాలన్న దాగనంత ఆనందం వాడి గొంతులో.

"అదే... ఎలా" నిత్య శంకితుల లిస్టులో ప్రధమ స్థానం నాదే అంటారు అందుకే నా మిత్రులంతా నన్ను.



"చూడు గురూ... పై లెవల్లో మనోళ్ళున్నారు... యిలా అందిస్తే అలా అల్లుకుపోతారు... అదంతా నాకొదిలెయ్... ఆ రాజకీయం అంతా నీకర్థంగాదు కానీ సింపుల్‌గా లే ఔట్ చేసి ప్లాట్స్ వెయ్యడానికి తగినన్ని వనరులూ... కారణాలు ఉన్నాయి ఆ స్థలానికి అసలు ఆ మాటకొస్తే బంజరుగా...బీడుగా, మోడుగా ఏది వున్న దాన్ని యిలా చేసి ప్రభుత్వం ఆదాయం పెంచడానికి మంచి "ఆలోచన"... అదే "ఐడియా" యిచ్చినందుకు మనకు అవార్డులూ, రివార్డులూ కూడా వచ్చినా రావచ్చు. అసైన్‌మెంటు ప్రభుత్వానిదే, కాకపోతే ఐడియా యిచ్చినందుకు టెండర్ మనకొస్తుంది. ప్రభుత్వ టెండర్ కొట్టేయడమే మనం చేసేది."

"కొన్ని వందల ఎకరాలు అలా నిస్తేజంగా... నిరుపయోగంగా పడి ఉండటంవలన ప్రభుత్వానికి.. ఎంత నష్టం... అంతకంటే దానిని చక్కగా లే ఔట్ చేసి రాష్ట్ర ప్రభుత్వమే హౌసింగ్ బోర్డు కాలనీ చేసి ఎల్ఐజీలు, ఎమ్ఐజీలు గట్రా వేస్తే ఆ ఆదాయం అంతా ఎవరికీ... ప్రభుత్వానికే కదా... ఏదో కాస్త వ్యవహారం నడిపినందుకు కాస్తంత లాభాలేమనవి... అంతే"

"అబ్బ... ఏం బుర్ర గురూ నీది... ఆ లెక్కల్లో అయితే అంతా వీజీగానే అయిపోతుంది, అన్నట్లు... వాటిల్లో కొన్ని బ్లాక్ చెయ్యడం మాత్రం మరచిపోకూడదు... ఎంతైనా నగరం నడిబొడ్డున ప్లాట్స్ అంటే మాటలా..."

"అవును కానీ... రాష్ట్రం వరకూ అయితే సరే ఎలాగో అలా మానేజ్ చెయ్యచ్చు కానీ మరీ కృష్ణానది అంటే... జీవనది దాని పుట్టుక ఎక్కడో. అది ప్రవహించే మిగతా రాష్ట్రాల మాటేమిటి? ఎప్పుడో ఉత్తిరోత్రా నీరు కట్టెయ్యకుండా వదిలేస్తే... ఈ కట్టడాలన్నీ "కృష్ణార్పణం" కావూ "అమాయకంగా అడిగా.

"హార్నీ... నీ తెలివి తెల్లకాకు లెత్తుకుపోనూ... అమాయకంగా కనిపిస్తూ, అనిపిస్తూ అద్భుతంగా పని చేస్తోంది నీ మెదడు, తదనంతరం దాన్ని ఏ విశ్వేశ్వరయ్య మ్యూజియంలోనో పెట్టాల్సిందే. మంచి పాయింటే మరి అది... రేపెప్పుడయినా ఆల్మట్టి... ఆనకట్ట అంటూ కూర్చోక నీరిడిచిపెడితే అర్ధాంతంగా మునగవూ కొంపలు... అందుకే అవీ ఆలోచించాల్సిన పాయింటే మరి...

ఆ... శుభ్రంగా బ్రాంచాఫీసులు పెడితే సరి.... లాభాలకి లాభాలు... ప్రమదాలు ఉండవు."

"అంటే"...

"నువ్వొకడివి... అన్ని విడమరచి చెప్పాలి... అయినా అంత మంచి ప్లానేసినాడివి... నీకు చెప్పక తప్పదులే... యిప్పుడూ.... మన ప్రభుత్వం యిచ్చిన పర్మిషనూ... ఆ ప్రాజెక్టు వివరాలు, అందులో కలిగే టర్నోవరూ... లాభాలు మిగతా రాష్ట్రాలకు, అదే నేహే కృష్ణానది ఏ ఏ రాష్ట్రాల గుండా పోతోందో ఆ రాష్ట్రాల కన్నమాట, చూపెడతాం... ఆంధ్రప్రదేశ్ లాంటి రాష్ట్రం, హైటెక్ రాష్ట్రం... స్వర్ణాంధ్ర యిలా బంజరు... బేవార్స్‌గా ఉన్న భూమితో కోట్ల టర్నోవరుతో నిరులు వండించుకుంటుంటే మనం మాత్రం తీసిపోయామా... తక్కువ తిన్నామా అన్న ఆలోచన కలిగించాలి... అంతే ఇక అవి కూడా ఆ బృహత్ కార్యక్రమం చేపట్టి తీరుతాయ్... అయితే బేసిక్‌గా ఆ ఐడియాకు అసలు హక్కుదార్లం మనం కనుక పేటెంట్ మనదే అవ్వాలి. సో... ఆ ప్రాజెక్టు కూడా మనదే ఇలా... చేసుకుంటూ... చేసుకుంటూ పోయి కడాఖరి ఫిట్టింగ్ కృష్ణానది ఒరిజినల్‌గా పుట్టిన రాష్ట్రంలో పెడతాం అన్నమాట. ఎందుకంటే భవిష్యత్తులో కృష్ణ యింగ మన రాష్ట్రంలో ప్రవహించకుండా అన్ని జాగ్రత్తలు తీసుకోవాలి కదా. అంటే ఫైనల్ సెటిల్‌మెంటన్నమాట... "అరమోడ్పు కన్నులతో అదోలాంటి మైకం కమ్ముకుంది వాడి గొంతులో.

"ఏమిటదీ" ఆత్రం పట్టలేక గట్టిగా అరిచా.

"ష్... నీకన్నింటికీ కంగారే... యిది కాస్త సీక్రెట్‌గా జరగాలి ఎందుకంటే ప్రభుత్వానికి లాభం ఉంటుంది కనుక అది గమ్మునున్నా... ప్రతి పక్షాల, వామపక్షాల... కాస్తోకూస్తో ఆలోచించే ప్రజలంటారుగదా... వాళ్ళకు తెలిస్తే అడ్డుపడే ప్రమాదం వుంది. కనుక గుట్టు చప్పుడు కాకుండా పని జరిగిపోవాల్స.."

"ఏమిటదీ" ఉత్సాహాన్ని నొక్కి పట్టి రహస్యంగా అడిగా.

"మరేం లేదు... ఆ నది పుట్టి ప్రవహించే ఆ రాష్ట్ర ప్రభుత్వం చేత ఆ నది జన్మ-స్థానం అక్కడ గనక దాని మీద "సర్వహక్కులూ తమవే" అనీ మిగతా రాష్ట్రాల గుండా అది పరుగులెత్తి ప్రవహించి ఇరుగు పొరుగు రాష్ట్రాలు "సస్యశ్యామలం కావడం అన్యాయం అనీ... ఓ చట్టం చేయించి పడేస్తే... ముమ్ముందు ఎంత నీటి ప్రవాహం వచ్చినా అది మిగతా రాష్ట్రాలకు చేరకుండా అడ్డుకట్టలో, ఆనకట్టలో వేసుకుని వాళ్ళ చావు వాళ్ళు చస్తారు. మన రాష్ట్ర హౌసింగ్ బోర్డు ఫ్లాట్స్‌కు భవిష్యత్‌లో కూడా ఏ ప్రమాదం ఉండదు... తద్వారా మనకొచ్చే

లాభాల్లోనూ ప్రాజెక్టులోనూ ఏ ప్రమాదం ఉండదు. అంతేకాదు... కొన్ని వందల ఎకరాలో... వేల ఎకరాలో ఉంది కనుక మనం... మన పిల్లలూ వంశపారంపర్యంగా గుత్తకు తీసుకుంటే, అంటే పేటెంట్ రైట్స్ మనమే తీసుకుంటే హాయిగా తరాలు గడుస్తాయి" ముక్తాయింపుగా అన్నాడు నిట్టూరుస్తూ, ఆనందంగా.

"సర్లే.... యింక ఆ పనుల్లో నువ్వుండు... నేను ప్లాన్లు బుకింగ్‌లూ, కన్‌స్ట్రక్షన్... గట్రా గట్రా పనుల్లో ఉంటాను.

"కృష్ణలో ఓ మునుగు మునిగితేనే బోల్డు పుణ్యం పురుషార్థం అని మురిసిపోయే జనాలున్న మనకు అలాంటి పవిత్ర స్థలంలో ఏకంగా యిల్లుకట్టి... నివాసం అంటే క్యూలు కట్టరూ.." మన జనం" రేపెంతయనా..."

కొసమెరుపు : అరెభాయ్ అన్నట్లు యిది రాష్ట్ర ప్రభుత్వంతో అసైన్‌మెంటు కదా, దాని కంత స్థోమత (ఆర్థికంగా) ఎటూ ఉండదు కనుక.... అనివార్యంగా ప్రపంచ బ్యాంకు సహాయ సహకారాలు అర్థిస్తుంది. తద్వారా ప్రపంచ బ్యాంకు దృష్టిలో ఈ ప్రాజెక్టు పడటం.... గోవిందా... గోవిందా.... అయ్యయ్యో దేశం నిండా ఎన్నెన్ని నదులున్నాయ్... అందులో నీళ్ళున్నవి... లేనివి... అయినా మన పిచ్చికానీ నీళ్ళు ఎండగట్టడం ఎంతలో పని... కాబట్టి మన తక్షణ కర్తవ్యం, పరిస్థితులు చెయ్యిదాటిపో(నీ)కుండా తప్పనిసరిగా ఈ ప్రాజెక్టు.

"పేటెంట్ హక్కులు ఫలానా వారివి"గా తప్పక రిజిష్టరు చేయించుకోవాల్సిందే సుమా"

---

## బురఖా

**సయ్యద్ ఖుర్షీద్**



మా తోబుట్టువుగా
పుట్టిన పాపానికి నీపై
మతం ముద్ర పడింది!
నీ ఈడు పిల్లలు స్వేచ్ఛగా
తిరగాడుతుంటే
'బురఖా' నీతోడైంది!!
రంగురంగుల సీతాకోకచిలుకల
మధ్య నిన్నూ
ఓ నిరసన జెండాగా చేసింది!!!
'సతి'ని వ్యతిరేకించే పెద్దలే
మతం మాటున నిన్ను
చీకటితో చెలిమి చేయమంటే
చేతులు ముడుకున్నాం!
బురఖా లేకుండా నిన్ను
బయటికి రాకుండా చేయాలని
చూస్తుంటే భరించకపోరు చేయమంటున్నాం

## పునాదులు

**బి. ఇందిర**



మాటలు వచ్చీరానమ్మాయి
ముదురు మాటలు మాట్లాడుతూంది!
'నేను నాన కూతుర్నేనా' అంటూంది

వయసొచ్చీరాని కూతురు
తన రంగూ - జుట్టే సర్వస్వమని
తెగ హైరానా పడుతూంది!

ఇక ఇల్లాలైతే చిక్కటి కాఫీతోటే
భర్తను కట్టిపడేయాలని చూస్తుంది!

అంతా మీడియా మాయ -
'మనకూ మెదడుంది'
అదెవ్వరూ గుర్తు చెయ్యరు!
అమ్మో! మరి అనాదిగా వేసిన
పునాదులు కదిలిపోవూ!?

---

## గాలం

**రవికుమార్**

నేను సాధారణ గుమస్తాను
రెండు పూటల కడుపు నిండటమే
'సంపూర్ణ స్వాతంత్ర్యం' నాకు
లెక్కలు వ్రాసే వాణ్ణి... 2
ఆ లెక్కల్లో యజమానులకు
కోట్లు - కోట్లు దాచేవాణ్ణి

॥నేను॥

ఖాళీ దొరికితే పాపం
తూచే త్రాసులోని ముల్లు
నా చేతులు గారడితో మాయచేస్తేనే
నలుపు కళ్ళద్దాల వెనుక యజమాని కళ్ళు
చలువ చేస్తాయి
లేకుంటే చింత నిప్పులవుతాయి

॥నేను॥

నా బ్రతుకు బండిలాగే చిల్లు రూపాయి కోసం
సరుకులన్న భద్రంగా దాస్తా... కల్తీ చేస్తా
ఇన్‌కామ్ టాక్స్‌కి ఎగనామం పెట్టేస్తా..
రోజురోజుకు మేడల మీద మేడలవుతాయి...2
బాధ్యతలు పెరిగి నా భుజాల మీద
మోయలేని భారములవుతాయి

॥నేను॥

వ్రాసి వ్రాసి చేతులు - తూచి తూచి నడుములు
బక్కచిక్కి బొక్కలు తేలి బలహీనమవుతాయి
బలసిన యజమాని...2
మా కష్టం నుండి పిండుకొన్న నోట్లకట్టలు మోయలేక
పాట్లు పడుతూ... చిరిగిన అర్థాకలి నోట్లతో
నా జీవిత కాల శ్రమకు 'చెల్లుచీటి' వ్రాసి
చేతికందొచ్చే బుడ్డోడి మెడకు
'గాలం' వేస్తాడు

॥నేను॥

# సమీక్షా పర్వం

- ✦ పక్షి
- ✦ వలస బతుకులు
- ✦ నాయుడుబావ పాటలు
- ✦ ముద్రబల్ల
- ✦ వానచూపు
- ✦ ఒక పొట్టివాడూ కొందరు పొడవు వాళ్ళ కథ
- ✦ అలవోకలు
- ✦ వీరగల్లు స్వామి కథలు
- ✦ జలస్వప్నం
- ✦ పొద్దుపూసింది
- ✦ సాయిబు
- ✦ నగరంలో నగ్నసత్యాలు

మణి

## పక్షి



"వాడెంత మేధావి అయినాగానీ పండితుడయినాగానీ శాస్త్రజ్ఞుడయినాగానీ రాజకీయ నాయకుడయినాగానీ సంస్కర్త అయినాగానీ సాహితీ వేత్తయినాగానీ దేశాధినేత అయినాగానీ ఆడదాని ఉసురు పోసుకోకుండా ఏ మగాడూ ఈ భూమండలం మీద యింకా పుట్టలేదు.

శ్రీమతి ప్రతిమ రాసిన పక్షి కథా సంపుటిలో కథలన్నిటా ఆడవాళ్ళ ఉసురు పోసుకున్న మగవాళ్ళే కనిపిస్తారు. మూక్కొంచెం నమ్మక మివ్వండి కథలో భారతితో లోపలి భారతి ఘర్షణ పడుతూనే ఉంటుంది.

కథలో పరిష్కారం కాస్త అతిశయోక్తిగా అనిపించినా అంతిమంగా సంపుటి సారాంశంతో రచయిత్రి ఆశిస్తున్నది మాత్రం ఆ రకమయిన చైతన్యమేనని స్పష్టమవుతుంది.

భారతి మామ వేళకి కేరియర్ అందించలేదని అలిగి డ్యూటీకి వెళ్ళిపోతాడు. భర్త అయ్యప్ప మాల వేసుకునే సమయంలో భారతి బయటుండవలసి వచ్చినందుకు పుట్టింటికి తరిమి వేయబడుతుంది. చివరకు కొడుకు కూడా నువ్వెప్పుడూ లేటేనమ్మ అని తల్లిని నిందిస్తాడు. ఉదయం సమయం ఆడవాళ్ళ పాలిట ఒక గండం. ఆ సమయం గడిచిపోతే చాలు. అన్ని అమర్చిపెడితే అందరూ అనుభవించేవాళ్ళేగానీ ఒక్కరూ సహకరించరు సరికదా తిరిగి నిందిస్తారు. ఇలాంటి వాతావరణంలో పెరిగిన పిల్లవాడు మరెలా మాట్లాడతాడు?

ఇల్లాలి సుఖంలో సుఖవేణి ఆడదిక్కులేని అన్న కుటుంబాన్ని తన కుటుంబాన్ని సంరక్షిస్తూ సాకుతూ పుట్టింటికీ, అత్తింటికీ మధ్య కండెలా తిరుగుతూ ఉంటుంది. అలాంటి సుఖవేణి అవసాన దశలో ధరనించి సరయిన ఆదరణలేక మంచాన పడుతుంది. తనకు తల్లిలేని లోటు తీర్చిన మేనత్తని వైద్యం నిమిత్తం. తన యింటికి తీసుకెల్తానంటే సుఖవేణి భర్తా అంగీకరించడు. తన భర్తా ఒప్పుకోడు.

నెత్తుటి గులాబిలో తేజ మెంటల్లీ రి టార్టెడ్ వాడిని కన్నందుకు భార్యని పుట్టింట్లోనే వదిలేస్తాడు భర్త. అప్పుడప్పుడూ వచ్చిపోతుంటాడు కానీ కొడుకుని మాత్రం దగ్గరకి తీసుకోడు. భార్య అడిగితే ఏవేవో సాకులు చెప్పి తప్పించుకుంటాడు.

శిథిలాలులో చిన్న భర్త స్త్రీని ప్రాణమున్న వ్యక్తిగా కాక ఇంట్లోని మిగిలిన అన్ని విలాస వస్తువులతో సమానంగా చూసే భాగ్యశాలి. భార్య ఆధిక్యతని భరించలేని ఆత్మన్యూనతగల వ్యక్తి.

"ఈ జీవితం మనది. దీన్నుండి మనం పారిపోవడానికి ప్రయత్నిస్తాం. కానీ అది మనల్ని వదలదు వ్యక్తి తన పుట్టుక నుండి చివరి శ్వాస వరకు అతని సంపూర్ణ క్రియలకు అతడి జీవితం సమాధానం అవుతుంది. మరెందుకు మనం పారిపోవడానికి ప్రయత్నించడం" జి.కె. ఫిలాసఫీలోని ఈ వాక్యాన్ని కథగా విస్తరించే ప్రయత్నమే నాన్నకో ఉత్తరం. బాధ్యతల నుంచి తప్పించుకోవాలనుకునే తండ్రికి కర్తవ్యాన్ని గుర్తు చేస్తూ కూతురు ఉత్తరం రాస్తుంది. "నాన్నా కూతురు గర్భవతి అని తెలిస్తే కూడా సంతోషించడానికి డబ్బుతెర అడ్డుమొస్తుందా. నాన్నా మధ్యతరగతి తల్లితండ్రులకి" అని కారణం కూడా తనే చెప్పినా "సారెపెట్టి పురుడు పోయాల్సిన బాధ్యత నీది" అని రాస్తుంది. 'గతుకు'లో చెంగయ్య రిక్షాలో హెడ్ గంగయ్య టివిని రిపేరు చేయడానికి తీసుకెల్తాడు. మధ్యలో రిక్షా తిరగబడి టి.వి. పగిలిపోతుంది. హెడ్డు కోపంతో చెంగయ్యని స్టేషన్‌లో బందిస్తాడు. అతని గురించి భార్య రంగమ్మ వస్తుంది. రంగమ్మ చెయ్యి

పట్టుకుని అసభ్యకరంగా ప్రవర్తిస్తాడు.

ఈ కథల్లో స్త్రీలకు మగవాళ్ళు మాత్రమే శత్రువులు కారు స్త్రీల మధ్యనే శత్రుత్వం చూపే సన్నివేశాలు సందర్భాలూ ఉన్నాయి. మాక్కొంచెం నమ్మకమివ్వండిలో భారతి ఆడపడుచు, అత్త యిద్దరూ భారతిని సతాయిస్తారు. బయటుండమనేది ప్రకృతి సిద్ధమయిన ఒక చర్య, తోటిస్త్రీగా ఈ విషయం అత్త అర్థం చేసుకోకుండా తిరిగి పని ఎగ్గొట్టడానికే ఈ సమయంలో బయటుందని నిందిస్తుంది. నెత్తుటి గులాబిలో ప్రత్యూష యిద్దరు అమ్మాయిలు పుట్టిన తరువాత ఆపరేషన్ చేయించుకుంటానంటుంది. కాని అత్త ఒప్పుకోదు. వంశాంకురం లేకపోతే కుదరదని తనకు కూడా యిద్దరమ్మయిల తరువాతే అబ్బాయి పుట్టాడని కనితీరవలసిందే అంటుంది. ఫలితంగా మెంటల్లీ రిటార్డెడ్ తేజ పుడతాడు అది కూడా ప్రత్యూష తప్పేనంటుంది. అత్తగారు అటు ఏడు తరాలు ఇటు ఏడు తరాలు నీ వంశాల్లో ఇలాంటి వాళ్ళు పుట్టలేని అది నీ వంశం నుంచి వచ్చిన వారసత్వమేనంటుంది. అక్క ఈగ కథలో ఇద్దరి అక్క చెల్లెళ్ళకూ ఒకడే భర్తగా చలాయించడంవల్ల వారిద్దరి మధ్య ఉన్న రక్తసంబంధంలో ప్రచ్ఛన్న శత్రుత్వం కొనసాగుతుంది. అక్క చెల్లెళ్ళను సవతులను చేసి వారి మధ్య చిచ్చుపెట్టి హాయిగా చలికాగుతూ సుఖపడుతున్నది మగవాడు. వీటన్నింటికీ మూలాలు పితృస్వామిక, కుటుంబ వ్యవస్థలో ఉన్నాయి. తల్లి, భార్య, చెల్లెలు, ఈ స్త్రీలంతా ఒకే కప్పు కింద కలహించుకుంటూ మగవాడి మీద ఆధారపడి పరాధీనంగా బతుకుతూ జీవిస్తారు. ఇందువల్ల స్త్రీలు కుటుంబంలో తమపై పీడనకు అసలు కారణం గుర్తించకుండా ఎదుట కనబడే కారణంతో తోటి స్త్రీలతో అనవసరంగా కలహిస్తూ తమ కర్మకు తమను విధిని నిందించుకుంటూ బతికే స్థితి ఏర్పడుతుంది. ఇది పురుషాధిక్యతతో కూడిన పితృస్వామిక కుటుంబ వ్యవస్థ యథా ప్రకారం కొనసాగడానికే ఉపయోగపడుతుంది.

గంగాజాతర, రాచపుండు కథలు రాజకీయ నేపథ్యంగల స్త్రీల జీవితానికి సంబంధించిన కథలు. వారసులు, బంధువులు మధ్య జరుగుతున్న ఎన్నికల పోరులో చివరకు స్త్రీలే సమిధలవుతున్నారు. అటు తోడబుట్టినవాడికి ఇటు కట్టుకున్న వాడికి జరగబోయే రణరంగంలో రాజేశ్వరి చిగురుటాకులా అల్లల్లాడిపోతుంది. చివరకు ఆమె ప్రాణత్యాగం కూడా ఏ మార్పు తీసుకురాలేకపోతుంది. ఆమె ఆత్మహత్యతో ఆ యింటిలో ఆవహించిన వైరాగ్యం భర్త అనుచరగణం మోసుకొచ్చిన జయజయ ధ్వనాల మధ్య పటాపంచలైపోతుంది.

గంగజాతర ఆధునిక స్త్రీ రాజకీయ రంగంలో రాణించడానికి కావలసిన ఆత్మ విశ్వాసాన్ని అందే కథ రాజకీయరంగంలో మహిళలకున్న రిజర్వేషన్లను వారిని సద్వినియోగం చేసుకోనీయకుండా స్త్రీలని కేవలం కీలు బొమ్మలుగా చేసుకొని అధికారం చెలాయించే పురుషులకి చెంపపెట్టు గంగజాతరలో మాధవి ఎన్నికలలో గెలిచాకా పంచాయితీ ఆఫీసుకు ఆమె వెళ్ళవలసిన అవసరం లేకుండా ఇంటి దగ్గరే అన్ని పనులు చక్కదిద్దుకోవచ్చునని నిర్ణయానికి వస్తారు. కానీ మాధవి మరుసటి రోజు కొత్త వెలుతురులోకి వెళుతున్నట్టుగా ఆమె ఆఫీసుకు బయలుదేరుతుంది. వెన్నెముకగల స్త్రీ కథ గంగజాతర.

అక్క ఈగ, ఈవే మళ్ళీ చచ్చిపోయింది. వస్తుపరంగానే కాకుండా శిల్పపరంగా కూడా చాలా పరిణితి చెందిన కథలు. ఏకబిగిన చదివించే గుణం ఈ కథల ప్రత్యేకత. రెండు కథల్లోనూ పురుషుడివల్ల సమస్యల్లో చిక్కుకున్న స్త్రీల జీవితాలే కావడం విశేషం.

ప్రపంచీకరణ ఫలితంగా పల్లెల్లోనూ మానవసంబంధాల్లోనూ వస్తున్న మార్పుల్ని విశ్లేషించే పని చేశాయి బతుకుబంగారం, జాగారం, పొదరిల్లు హలాహలం, సాలెగూడు కథలు.

సరళీకృత ఆర్థిక విధానాల ఫలితంగా నేల తల్లిని నమ్ముకున్న రైతు పంట చేతికి రాక అప్పు తీర్చేమార్గంలేక ఆత్మహత్య చేసుకుంటాడు. గ్లోబలైజేషన్ నేపథ్యంలో వచ్చిన మరో కథ సాలెగూడు. సరుకులు కొనుక్కోడానికి సొమ్ములేక ఉత్పత్తి చేసే సరుకుని అమ్ముకోడానికి అవకాశం లేక మారిన వ్యాపార మార్గాల్లో బతికే మార్గం లేక ఒక చేనేత కుటుంబం ఎలా విచ్ఛిన్నమైపోయిందో తెలియజేస్తుంది. ఈ సంపుటిలో యింకా సర్పదోషం, అడవిలో మొక్క పక్షి వంటి మంచి కథలున్నాయి.

ఇంచుమించు అన్ని కథలూ స్త్రీల జీవితాల చుట్టూ అల్లుకున్నదే అయినా సరే మొనాటనీ లేకుండా వివిధ కోణాల్లో విలక్షణమయిన శిల్పంతో చెప్పడంవల్ల పాఠకులకు చదువుతున్న కొద్దీ ఆసక్తిని కలిగిస్తాయి. కథలన్నీ సహజత్వంలోంచి మొలుచుకొచ్చినవి కావడంవల్ల పాఠకులు ఏదో ఒక బాట తప్పక ఐడింటిఫై అవుతారు. స్త్రీ దృక్కోణం నుంచి జీవిత స్పర్శను దర్శించేందుకు దోహదం చేసే కథలివి. **(పక్షి; రచయిత్రి : వి. ప్రతిమ; వెల:రు.50/–; పేజీలు :190; ప్రతులకు :విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, నవోదయ పబ్లిషింగ్ హౌస్; దిశ పుస్తక కేంద్రం; నవోదయ బుక్‌హౌస్; మణి బుక్‌స్టాల్)**

మొలకలపల్లి కోటేశ్వరరావు

# విదేశీయ వలస బతుకుల గోస




ఇవ్వాళ తెలుగు సాహిత్యంలో జన జీవితంలోనికి చొచ్చుకుపోయి వాస్తవికాంశాలతో శక్తిమంతంగా, విస్తృతంగా కథలు రాస్తున్న ఇద్దరు ముగ్గురు రచయితలలో పెద్దింటి అశోక్‌కుమార్ ఒకరు. బతుకు తెరువు కోసం మస్కట్, దుబాయ్ పోతున్న వారి బతుకు వేదనలతో ఆయన రాసిన తొమ్మిది కథల సంకలనం 'వలసబతుకులు' ఈ కథలు అన్నీ వలసకి సంబంధించిన నేపథ్యంలో వచ్చినవే.

యాదవ్వ ఒక్కగానొక్క కొడుకు నారాయణ. బిడ్డకు రెండేళ్ళ వయసప్పుడే యాదవ్వ పెనిమిటిని పోగొట్టుకుంది. మొగతోడులేని యాదవ్వని పాలివాళ్ళు ఎన్నో కష్టాలు పెట్టారు. అన్నిటినీ ఎదుర్కొని, కూలికి పోయి, ఇద్దరి మనుషులను పెట్టుకొని పని చేస్తూ రెండెకరాలు పొలం సంపాదించుకుంది. మేనపిల్లతో కొడుక్కి లగ్గం జేసింది. ఇద్దరు మనుమలు కలిగారు. దుబాయ్ పోవటానికి నారాయణ సన్నద్ధమవుతాడు. యాదవ్వ ఒప్పుకోదు. తల్లిమాటకాదని, ఉన్న రెండెకరాలు బేరం పెడతాడు. తల్లి వద్దంటున్నా, వప్పించి, పొలం అమ్మి, ఏజంట్‌కి చెల్లించి దుబాయ్ వెళ్తాడు. అలా వెళ్ళిన నారాయణ మూడు నెలలకే గోడకి కొట్టిన బంతిలా తిరిగొస్తాడు. అమ్మమాట విననందుకూ, రెండెకరాల పొలం అమ్మి పోగొట్టుకున్నందుకూ బాధపడుతున్న కొడుకుని ఓదార్చడం 'కన్నతల్లి' కథ.

అప్పుచేసి భార్యా బిడ్డల్ని వదిలి దుబాయ్, అటునించి మస్కట్ వెళ్తాడు ముత్యం. రెండుచోట్లా ఎన్నో మోసాలకి బలవుతాడు. అష్టకష్టాలు

పడుతుంటాడు. ఇక్కడ బిడ్డ లగ్గమౌతుంది. తల్లీ, భార్యాబిడ్డలు డబ్బు పంపిస్తాడని ఎదురుచూస్తుంటారు. కానీ అక్కడ అతని బతుకే దుర్భరం. అతనే అవస్తలు పడుతుంటే, మిత్రుడు మస్కట్ వస్తున్నాననీ, రిసీవ్ చేసుకోవడానికి ఎయిర్‌పోర్ట్‌కి రమ్మనీ ఉత్తరం రాస్తాడు. చక్రభ్రమణంలా ఇది ఆగని వలసని 'వలసబతుకులు' కథ చెపుతుంది.

లింగం కొడుకు ప్రభాకర్. మస్కట్‌కి వెళ్ళి డబ్బు పంపిస్తుంటాడు. ఆ డబ్బుతో తమ్ముళ్ళిద్దరి చదువులూ, ఉద్యోగస్తుడితో చెల్లి పెళ్ళీ అవుతుంది. మస్కట్ నించి డబ్బు వస్తోంది కాబట్టి వీళ్ళు ఇంకా పెద్ద పెద్ద కోరికలతో వుంటారు. అందుకు తండ్రి లింగం తిరస్కరిస్తాడు. ఆయన కూడా గల్ఫ్ వెళ్ళి సంపాదించినవాడే. తన తమ్ముడితో తనకి కలిగిన అనుభవాలతో, తన కొడుకు ప్రభాకర్‌కి అలా జరక్కూడదనే వుద్దేశంతో అతని కష్టార్జితం. అతను పంపిస్తున్న సొమ్ము అతని పేరుతోనే బ్యాంక్‌లో వేస్తాననీ, దాని మీద ఎవరికీ హక్కులేదని తేల్చి చెపుతాడు. ఇది మిగతా పిల్లలకి బాధ కలిగిస్తుంది. 'నాయిన్న' కథ ఇది.

భర్త మస్కట్ పోయి డబ్బు, విలాస వస్తువులు పంపిస్తుండటంతో వాటిని చూసి సుజాత మీద ఇరుగుపొరుగు ఈర్ష్య పడతారు. ఆమెకి అక్రమ సంబంధం అంటకడతారు. అత్తమామలూ వాళ్ళతో కలుస్తారు. కొందరు సుజాత చనిపోయిందని భర్తకి టెలిగ్రాం ఇచ్చి అతన్ని రప్పిస్తారు. అతనికి చాలా చాడీలు చెపుతారు. కానీ అతను వాళ్ళ మాటలు నమ్మకుండా భార్యని కడిగిన ముత్యమంటూ ప్రేమతో దగ్గరికి తీసుకోవటం 'ఘర్షణ' ఇతివృత్తం.

ఫారిన్ నించి గొల్ల గోపాల్ బాగా డబ్బు సంపాదించి తెస్తాడు. ఇక అతనికి వూళ్ళో పెద్ద కులపోళ్ళ నించీ చిన్న కులపోళ్ళ వరకూ బ్రహ్మరథం పడతారు. ఈ హారతులకి మురిసిపోయిన గోపాల్ వాళ్ళకి విలాసంగా ఖర్చు పెడుతుంటాడు. భార్యా, బామ్మర్ది వారిస్తున్నా వినుకోడు. బడాయికిపోయి పొలం, ట్రాక్టర్‌కొని నష్టపోతాడు. డబ్బు మొత్తంపోతుంది. యథాస్థితి, పేదస్థితి మళ్ళీ, డబ్బు కోసం తిరిగి మస్కట్ పయనమవుతాడు. ఆ 'అమాయకుడు' కథ ఇది.

వీసా కోసం అంజయ్య అప్పు చేసి మస్కట్ వెళ్తాడు. అక్కడ ఓటీలు చేసీ, రెక్కలు ముక్కలు చేసుకునీ డబ్బు సంపాదిస్తాడు. మూడేళ్ళకి తిరిగి వస్తాడు. అతని ఈ మూడేళ్ళ సంపాదన మస్కట్ వెళ్ళడానికి చేసిన అప్పుకీ, వడ్డీలకీ సరిపోతుంది. చివరికి రిక్తహస్తాలే మిగులుతాయి. ఇది 'బంగారువడ్డీ'.

వీసాపేరుతో నర్సింల్ని మోసం చేస్తాడు రాజు అనే ఏజెంట్. నాలుగుసార్లు బొంబాయి చుట్టూ తిప్పుతాడు. వీసాకి చేసిన అప్పు కోసం ఉన్న రెండెకరాల్లో ఎకరంన్నర అమ్ముకుంటాడు. నర్సింలు. మిగతా అర ఎకరం పంట వడగళ్ళ వాన పడి నాశనం అవుతుంది. తిండికి లేని దుస్థితి. రాజు ఊళ్ళో ఇంకా చాలా మందిని మోసం చేస్తాడు. వాళ్ళందరూ తన్నడానికి రాజు వెంటపడితే అతని కారణంగా దెబ్బతిన్న నర్సింలు అతన్ని రక్షించి వూరు దాటిస్తాడు. 'మోసగాడు' కథాంశం ఇది.

పల్లవి భర్త మస్కట్ వెళ్ళి మరణిస్తాడు. ఆమె ఒంటరిగా బిడ్డని సాక్కుంటోంది. రెండేళ్ళుగా పరిచయమైన మురళి, పల్లవిని తన జీవితంలోనికి ఆహ్వానిస్తాడు. ఆలోచించుకున్న పల్లవి మురళితో వెళ్ళడానికి నిశ్చయించుకుంటుంది. ఇంతలో హఠాత్తుగా మరణించాడనుకున్న భర్త దిగుతాడు. అతడు అనుమాన పిశాచి. పల్లవిని చాలా హింసించేవాడు. అతనితో చాలా ఇబ్బందులు పడుతుంది. ఇదంతా గతం. తను చాలా మారిపోయాననీ, క్షమించమనీ వేడుకుంటాడు. అతనికి ఎయిడ్స్ సంక్రమిస్తుంది. భార్య కూడా సుఖపడకూడదనీ, ఆమెకీ ఆ జబ్బు అంటించాలనే కసితోనే అతను వచ్చింది. హీనుడైన ఆ భర్తతో వుండాలా, మురళితో వెళ్ళాలా అని ఆమె సందిగ్ధంలో పడి, చివరికి భర్తతోనే వుండాలని నిశ్చయించుకుంటుంది. భార్య మంచితనానికి అతను లొంగిపోయి ఆమెని అంటుకోకుండానే వెళ్ళిపోతాడు. ఇది 'తిరిగిరాని యవ్వనం'.

సత్యం జనాలను గల్ఫ్ పంపించే ఏజెంట్. భార్య శ్రీలతకి ఇది ఇష్టముండదు. అతని పనిని వ్యతిరేకిస్తుంది. కొంత మంది దగ్గర సత్యం వీసాలకి డబ్బు తీసుకుని బొంబాయి వెళ్తాడు. అక్కడి ఏజెంట్ సత్యాన్నీ మోసగిస్తాడు. ఇతను ఊళ్ళో అడుగు పెట్టలేని పరిస్థితి ఏర్పడుతుంది. వీసాల కోసం పొలం అమ్మి, పెద్ద వడ్డీలకి అప్పులు చేసి ఇక్కడ జనం విలవిల్లాడుతుంటారు. శ్రీలత తమ కారణంగా ఎవరూ నష్టపోకూడదని ఇల్లు, నగలు, పొలం సమస్తం అమ్మేసి ఎవరి డబ్బు వాళ్ళకి ఇవ్వడానికి నిశ్చయించుకుంటుంది. 'దగా' కథ ఇది.

ఈ కథలు అన్నీ వలస ఆధారంగా రాసినవి కాబట్టి అక్కడక్కడా చిన్న చిన్న ఘటనలు పునరావృతమైనా వేటికవే విభిన్నమైన కథలు. సజీవ పాత్ర చిత్రణతో కథలు అన్నీ విలక్షణంగా వున్నాయి. 15 పేజీల బి.ఎస్. రాములు ముందుమాట అదనం. గతంలో వచ్చిన రచయిత సంకలనం 'ఊటబాయి' మీద వివిధ పత్రికల్లో వచ్చిన సమీక్షలు కూడా ఇందులో వున్నాయి. కథా సాహిత్యాభిమానులు అందరూ తప్పక చదవవలసిన సంకలనం ఇది. ధర కూడా తక్కువే. **(వలసబతుకులు, పెద్దింటి అశోక్‌కుమార్ కథలు, ప్రచురణ, ప్రతులకు : విశాల సాహిత్య అకాడమి, 2-2-186/53/5, రామకృష్ణనగర్, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్-13, పేజీలు-91, ధర: రు.30/-)**

అమ్మిన శ్రీనివాసరాజు




# ప్రయోజనకరంగా నాయుడుబావ పాటలు

ఆంధ్ర సాహితీవనంలో విరబూసిన వివిధ ప్రక్రియా సుమాలన్నిటా ప్రసిద్ధి చెంది పండితుని నుండి పామరుని వరకూ ఆకర్షించే ప్రతిభ 'పాటకే సొంతం.

పాట వినడానికి ఎలాంటి సాహితీ ప్రతిభ పరిశీలన అవసరంలేదుగాని రాయడానికి రెండిటితోపాటు సాహిత్య అనుభవం వుంటే పసిడికి పన్నీరు పూసినట్లుంటుంది. ఈ విషయంలో ఎవ్వరు ఏ విధంగా స్పందించినా సాధనాల రాసిన నాయుడు బావ పాటలు చదివినా విన్నా తప్పక ఈ అభిప్రాయాన్ని ఒప్పుకోకతప్పదు.

సాహితీ-సంగీత సాధనాపరుడైన "సాదనాల వేంకటస్వామి నాయుడు" రాసిన అనేక పాటల్లో ఆయన ఎంచుకున్న 71 పాటలతో కూడిన ఈ పుస్తకంలోని పాటలు మాత్రం వేటికవే వేరుగా వున్నాయి. ఇందులో లలిత గీతాలు, జానపద గేయాలు, అక్షరాస్యత గీతాలు దేశభక్తి గేయాలు. అని నాలుగు భాగాలుగా భాగించారు. లాలిత్యానికి చిరునామాలైన లలిత గీతాల్లో అలతి అలతి పదాలతో మరువలేని మాధుర్యం నింపిన వైనం "చూపు చూపుకోభాష" పాటలో అగుపిస్తుంది. మనిషిని మహితోత్తముడ్ని చేసిన "భాష" గొప్పదనాన్ని చాటే పాటే ఇది.

సృష్టిలోని అద్భుతశక్తి "అమ్మ". అమ్మలోని కమ్మదనాన్ని "చందమామ"తో తీర్చిదిద్దిన ఈ పాట ఎంతో హృద్యంగా వుంది. అలాగే అమ్మమనసు కూడా! ప్రకృతమ్మ ప్రీతిబంధకాలైన గోదావరి, వెన్నెల, పల్లె సోయగం, దీపావళి, హోళీ, సంబరాలు. మాత్రమేగాక మానవతకు ప్రతీకైన వైద్యసేవకి (నర్స్) సేవల రూపాన్ని పాటగా మలచిన తీరు అత్యద్భుతం.

"స్వేచ్ఛాగీతికలా, ఓ శ్వేత కపోతిలా/ రోగుల మధ్య విహరించే రాగమయీ.."

"మందహాసాల మందులనిస్తావు/ మమతల పూతను చల్లగ పూస్తావు...." అంటూ

సాగిన ఆ పాటలోని ఈ పదాలు సాధనాల పరిశీలనా ప్రతిభకు ప్రతిరూపం

నిజంగా జానపద గేయాలకు రచయితలంటూ ప్రత్యేకంగా వుండరు కాని ఆ బాణీలు పల్లె జనావళికి జావళీలు. అందుకే ఆ భాణీలను జతగట్టి "జానపదగేయాలు"గా రాసారు. బాణీల ప్రస్తావన పక్కకు పెడితే ఆ భావాల మధురిమ మంత్ర ముగ్ధంగా వుంటుంది. "రాజమండ్రి చినవాడా" "సిక్కడపల్లి సిన్నదాన" "అంటుమామిడితోటకాడ" లాంటి పాటల్లోని రాగభావాల సరసపల్లాపాలు చదివిపాడుకోవాలేగాని ఆ అనుభూతే అమోఘం.

నిండైన భావస్ఫూర్తితో మెండైన రాగపరిమళాలు రంగరించుకుని వెలువడిన సిసలైన దేశభక్తి గేయాలు ప్రతి పౌరునికీ అత్యవసరం అనిపిస్తుంది. వీటిలో నెహ్రూ, సర్వేపల్లి, కందుకూరి, టంగుటూరి వంటి మహనీయులను కీర్తిస్తూనే. ఉగ్రవాద ఉన్మాదం"పై విరుచుకుపడిన రచయిత శాంతిశీలత. దేశభక్తి కళ్లముందు కదలాడుతుంది.

సముద్రమంతటి నిండైన సంపద. చదువుకున్న శక్తిని చాటిన అక్షరాస్యతాగీతాలు నాలుగే అయినా అనంత కోటి విద్యా విలువల కాంతులు అందిస్తూ ఆలోచింపజేస్తాయి.

ఈ పుస్తకంలోని అందమైన పాటలకు ముచ్చటైన "బాపు" ముఖచిత్రం మరింత నిండుదనాన్నిచ్చి సాహితీ ప్రియులను మరెంతో ఆకర్షిస్తుంది. అనడంలో అతిశయంలేదు.

**(రచయిత సాదనాల వెంకటస్వామి నాయుడు, పేజీలు : 80, వెల : రు.25/- ప్రతులకు : హిమకర్ పబ్లికేషన్, 79-2-3, ప్రశాంతి ఎస్టేట్, తిలక్‌రోడ్, రాజమండ్రి-533 103)**

---

మొహీబుల్లాఖాన్




# పుడమి తల్లి మెతుకు పాటకు కవిత్వరూపం

ఇప్పుడు నడుస్తున్నది దీర్ఘకావ్యాల కాలం. ఈ కోవలో తన దీర్ఘ కవిత "ముద్రబల్ల" ద్వారా అస్తిత్వాన్ని ఏర్పరచుకున్న కవి దాట్ల దేవదానం రాజుగారు. రైతునీ, రైతు సమస్యల్నీ తన దీర్ఘ కవితలో స్పృశించారు కవి. "ముద్రబల్ల" అన్న శీర్షికలోనే కవి యొక్క రైతాంగ నేపథ్యం కనబడుతుంది మనకు "ముద్రబల్ల" అంటే పంట కుప్ప నూర్చాక కుప్ప చుట్టూ వేసే సెక్యూరిటీ సీల్ అన్నమాట. ఈ సీల్ చెదిరితే ధాన్యం దొంగిలింపబడ్డట్టు లెక్క

రైతంటే ఎవరో చెబుతూ కవి

"రైతంటే
నెర్రెలిడిన నేలలో ఊపిరి దాచి
మట్టి పొరల మధ్య సారాన్ని వెదికే వాడు
లోలోతుల్లోంచి గాయాలు తడుముకుని
నేలఒడిలో శ్రమని భద్రపరిచేవాడు"

మట్టిలో తన ఊపిరి (ఉనికి) దాచి, తనుకాగి, నిశ్శబ్ద ప్రవచనమై సామూహిక వ్యధకి ప్రతినిధి రైతు అంటారు. మట్టి (తన పొలం) తన సర్వస్వమని మనసా, వాచా, కర్మణా నమ్మి ఆరుగాలం శ్రమించి అందులోనే ఆత్మతృప్తిని పొందుతాడు రైతు. తనెంత భంగపడ్డా ఆశా లేపనంతో తన భంగపాటుని కప్పిపుచ్చుకుని తిరిగి మట్టిని శ్వాసిస్తాడు రైతు.

"లేళ్ళ మెరకలో

దుక్కప్పుడు పెళ్ళికదా
అప్పుడే పిల్లలా అని
ఆశ్చర్యపోయేంత అమాయకత్వం"

తన కాళ్ళు చేతుల్ని శ్రమకి పాదులుగా, తన చెమటని ఫలసాయంగా మార్చుకుని తనకంటి కొసని ఆశల చూపుల్ని మెరిపించుకుంటాడు రైతు. దీనిలో రైతు నిరంతరం ఆశావహ దృక్పథం కనబడుతుంది.

"చూపుల సూదులతో గుచ్చడమెందుకని
చెయ్యి అడ్డం పెట్టుకుని
ఆకాశంకేసి చూస్తున్న వాడా
పీలికలుగా చిరిగిన గుడ్డలు అల్లడం కోసం
చినుకుండారాల కోసం
ఎదురు చూస్తున్నావా!

తనెప్పుడూ నిరాశపరిచే ఆకాశాన్ని అంతకంటే తీక్షణంగా (నిరాశగా) చూడడం ఎందుకని చెయ్యి అడ్డంపెట్టుకుని ఆకాశాన్ని చూస్తాడు రైతు. వర్షాభావంవల్ల సరిగా ఎదగని పైరుని గుడ్డ పీలికలుగా అభివర్ణిస్తూ, వాటిని కుట్టడం కోసం చినుకుండారాల కోసం రైతు ఎదురు చూస్తున్నాడని అనడంలో మంచి అభివ్యక్తి ఉంది. తనెప్పుడూ దగా పడుతూ పిగిలిన వస్త్రమై, ఋతువుల్ని భారంగా దొర్లించడం కనబడుతుంది. మనకు దీంట్లో

"రొయ్యల్లా మీసాలు మెలేసి
కాసుల కోసం
తలలు నరుక్కుంటున్నాడు"

స్వల్పలాభాల కోసం దీర్ఘకాలిక ప్రయోజనాల్లో రైతు ఎలా స్వయంగా చేజార్చుకుంటున్నాడో చూడవచ్చు. రొయ్యల చెరువుల్లో లాభాలు వెంటనే ఇబ్బడి ముబ్బడిగా కనబడతాయి. కానీ ఆ చెరువులు నేల సారాన్ని - మూలుగుల నుంచి పీల్చేసి ఆ నేలని ఎందుకూ పనికి రాకుండా చేస్తాయి. ఈ ఘోర విపత్తును గురించి మనల్ని జాగృతుల్ని చేస్తో కవి.

'చెమట ఊపిరితో
మొలకెత్తే విత్తనం చిగురునవ్వు
నేల భరించిన
గునపం గుద్దుల్ని మరిచేలా చేస్తుంది"

నేలను దున్ని చెమటోడ్చి విత్తు చల్లి తగు జాగ్రత్తలు తీసుకుంటే ఆ శ్రమకు దగ్గ ఫలం మొలకెత్తే విత్తనం చిగురునవ్వు రూపంలో బయల్పడి ఆ రైతు కష్టాల్ని మరిచి సేద దీరేలా చేస్తుంది.

"పులొచ్చినట్లు పురుగొచ్చి
చేనుని వణికించే సమయాలలో
దళారుల చెడుగుడు ఆటల మధ్య
ఎవరివో సైగలు కనబడతాయి"

పంటకు చీడ సోకినపుడు రైతుకి ఫలసాయం తగ్గుతుంది. దానికితోడు దళారులు రైతులతో ధరల విషయంలో చెడుగుడు ఆడుతుంటే - రైతు నిస్తేజంగా, నిర్వికారంగా అయిపోతాడు.

"కాసిన్నిగింజల నమూనాకు
పిసరంత రసాయనాల ఘాటు కలిపితే
గిట్టుబాటు ధర తెలుస్తుందట"

రైతు ఆరుగాలం శ్రమించి పంట పండిస్తే దాని నాణ్యతను అర నిమిషంలో అసంబద్ధంగా తీర్పు చెప్పే అబద్ధం తీరు తెలుస్తుంది. దీన్లో రైతు ఎప్పుడూ వైకుంఠపాళీలో పాము నోట పడడం కనబడుతుంది మనకి. రైతుపై అటు దళారులు, ఇటు ప్రభుత్వం జోడుగుర్రాల స్వారీ చేసి అతని వెన్నెముకని పూర్తిగా వంగదీస్తారు

"పిట్టలాఎగిరొచ్చి
పిడుగైపడుతుంది
దమ్ముచేలో"

అని పేటెంట్ హక్కుల ఉక్కు పాదాల క్రింద రైతునలగడం గురించి చెబుతారు కవి. మన వేపచెట్టుపై పేటెంటు హక్కు తనదంటాడు ప్రపంచ పోలీసు అయిన అమెరికా. ఇలానే ఏమరుస్తే అమ్మ పాలకి కూడా పేటెంటు అమ్మకాలు మొదలైపోతాయిక. దీని తీవ్రతని అర్థం చేసుకోకపోతే చాపకింది నీరులా మన దేశాన్ని మొత్తం పిప్పి చేసేస్తుంది అమెరికా(కి).

"నదులు కలవని నేలలు
ఆకాశం వైపు చూస్తుంటే
చేలోని ఎలుకలు కడుపులోకి పరిగెడతాయి"

రైతు పారిభాషిక పదాలు (మూనలు, మునుంపాట, గట్లంకలు, తొరాలు, చేడీలు, కొయకాళ్ళు, ముద్రబల్ల వగైరా) చాలా వాడారు కవి. వీటికి ఫుట్ నోట్స్ ఇస్తే పుస్తకానికి ఇంకా నిండుదనం, సరళత్వం చేకూరేవి.

**(పుస్తకం : ముద్రబల్ల, కవి : శ్రీ దాట్ల దేవదానం రాజు, పేజీలు : 52, వెల : రు.20/-, ప్రతులకు : డి. దేవదానం రాజు, 4-381, జక్రియా నగర్, యానాం-533464, ఫోన్ : (0884)2321096, విశాలాంధ్ర బుక్ హౌస్ అన్ని బ్రాంచీలలో)**

---

అల

# అదును కోసం రైతుపడే ఆక్రందనే వానచూపు




ఈ రోజు వచన కవైనా, గేయకవైనా చివరకు పద్యకవైనా, ఎవ్వరైనా కానివ్వండి. ఎక్కడైనా కానివ్వండి సామాజిక సమస్యల్ని కవిత్వీకరించకుండా ఉండడం అసాధ్యం అయితే కవులందరూ ప్రాపంచిక విషయాల్నే కవితా వస్తువుగా స్వీకరించినప్పటికీ సామాజిక చలన సూత్రాలు అర్థం చేసుకోగల ప్రాపంచిక దృక్పథం ఉన్న కవులు మాత్రమే సామాజిక సమస్యల్ని బలంగా అభివ్యక్తీకరించగలుగుతున్నారు. ఆ కోవకు చెందిన వాడే బడబాగ్ని శంకర్రాజు. ఈ దశాబ్దంలో బహుళజాతి సంస్థలు వ్యవసాయ రంగాన్ని తమ అదుపాజ్ఞలలో ఉంచుకునే సందర్భంలో తమ జేబు సంస్థైన సామ్రాజ్యవాదం ద్వారా తాబేదారులైన భారత పాలక వర్గాల మీద వత్తిడి తెచ్చి వ్యవసాయరంగాన్ని తమ మార్కెట్టుగా మలచుకున్నాయి. రైతు జీవితం ఆ సుడిగుండంలో పడింది. ఈ స్థితినే శంకర్రాజు కవితా వస్తువుగా స్వీకరించి రైతు బతుకు ఎలా మార్కెట్ సరుకుగా మారిందో వివరించడానికి ప్రయత్నించాడు. సంకలనంలోని మొత్తం 45 కవితలో మూడింట ఒక వంతు రైతు కవితలే. ఉత్తరాంధ్రలో గత అయిదేళ్ళుగా వచ్చిన కరువు కవిని కలచివేసి సంకలనానికి వాన చూపు అని పేరు పెట్టాడు.

భూగోళం సూర్యుని చుట్టూ తిరిగినట్టు రైతునేత్ర గోళం మేఘాల చుట్టూ తిరుగుతుందంటాడు. ఎంతో శ్రమపడి పంట పండించినా ధాన్యం బేరాల్లో మోసం గిట్టుబాటు ధర లేకపోవడం, పాలకులు మొక్కుబడి హామీలతో కాలయాపన చెయ్యడం, శాశ్విత పరిష్కారానికి బదులు తాత్కాలిక కంటి తుడుపు కార్యక్రమాల్ని చేపట్టడాన్ని ఈ సంకలనం గంపకెత్తి గాలిపోస్తుంది. హరిత విప్లవం పేరిట పాలకులు రైతులకు చేసిన ద్రోహాన్ని 'ఆకుపచ్చని మోసం'లో కవి బట్టబయలు చేశారు.

"పంట ఫలితం అందివ్వని పచ్చదనం
పచ్చని ఉరితాడే కదా!
పొట్టగరుగుపైరు సగం వదలిపోతుంది
పాలకంకిలో గింజ సగమే నిండుతుంది
సగం పంటకోసమేనా ఈ కళ్ళు చెదిరే పచ్చదనం?

'చీలిన గిట్టలు' కవిత బహుళజాతి ఉత్పత్తుల బండారాన్ని బయటపెడుతుంది. "ప్రైవేటు రుణంతో కొన్ని తెల్లెద్దు/ఫ్యాక్టరీ పౌడర్ తినబెడితేనే పని చేస్తుంది" అంటూ ప్రభుత్వరుణం, విధాన మార్పులు తెచ్చే అనర్థాల్ని వివరిస్తూ "సింధునాగరికత"

"మూపురం ఎద్దు సోలిపోయింది!
రైతు ఆర్థిక పునాది కూలిపోయింది!
రైతు బతుకు గుండెజారిపోయింది!

'రణభూమి' కవితలో భూమి రకాల్ని వివరించాడు. భూమిని రాళ్ళ భూమి, చౌడుభూమి, వికారభూమి, గుండ్ల భూములుగా వర్గీకరించాడు. కవికి భూమిపట్లగల అవగాహన విదితమౌతుంది. 'నకిలీల నీడలో' విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు నకిలీ మయం ఎలా అవుతున్నాయో తెలుపుతూ భవిష్యత్తులో నకిలీ మేధావుల స్థితిని తెలుపుతుంది. "వాణిజ్యసెగలు"లో వేరుశనగ, చెరకు, పొగాకు, గోగు, మొక్కజొన్న సాగు చేసిన రైతులు ఎలా నష్టపోతున్నారో కవి చర్చించాడు. నాగేటి చాలులో రైతు కోసం ఎంత కాలమైనా పడి ఉంటానని 'ఆ రోజు కోసం' కవితలో శంకర్రాజు చెబుతాడు. 'ధనం ఇంధనం'లో "గొంతులు కోసే వ్యాపారం తడిగడ్డ సోకగానే/వెలవెలబోయి వేటగాడి చేతిలో తుపాకీగా మారిపోయింది/ కొంత ఫరవాలేదు. అప్పుడు కుందేళ్ళు మాత్రమే చచ్చేవి/ గ్లోబల్ వాణిజ్య విషగాలిసోకేక/ మాట నేర్చిన మనుష్యులే బలైపోతున్నారు" అంటాడు రాజు. సామ్రాజ్యవాదం పేద దేశాల్ని కబళించే తీరు ఈ కవిత చెప్పింది.

ప్రలోభ విత్తనంలో ''కలుపు మొక్కల విత్తనాలు/ శిథిలమైపోయిన స్వదేశీ విత్తనానికి శ్రద్ధాంజలి ఘటించి/విదేశీ విత్తనానికి సాష్టాంగపడతాయి" తన పంట నుంచి తాను విత్తనాలు వేసుకునే స్థితి నుంచి విత్తన సంస్థల దోపిడీకి రైతు ఎలా బలౌతున్నాడో ఈ కవిత తెలుపుతుంది.

'జలశిల'లో నదీ జలాల సమస్యని పాలకవర్గాలు రాజకీయం చేసిన తీరును వివరించాడు. నేటి గడ్డు పరిస్థితుల్ని వివరిస్తూ 'బతికేదెలా' అని నిలదీశాడు.

సామ్రాజ్య విస్తరణ కోసం పాలకులు చేసే యుద్ధాన్ని, అవి సృష్టించే ఈతి బాధల్ని వర్ణిస్తూ 'యుద్ధఫలితం" రాశాడు.

కవి చూపులు ఎలా ఉండాలో, దేనిని ఆకర్షించాలో, ఆకాంక్షించాలో తెలిపే కవిత 'కళ్ళు"

"ఆ కళ్ళు అంబుధికి ఆకాశానికి మధ్య ఉదయించే అరుణగోళాల్లా ఉంటాయి. ఆ కళ్ళ శ్రమజీవుల్ని చూసినపుడు వారికి మరో ప్రపంచాన్ని ప్రసాదించాలని తహతహలాడుతున్నట్లుగానిపిస్తాయి" కవి అనుభూతుల నందనోద్యానవనం పత్ర నృత్యం.

"శాస్త్రజ్ఞుడితో సరసం"లో కవి తనకు విశ్వానికి ఉండే అనుభూతుల్ని వివరించాడు. "హెచ్చరిక"లో అనేక జీవన రహదార్లను తెలుపుతూ అవి వికృత రూపం దాల్చినప్పుడు అసమానతలు ఏర్పడతాయని అప్పుడే అడవి దారి పడతారని వివరించాడు.

"ఎంతో కాలం శ్రమించి సృష్టించిన
భువనరులను విచక్షణా రహితంగా
దోచుకుంటే మాత్రం సహించను! అని హెచ్చరించిన కవితలో తన పేరు పరిణామమని చెబుతాడు. తరువాత ఉన్న పరిణామం కవితలో హెచ్చరిస్తాడు. 'అల్లుకునే మూడు'లో కులతత్వాన్ని మతతత్వాన్ని నిరసిస్తాడు. మానవ బలహీనతల్ని బహిర్గత పరిచే కవితా "వ్యసనాలు' నేటి విద్యా విధానంలోని లోపభూయిష్ట పద్ధతుల్ని "విద్యాగంథంలో విషబిందువులు'' కవితలో వెళ్ళడిస్తాడు. 'ప్రక్షాణం'లో "హరిశ్చంద్రుడులాంటి అయ్యా/సాయంకాలమయ్యే సరికి/ గుణనిధిలా మారిపోయాడు" ప్రకృతి నిర్బంధంలో మనిషి, గ్రహణ సూర్యోదయం, భూగోల విభిన్న వస్తువులతో విరాజిల్లిన కవితలు. మంగలి శ్రమను కంటికి కట్టినట్టు చూపించే కవిత 'సెలూన్ శిల్పి'. బతుకు కోసం అర్రులు చాస్తున్న వృత్తికారుల దైన్యాన్ని వివరించే కవిత భవిష్యత్ కోసం. పరాధీనత, కరెంటు కసరత్తు ప్రకృతిలో ఉండే పరస్పర సహకారం, మానవ దోపిడీలో ఉండే అహంకారం గురించి తెలిపే కవిత 'సహకారం-అహంకారం' ప్రజలు ఎలా ఉంటే బాగుంటుంది తెలిపే కవిత 'జెండా విన్నపం'. రాజకీయ స్వాతంత్ర్యం మోపిన 'రణభారాన్ని' "భగత్‌సింగ్ ఆర్థిక సమానత్వ భావదీపికల ఊతకర్రైనా లేకుండా ముందుకు ఎలా వెయ్యాలని ఆవేదన వ్యక్తం చేశారు. దేశఘోష, 'వైరుధ్యాల రాత్రి' 'కూతురు మౌనం' పిల్ల మీద తల్లితండ్రుల దాష్టీకాన్ని తెలుపుతుంది. స్త్రీవాద దృక్పథంతో వచ్చిన కవిత 'ఉమెన్‌పోచర్స్'. స్త్రీల పట్ల తనకుండే అభిమానాన్ని చాటుకున్నాడు కవి.

·దేశయువతను నడిపించే చోధకశక్తి భగత్సింగేనని, ఆ మార్గమే ఆచరణ యోగ్యమని తెలియజెప్పే కవిత 'దేశభక్తి సాధనం' సంధిశాల, అస్పష్ట విజయాలు, కృషితో నాస్తి దుర్భిక్షం. సామాజిక సమస్యల్ని వివరించే కవితలు. 'గాయపడిన సమైక్యతా హస్తం'లో అవినీతిమయ ఆంధ్రప్రదేశ్ వెళ్ళముందు సాక్షాత్కరిస్తుంది.

"కాగితాన్ని సమైక్యతా సేవింగ్స్ బాండ్లై
ప్రయివేటు బ్యాంకుల
చెత్తబుట్టల్ని నింపేస్తున్నాయి
సేవింగ్స్ ఖాతాలు మరణశాసనాల్ని
ఉత్పత్తి చేస్తున్నాయి. అంటూ వైరి భావసమైక్య శక్తుల వంచనా ముష్టి ఘాతం విరచించి ఒక చెయ్యిని సమైక్యతకు ఊతగా మిగిలిందని కవి కలత చెందుతాడు. ఈ సంకలనంలో రెండు మినీ కవితలు ఉన్న జీవితం వచనా కవితా విరుపులతో లయబద్ధంగా సాగింది.

జీవితం/మాయఅనుకున్నావో/అది తీరా చేరలేని/బర్ముడా ట్రయాంగిల్ వైపు/పయనించేనౌక అవుతుంది/ జీవితం అమూల్య అవకాశం అనుకున్నావో/ అది ఖచ్చితంగా తీరం చేరే/ పగిలిన ఓడ దుంగైనా అవుతుంది.

ఈ సంకలనంలో కొన్ని ఎక్స్‌ప్రెషన్ల కోసం కొత్త ప్రతీకలు సందర్భోచితంగా ఉపయోగించాడు కవి. సమకాలీన ప్రజా సమూహాలతో సత్సంబంధాలు ఏర్పరచుకొని సమకాలీన సమాజ గమనాన్ని మరింత లోతుగా అర్థం చేసుకునే ప్రయత్నాలు కొనసాగిస్తే శంకర్రాజు మంచి కవిగా నిలబడగలుగుతాడు.

మొకోరా




# 'సిలకలు కత్తులు దులపరిస్తే...'

అట్టాడ అప్పల్నాయుడు రాసిన మూడు కథల సంపుటి 'ఒక పొట్టివాడూ కొందరు పొడువువాళ్ళ కథ'. శ్రీకాకుళ సాయుధ పోరాటాన్ని ఆధారం చేసుకుని, ఆ ఉద్యమ నేపథ్యంలో, విప్లవకారుల అజ్ఞాత జీవితాల్నీ, వాళ్ళత్యాగాల్నీ, వాళ్ళ పోరాట పటిమనూ, చైతన్యాన్నీ, ఐక్యతనూ, ఆదివాసీ ప్రజల జీవితాల్నీ, ఆ నిరుపేద బడుగు బక్క బతుకుల వేతల్నీ, బాధల్నీ, వేదనల్నీ, పిడికెళ్ళెత్తిన వాళ్ళ కఠోర పోరాట దీక్షనూ ఒక డాక్యుమెంటరీలా ఆవిష్కరించిన కథలు ఇవి.

'వాళ్ళు' ఇది ఓ ఎన్‌కౌంటర్ కథ. ఓ ఇన్ఫార్మర్ ఇచ్చిన సమాచారం ఆధారంగా మూడు కొండల నడుమ జరుగుతున్న ప్లీనం మీద పోలీస్ రెయిడ్ జరుగుతుంది. సజీవంగా పట్టుకునే అవకాశం వున్నా కాల్పులు జరిపి పది మందిని పోలీసులు ఎన్‌కౌంటర్ చేస్తారు. కాలిపాదం తెగిపడీ, పారిపోవ వీలుగాకున్న జయరాజ్ అనే నక్సలైటు ఒకరి తర్వాత ఒకరు ముగ్గురు 'మెన్'ని ఘూట్ చేస్తాడు. మృతదేహాలు ఇంకా చేరకముందే దీని మీద కథ రాయడానికి రచయితైన ఓ ఉన్నతాధికారి కూర్చుంటాడు. ముగ్గురి 'మెన్' మృతదేహాల్ని తీసుకురావడానికి, జంకుతూ, చివరికి చాలా ఆలస్యంగా తెచ్చి, ఆ దేహాల మీద కప్పిన ముసుగులు తొలగించి చూస్తే అవి విప్లవకారుల శవాలు. ఎక్కడో పొరపాటు జరిగిందని దిమ్మదిరిగిపోతుంది. యంత్రాంగం పౌరహక్కుల సంఘం వాళ్ళు, ప్రజల సహకారంతో చనిపోయిన మెన్‌ని తీసుకురావడానికి బయల్దేర్తారు. ఏకబిగిన చదివించే కథ సత్యం సారు నాటి నుంచీ ఉద్యమంలో వున్న అక్క, ఒక ఉద్యమం నించి మరో ఉద్యమానికి నడుస్తున్న ఆమెని ఎన్‌కౌంటర్ చేసి వుండాల్సింది కాదనుకుంటాడు. ఆ ఉన్నతాధికారి. "నిర్బంధాన్ని అక్కడే జనం మధ్యనే ఎదుర్కొని, అంచెలంచెలుగా అక్కడ ఉద్యమాన్ని అభివృద్ధి చేసి, ఆ అభివృద్ధి, అందుకునే స్థాయికి జనాన్ని తేగలిగేక...." మూడు దశాబ్దాల పోరాట అనుభవం కలిగిన అక్క తన డైరీలో రాసుకున్న మాటలివి.

తెలుగు కథా సాహిత్యంలో బహుశ ఏ కథకీ రానంత గొప్ప పేరు ప్రతిష్టలు, పూప్యులారిటీ వచ్చిన (తెచ్చిన) కథ 'యజ్ఞం' ఒక వ్యక్తి కథనో, కవితనో, నవలనో హైలెట్ చేసి, అతని ద్వారా సంస్థకి కూడా ఇంకా గొప్ప గుర్తింపు తెచ్చుకోవాలనే తాపత్రయంతో 'యజ్ఞం' కథని పదేపదే ప్రస్తావించి, ఎక్కువ కీర్తి ప్రతిష్టలు ఆర్జించి పెట్టారనే ఆరోపణలు ఎదుర్కొన్న కథ ఇది. ఆ యజ్ఞం కథకి కొనసాగింపుగా అప్పల్నాయుడు రాసిన కథ 'యజ్ఞం.. తర్వాత'. అవే పాత్రలు. కానీ విప్లవోద్యమంతో, నిర్బంధంతో పెనవేసుకున్న పరిణామాలు.

కొడుకుని చంపిన నేరానికి సీతారాముడికి జైలు శిక్ష పడుతుంది. జైలులో కమ్యూనిస్ట్ విప్లవకారులు పరిచయమవుతారు. వాళ్ళు ఏజెన్సీ ప్రాంతంలో నిర్మించిన గిరిజనోద్యమం తెలుసుకుని ప్రభావితుడై జైలు నించి తప్పించుకునిపోయి విప్లవ కారుల్తో కలుస్తాడు. తరువాత అతన్ని పోలీసులు బూటకపు ఎన్‌కౌంటర్ చేస్తారు. అతని పెద్ద అన్న కొడుకు, అంటే అప్పల్రాయుడి పెద్దకొడుకు, కొడుకు చిన అప్పల్రాయుడు నక్సలైటు అవుతాడు. ఆ వూరి ప్రజలు కూలీరేట్ల పోరాటం, భూమి పోరాటం చేస్తూ, సీతారాముడికి స్మారకస్థూపం నిర్మిస్తారు. నిర్మించిన జనంతోనే పోలీసులు ఆ స్థూపాన్ని కూలగొట్టిస్తారు. ఇలా విప్లవోద్యమ నేపథ్యంలో ఈ కథ రూపుదిద్దుకుంది. అమ్మ అడిగిన ప్రశ్నకి విప్లవకారుడైన కొడుకు ".... జీవితంలో యుద్ధం లేనిదెక్కడ?... మృత్యువుతో క్షణక్షణమూ చేసే యుద్ధమే జీవితం" అంటాడు. "రక్తం బయటికి కనపడకుండా మనిసిసెమటా, సత్తువా సప్పరించీసింది బావూ వొర్తకం! ఇప్పుడా సంపదా, పెత్తనపూ మనిసి నెత్తురిని పిండుతుంది" అంటుందో పాత్ర. కథ చివరలో నాలుగు దశాబ్దాలుగా జరిగిన రాజకీయ ఆర్థిక పరిణామాల్ని నారాయణమూర్తి మాష్టరు ఎంతో గొప్పగా విశ్లేషిస్తారు.

గతంలో అణచివేతకి గురై పడిలేచిన కడలి తరంగంలా తిరిగి పునాదుల్లాంటి అణగారిన సామాన్య పేదజనం నించి వూపిరి పోసుకుంటున్న శ్రీకాకుళ ఉద్యమాన్ని ఆవిష్కరించిన కథ ఒక పొట్టివాడూ కొందరు పొడవు వాళ్ళ కథ'. "తక్కువ ధరకు భూవీ, తక్కువ కూలికి మనుషులూ, తక్కువ పెట్టుబడీ, యెక్కువ లాభమూ వొస్తుందంటే...." కృష్ణాజిల్లా నించి చౌదరి, ఆయన భార్య రుక్మిణమ్మా వలస వస్తారు. అక్కడ సాధారణ సన్నకారు రైతు ఇక్కడ బుగత అయ్యేడు. దొరగారూ, దొరమ్మా అయినారు. వాళ్ళ దగ్గర వున్న కంబార్లూ, కూలీ నాలీ చేసుకునే గోచీ పాతగాళ్ళు అందరూ సంఘం పెట్టి దొరలకీ, ప్రభుత్వానికీ వ్యతిరేకంగా జరిపిన పోరుగాథ ఇది. 'స్వంత యిల్లూ, పిల్లాజెల్లా కుంటుమాల్నొదిలి, ప్రజల కోసమని, యిలాగ కొండకోనల్లో, మీ గడపల్లో పండుకొని, మీ గంజినీళ్ళు తాగే అజ్ఞాత నేత చంద్రన్న వీళ్ళకి నాయకత్వం వహిస్తుంటాడు. వ్యంగాలు, వెటకారాలు, ఎకసెక్కాలు, చమత్కారాలు, చతుర్లూ, నవ్వుతాలూ, ఎగతాళ్ళూ ఈ కథలో చాలా పాత్రలు మాట్లాడుతుంటాయి. అయితే వాటి వెనుక కఠోరమైన సామాజిక వాస్తవాలు వున్నాయి. "మీటింగులు, సంగాలు, ధర్నాలు, కోర్టులు, వోయిదాలు కంచారి బతుకు బతికినంత కాలం తప్పవు" అంటాడు ఒక కంబారి. కోర్టులూ, జైళ్ళూ యిళ్ళూ పొలాల్లాగ అలవాటుపడిపోయారు వాళ్ళు. పివోగారు జన్ని ముసలమ్మని "....సామ్రాజ్యవాదం నశించాలి అనన్నావుగదా... అంటే ఏమిటి" అని వ్యంగంగా అడుగుతాడు. "... కానుగ సెట్టి అడివిల - కాఫీతోట పెరగటం, జునువు గింజల పోడు మీద - నీలగిరి మొక్క లెదగటం, యింటి - పెరటి భూమి మీద పనస చెట్టు మాయమయిపోయి - సామాయిలు చెట్టు కొమ్మలిరగ బోసుకోవడం.." అని జవాబు చెబుతుంది.

ఇంత మంచి కథలు రాసిన రచయిత పుస్తకానికి రాసుకున్న ముందుమాటలో ".... సామాన్య రైతు బిడ్డని, పల్లెలో పుట్టి పెరిగేను. పల్లెల్లోనే జీవనం సాగించాను" ఈస్వోత్కర్ష ఎందుకూ? విప్లవ సాహిత్యాభిమానులు అందరూ చదవాల్సిన పుస్తకమిది.

(ఒక పొట్టివాడూ కొందరు పొడవు వాళ్ళ కథ. రచయిత : అట్టాడ అప్పల్నాయుడు. పేజీలు : **96**, ధర : రు.30/-, జనసాహితి ప్రచురణ, ప్రతులకు : మైత్రీ బుక్‌హౌస్, మసీదువీధి, కార్ల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-2)

సైదులు ఐనాల




# ఆకట్టుకునే అలవోకలు

అలవోకగా రాసేంత నేర్పరితనం అందర్లోనూ ఉండక పోవచ్చు. అదీ సమాజంలో జరుగుతున్న అనేకానేక అన్యాయాలు, రాజకీయ నాయకుల కుప్పిగంతులు, మార్కెట్లుగా మారిన విద్యాలయాలు తదితర అంశాల్ని గురించిన రాతల్ని రాయాలంటే ఓ నిబద్ధత అవసరం. కాస్త ధైర్యమూ అవసరమే. రాసేరాతలకీ అవసరమే శాస్త్రీయ దృక్పథం. అప్పుడుగానీ ఆ రచన నలుగుర్ని ఆలోచింపచేస్తుంది.

సౌలభ్యం కోసం తెలుగు సాహిత్యంలో అనేకానేక ప్రక్రియలు విషయాన్ని విప్పిచెప్పేవి కొన్నయితే, విషయానికి రంగులద్దేవికొన్ని. ఏ ప్రక్రియ ఎంత వరకు విజయం పొందుతుందో ఆ ప్రక్రియను చేపట్టిన వారి ప్రతిభను బట్టి ఉంటుంది. జపాన్‌లో పుట్టిన 'హైకూ'ను సమర్థవంతంగా సామాజికాంశాలను చెప్పడానికి వాడుకున్నారు. తెలుగు కవులు - తాము చెప్పదలుచుకున్న విషయగాఢతని బట్టి 'హైకూ'ని సమర్థవంతంగా ఉపయోగించుకున్న కవయిత్రిల్లో 'బి. ఇందిర'ని ప్రముఖంగా చెప్పుకోవాలి.

ఇందిర కవి సమ్మేళనాల్లో కవిత చదివిందంటేనే ఓ సంచలన ప్రకటనేదో చేస్తున్నట్లు ప్రేక్షకులు అటెన్షన్ ఫీలవుతారు. జనరంజకంగా తాను చెప్పదలుచుకున్న విషయాన్ని సూటిగా జెప్పడంలో ఎంతో నేర్పరితనం ఉంది. శిల్పి చేతిలో ప్రతీ శిలా శిల్పంగా మారజాలదు. ఆశిలలో శిల్పంగా మారే గుణం ఉండాలి. అలాగే ప్రతీకవితా గుర్తుండిపోదు. తీసుకున్న వస్తువులో కవితా గుణం ఉండటం అవసరం. ఇందిర పట్టుకున్న ప్రతీ అంశంలో కవితా గుణం ఎలా ఉంటుందో చూడండి.

కుటిల రాజకీయాలను చూసి
మొసళ్ళు మానేశాయి
కన్నీళ్ళు కార్చడం

ప్రజలకి పరిచయంలో నున్న విషయాన్ని తన ప్రతిభతో శిల్పంగా మలిచిన తీరు బట్టే ఆకట్టుకునేట్లు ఉంది.

"బ్రతుకును ఆవిరి చేసి
కదుపెంద బెట్టుకుంది
చెరువు

నెర్రెలుబారి బక్కచిక్కిన చెరువు కళ్ళ ముందు కదలాడుతుంది. ఇందిర ప్రతీ హైకూ దృశ్యాల్ని మోసుకొస్తాయి పాఠకుని వెంట

చేనే'తలరాత'లు
రాస్తున్నారు
చీ! నేతలు!!! అనడంలో ఓ ఆర్థిక, సామాజిక స్పృహ ఉంది. అల్పాక్షరాల్లో అనల్ప విషయం అనే హైకూ లక్షణాన్ని రచయిత్రి ఒడిసి పట్టుకుంది. మొగిడితోనే ఎడుపు/పోలేదు/మరోమగాడున్నాడు/కొడుకు రూపంలో!!/ అనడంలో ఓ ఆవేదన ఉంది. పొట్టలో చెయ్యి పట్టిదేలిన తాలూకూ వికారం కల్గుతుంది.

'మినీ'నీ హైకూనీ అనేకానేక సామాజికాంశాల్ని తడమడానికి, సామాన్య పాఠకుల్లోకి తీసుకుపోవడానికి వారదిలా వాడుకున్నదామె. ఒక్కోసారి గొప్పవాళ్ళ రచన వాళ్ళకున్న పేరు బలంతో ప్రజల్లోకెళ్తుంది. ప్రసిద్ధమైన రచనయినా చిన్న వాళ్ళ రచన అందరికీ చేరకపోవచ్చు.

"ప్రసిద్ధ కవుల నిషిద్ధ కవిత్వం, నిషిద్ధ కవుల - ప్రసిద్ధ కవిత్వం" అనే ఈ మాట ఈ పుస్తకం (అలవోకలు)కూ వర్తిస్తుంది. అక్షరాలా ఇందిరది ప్రసిద్ధ కవిత్వమే అని చెప్పేంత స్థాయిలో ఇంకా రాస్తుందనీ కవితా క్షేత్రంలో అలుపెరగక క్రొత్త పుంతలు త్రొక్కుతుందనీ ఆశించొచ్చు. అయితే ఈ ప్రక్రియల్ని మరింతగా ఆకలింపు చేసుకుంటే హైకూలు కొని తేలిపోవడానికి దగ్గరయ్యాయనే అపవాదు నుండి తప్పించుకోవచ్చు. ఆ దిశగా రచయిత్రి కృషి చేయాలి. ఇకపోతే తెలకపల్లి రవి అభినందన, దిలావర్ తేనెవాకలు ఈ పుస్తకాన్ని మరింత ఎత్తుకు తీసుకుపోయాయి.

**(అలవోకలు (హైకూలు-మినీలు), రచయిత : బి. ఇందిర; వెల : రు.20/-; పేజీలు :48, ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్)**

---

**ఎస్.ఐ.**




# జీవితమంత విస్తారంగా 'వీరగల్లు' కథలు

కొందరు కాసుల కోసం కథలు రాస్తే, ఇంకొందరు కాలక్షేపం కోసం రాస్తారు. రెండింటి కోసమూకాకుండా బాధ్యతగా, ఓ సామాజిక అవసరంగా భావించి కథా సృజన చేసే వాళ్ళు. తెలుగు సాహిత్యంలో అరుదు. అట్లాంటి వారిలో బండి నారాయణ స్వామిది ప్రముఖ స్థానమనే చెప్పాలి. స్వామి కథల్నిండా సీమజీవితాలు పరచబడి ఉంటాయి. రాళ్ళ మధ్య నలుగుతున్న జీవితాల్ని నికార్సుగా చిత్రించడంలో 'స్వామి' ఒకడుగు ముందుకేసి నిజాయితీగా తన వారి భాషనీ యాసనీ కథల్లో చిత్రించాడు. ఆయన కథల్లో సామాజిక జీవితం కన్పిస్తుంది. తను రాసిన కథల్లో పదకొండింటిని 'వీరగల్లు'గా తీసుకొచ్చాడు. కథలన్నీ పాఠకున్ని కదిలించేవే.

నాగరికత పేరుతో అమాయక జీవితాల్లో చొరబడుతున్న విష సంస్కృతిని నిశితంగా పరిశీలనగా 'నడక' కథలో చెప్పిన విధానం ఆ కథను దృశ్య స్థాయికి చేర్చింది. పట్నం నుంచి దిగుమతవుతున్న పద్ధతుల్ని, యంత్రాల్ని వాటి చేతుల్లో తామొక యంత్రంగా మారుతన్న వైనాన్ని చెప్పిన కథ ఇది. "విషాన్ని వాడుక చెయ్యడమే వ్యాపారం కిటుకు" అన్న మాట. నేటి గ్లోబలైజేషన్‌లో అమానవీయ మార్కెట్ వత్యాన్ని విప్పిచెప్తుంది. ఈ కథల్లో తాత్వికమైన జీవిత విశ్లేషణను సమృద్ధిగా ఆవిష్కరించిన కథ 'అమ్మ'. ఈ కథ చదువుతున్నంత సేపు పాఠకుడు తన కుటుంబంలోని

'అమ్మ' చుట్టు తిరిగే దృశ్యాన్ని నెమరు వేసుకుంటాడు. రచయిత స్వగతం ఉన్నట్లు అన్పించినా వస్తువుని తనదైన శైలిలో ఆవిష్కరించిన విధానం గొప్పగాను నిజాయితీగానూ ఉంది. టీచర్ వృత్తిలో వున్న ఒక వ్యక్తి స్వంత ఇంటికొచ్చేసరికి తన తల్లిని హాస్పిటల్‌లో చేర్చారన్న వార్త క్రుంగదీస్తుంది. ఆ తరువాత ఆస్పత్రి పడక మీద నిద్రపోతూ కూడా ఆందోళన పడుతున్నట్లుగా అమ్మముఖం చూస్తూ గత జ్ఞాపకాల్లోకి వెళ్తాడు. మనల్నీ తీసుకెళ్తాడు.

వాన కోసం, నాలుగు నీళ్ళ చుక్కల కోసం రాయలసీమలో ఎదురు చూసే రైతుల దైన్యస్థితిని, రైతులు కూలీలుగా, కూలీలు ఇంకాస్త దిగజారే కూలీగా మారే స్థితిని "వానరాలే" కథలో చూస్తాం.

కథలో పెన్నప్ప చిన్నపాటి రైతు ఈ సారైనా వానొత్తదేమోనన్న ఆశతో షావుకారి దగ్గరకు శనగిత్తనాలు అప్పు తీసుకొచ్చి వానకోసం ఎదురు చూడసాగిన రీతిని కళ్ళకు కట్టినట్లుగా రచయిత ఆవిష్కరించాడు. "ప్రపంచంలో పాపాలు పెరిగిపోయి వానలు కురసమంటే ఎట్ల కురుస్తాయి మల్ల' అనుకుంటె పెన్నప్ప" అనడంలో ఎవరినీ నిందించలేని స్థితి, సీమరైతుల నిరాశక్తత కన్పిస్తుంది. పట్టిన మబ్బులు విడిపోవడం సీమలో సహజం. వస్తాన్న వాన రాకపాయె, "ప్రాప్తం, అప్పా ప్రాప్తం! వచ్చే వరకూ వానకాదు. తినే వరకూ బువ్వమనది కాదు" అని ఆ కథలోని పెన్నప్ప అనడం వెనక తరతరాల సహనం, ఎదురు చూపు కన్పిస్తుంది. చివరికి ఎప్పుడో వచ్చిన వాన ఉపయోగపడక పిల్లపెళ్ళి మరొక యాదాదికి వాయిదపడటం అనేది ఒక్కడి సన్నకారు రైతుల ఇండ్లలో సర్వసాధారణం.

ఈ కథల్లో ఎక్కడా సెంటిమెంట్ కన్పించదు. రచయిత చూపించిన 'అమ్మ'లో కఠోర జీవితవాస్తవం కన్పిస్తుంది. అవసరాల్ని మోసుకొచ్చిన ఎదిగిన ఆడపిల్లలు కన్పిస్తారు. జీవితాల్ని శాసించే అవసరాలు తారసపడ్తాయి. అయితే ఈ కథల్నిండా రాయలసీమ జీవితం సాక్షాత్కరిస్తుంది. భాషలోనూ, యాసలోనూ ఓ బలమైన స్వంత గొంతు కన్పిస్తుంది. వాణిజ్య పంటలు వచ్చాక పల్లెల్లో మారిన జీవితాల్ని, వారి అభిరుచుల్లో వచ్చే వైవిధ్యాల్ని 'నడక' కథలో చూపిస్తే ఆరుగాలం పని చేసి తన జీవితంతో మమేకమైన ఎద్దులు ముసలివై తనముందే తన వ్యవసాయం కుంటుబడ్తున్న వైనాన్ని జీర్ణించుకోలేని రైతు స్థితిని చూపిస్తాడు. ఇంకా ఈ పుస్తకంలోని ఊరుతల్లి, పిప్పిమనిషి వంటి కథలు మనిషి జీవితాలపై డాక్యుమెంటరీ అనదగ్గ రీతిగా పాఠకుడు ఫీలవుతాడు. పాత్రకనుగుణంగా భాషని వాడుకున్న రచయిత తన కథల్లో సమయస్ఫూర్తితో, తనకనుగుణంగా జీవితాల్ని మలుచుకునే చైతన్యాన్ని మాత్రమే కల్పిస్తూ పరిష్కారం జోలికిపోవడం కొంత అసంతృప్తిగానే ఉంటుంది. పాఠకునిలో అయితే రచయిత తాత్త్విక దృక్పథం ఈ కథల్ని పది కాలాలపాటు నిల్చేట్టు చేస్తాయనడంలో సందేహంలేదు.

**(వీరగల్లు; రచయిత : బండి నారాయణస్వామి; వెల : రు. 50/-, ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, నవోదయ బుక్‌హౌస్, పరంజ్యోతి-ఫోన్. 278039)**

**బి. లలితానందప్రసాద్**




# కవితామృతం - 'జలస్వప్నం'

'జీవితంపట్ల స్పష్టత లేనివాడు, సమాజంపట్ల బాధ్యతలేని వాడు, నిరంతరమూ తనలోకి తాను తొంగి చూసుకోని వాడు, జీవిత వాస్తవికతకు కారణాలు అన్వేషించలేనివాడు రాసే కవిత్వంలో మాత్రమే అనిశ్చిత, అయోమయం, సంక్లిష్టత వుంటుంది' అంటారు సింగమనేని తన ముందుమాటలో. ఇది అక్షరాక్షర నిజం 'మల్లెల' - 'జలస్వప్నం' విషయంలో అవి లేవు కాబట్టి. అదే సమయంలో కవితా విలువలు పుష్కలంగా ఉండబట్టి మల్లెల నరసింహమూర్తి, మల్లెల పరిమళంతో ప్రామిసింగ్ కవిగా మనముందుకొచ్చారు రాయలసీమ నుండి.

ముప్పై కవితల సంపుటి వస్తు విశిష్టత, వైవిధ్యాలతో అభివ్యక్తి పరిణతి సాహితీ విలువలతో కవితా ప్రియుల మన్ననల కర్హమైనది. శీర్షికల్లోనూ ప్రత్యేకత కన్పిస్తుంది. 'కవిత 2004'లో చోటు చేసుకున్న 'మట్టిగొంతుక'లో మనిషిని స్పృశిస్తే / మట్టి వాసనే లేదు / .... / మనిషి మనిషి దగ్గరే / భాషను కోల్పోయిన అమానవీయ అనాగరిక కాలం / .... / పాలకంకుల్ని / గుండె తడిని స్పృశించలేని / శిలా వృక్షాలవడం / ఈ కాలం కంజీరపై విషాద దగ్ధగీతం" అంటూ సమకాలీనాన్ని అద్భుతంగా ఆవిష్కరించారు. నేటి ఆవశ్యకత తెల్పుతూ - 'మనుషుల కూడలి నిర్మిద్దాం! బాధో - సుఖమో మనం కలవటం అవసరం' అంటారు.

అమ్మ గురించి ఎవరెంత రాసినా ఇంకెంతో మిగిలే ఉంటుంది 'అమ్మంటే ఆశ! అమ్మే శ్వాస' అంటూ ముగిసిన 'మట్టి మనిషి' కవితలో 'నడుం వంచడం నేర్పిన అమ్మ / తలెత్తుకు బ్రతకటమూ నేర్పింది' అంటూ బిడ్డ రూపొందడంలో అమ్మ పాత్ర గుర్తు చేస్తారు. 'ప్రపంచం పసిపాపను వేలు పెట్టుకుని నడిపించేది అమ్మ' అని కవితా శిఖరంపై మకుటంగా అమ్మను నిలబెట్టడం కవి ప్రతిభకు నిదర్శనం.

జలస్వప్నం కవితలో 'రాళ్లసీమ నీళ్ళసీమ కావాలి / జీవ జలం ప్రవహించాలి' అనే ఆకాంక్షను వెలిబుచ్చారు. అట్లాగే మరో మూడు కవితల్లో నీటికి సంబంధించిన ఆర్తి ఉంది. 'అన్వేషణ'లో 'మనిషి తప్పిపోయాడు / మనిషి కనిపిస్తే చాలు / నా అన్వేషణ ముగిసినట్టే / ఆ మల్లె పూలై / అతని పాదాల మీద వాలతాను' అనడంలో నిజమైన మనిషికై ఎంతగా తపిస్తున్నారో అర్థమవుతుంది. ఈనాడు ఏదో రూపంలో ప్రతి ఒక్కరి పరిస్థితీ ఇదే.

'శరీరం శిలైపోయినా - కవితలో 'వజ్ర పుష్పం నా హృదయం' అన్నపుడు 'మగ్దుం' గుర్తుకొస్తాడు.

ఇంత మంచి కవితా సంపుటిలో 'ఏ ప్రభుత్వాన్ని నమ్ముకున్న రైతన్నకూ / నష్ట పరిహారం మాట దేవుడెరుగు / పాప పరిహారం కూడా లేదు / .... / లాంటి వాచ్యం పరిహరింపగలిగితే మరింత బావుండేది సూచిక చదువరి సౌలభ్యానికి అవసరం. ఇది మంచి కవితా సంపుటి. కవితా ప్రియులు తప్పక చదవాలి. కవి ఆర్తిని అంది పుచ్చుకోవాలి. మల్లెల నుండి ముందు ముందు మరిన్ని మంచి కవితా సంపుటాన్ని ఆశించవచ్చు. అనే భరోసా ఇస్తుందీ "జలస్వప్నం". **(జలస్వప్నం; కవి : మల్లెల నరసింహమూర్తి, వెల:రు. 50/-, పేజీలు : 93, ప్రతులకు : విశాలాంధ్ర అన్ని బ్రాంచీలు, ప్రజాశక్తి బుక్‌హౌస్, దిశ పుస్తక కేంద్రం, నవోదయ, హైదరాబాద్, స్ఫూర్తి పబ్లికేషన్స్, కేరాఫ్ మల్లెల నరసింహమూర్తి, 28-3-495, కెనారా బ్యాంకు ఎదురు, శారదా మందిర్ దగ్గర, మెయిన్ శారదా నగర్, అనంతపూర్-515 001)**

చలపాక ప్రకాష్

# బ్రతుకు మంటలతో 'పొద్దు పూసింది'

పొద్దుపూసింది

అశోక్‌కుమార్

మారుతున్న కాలంతోపాటు సాహిత్యరంగంలోని కవితా ప్రక్రియలోనూ అనేక మార్పులు జరుగుతున్నాయి. ఎక్కువ నిడివిగల కవితల కంటే తక్కువ నిడివిలో ఎక్కువ భావాన్ని ప్రతిఫలించే కవిత్వాన్నే పాఠకులు ఆదరిస్తున్న పరిస్థితులివి. ఈ దిశను అందుకున్న అశోక్‌కుమార్ 'పొద్దుపూసింది' కవితా సంపుటిలోని హృదయాలలోకి దూసుకుపోయే కవిత్వాన్నే సృష్టించారు. ఇందులో వున్న కవితలు మూడు పాదాలు కలిగి వున్నప్పటికీ హైకూలు మాత్రం కాదు. ఎందుకంటే హైకూలు సౌందర్యానుభూతిని కలిగించేవైతే, ఇందులోని కవితలు రగులుతున్న మధ్యతరగతి, పేదవాడి బ్రతుకు మంటల్ని ఆవిష్కరిస్తాయి.

కూలీ డబ్బులు / బతుకు పెనం మీద / నీటి చుక్కలు' అనే ఈ కవితలో... వేడి పెనం మీద నీటి చుక్కలు ఏ విధమైన అప్రయోజనమై ఆవిరైపోతాయో కూలివాడికిచ్చే కష్టార్జితం ఆ విధంగా ఆవిరైపోతాయనే భావం మొత్తాన్ని ఈ చిన్ని కవితలో ప్రతిఫలింప చేయటం అశోక్‌కుమార్‌లోని సృజనాత్మక శక్తిని పటిస్తున్నది. 'ఫ్యాక్షనిజం/మనిషిని చంపటం కాదు / మనిషిగా చావటం' అనే కవిత ద్వారా మానవత్వం దిగజారుడుతనాన్ని అతి సున్నితంగా వ్యక్తీకరించిన ఈ కవి రాసిన అన్ని కవితలూ వాడిగా, వేడిగా పాఠకులను ఆలోచింప చేసేవిగా వున్నాయి. ఈ 'పొద్దుపూసింది' సంపుటాన్ని 'కలాల హలాలతో / ఎరుపు పంటలు పండిస్తున్న అక్షర హాలికులకు' అంకితమిచ్చి తన తోటి కవిమిత్రుల్ని గౌరవించాడు. ఇక ఈ సంపుటికి పెట్టిన శీర్షిక అనేక ఆలోచనలలో పడేస్తోంది. పొద్దు పోయింది, పొద్దుగూకింది, పొద్దు పొడిచింది' అని అనేక మాండలికాల్లో సాయంత్రాన్ని పోల్చడం గమనిస్తాము. కాని 'పువ్వు పూసింది' అన్నట్లు పొద్దు పూసింది అనటం వేడి పుంతమాటున సగటు బ్రతుకుల జీవితాలు ఎలా మగ్గుతున్నాయో ఆవిష్కరించిన తీరు, అనేక ఆలోచనలు పరంపరలలో 'పొద్దుపోవటం' ఖాయం. **('పొద్దుపూసింది' (మినీ కవితలు), రచన : అశోక్‌కుమార్, పేజీలు : 64, వెల : రు.20/- ప్రతులకు : సింగంపల్లి అశోక్‌కుమార్, 305, ప్రగతి టవర్స్, వీరయ్యవీధి, మారుతీనగర్, విజయవాడ-520 004)**

సయ్యద్ ఖుర్షీద్

# ముస్లింల మనోభావాల "సాయిబు"




కుల, మతాల అస్థిత్వ ఉద్యమాలు బలంగా వస్తున్న తరుణంలో వాటి ప్రతిఫలనాలు తెలుగు సాహిత్యంలోనూ బహిర్గతమైనాయి. స్త్రీవాద, దళితవాద సాహిత్యాల మాదిరిగానే ముస్లింవాద సాహిత్య సృష్టి జరిగింది. బాబ్రీమసీదు విధ్వంసం, గుజరాత్ పరిణామాలు దేశంలోని ముస్లింలను మరింత అభద్రతకు గురి చేసాయి. సంఘ్‌పరివార్, వి.హెచ్.పి. తదితర సంస్థల భావాజాలం, ప్రచారం ముస్లింలను మరింతగా అభద్రతా ప్రవాహంలో పడవేసాయి. వీటన్నింటిని ముస్లింవాద సాహిత్యం కవితా, కథాంశాలు తీసుకొని తెలుగు సాహిత్యంలో ఒకింత స్థానాన్ని సంపాదించుకోగలిగింది. ఇప్పటి వరకు చెలామణిలో ఉన్న ముస్లింవాద సాహిత్యాన్ని సంపాదించుకోగలిగింది. ఇప్పటి వరకు చెలామణిలో ఉన్న ముస్లింవాద సాహిత్యాన్ని కాదని కరీముల్లా ఇస్లాంవాద సాహిత్యం అనమంటున్నాడు. ఇతని దృష్టిలో తాను చెప్పే వాదం మతోన్మాదానికి, ఫాసిజానికి, వ్యతిరేకమైనదని, 'ఇస్లాం' అంటేనే 'శాంతి' అని అంటున్నాడు. అందుకు అనుగుణంగా ఇస్లాంవాద దీర్ఘకవిత "సాయిబు"ను తెచ్చారు. ఈ వాదాల వివాదాలను కాసేపు అలా ప్రక్కన పెట్టి చూస్తే, ఈ దీర్ఘకవిత మొత్తం 12 భాగాలుగా విభజించబడింది.

"సాయిబు" దీర్ఘకవితలో కవి కరీముల్లా ముస్లింలపై జరుగుతున్న అసత్య ప్రచారాలు, అబద్ధపు ప్రకటనలు తదితర అంశాలను ప్రస్తావించారు. ప్రధానంగా ఇటీవల కాలంలో ముస్లింలు ఈ దేశవాసులు కారని, మన శత్రుదేశం మిత్రులని, వారికి ఈ దేశంపై ప్రేమలేదని కొందరు పనిగట్టుకొని ప్రచారాలు చేస్తున్నారు. ఈ ధోరణిని కవి బలంగా ప్రశ్నించారు. "ఈ జమీన్ జమీనంతా / బ్రిటిషోడి రాక్షస రతికి గురైనపుడు / ప్రాణాల్ని పేలాలుగా పర్చిందెవరు?" అంటూనే... "అమెరికా ఎక్కడుందో తెలీసీ / అ, ఆ లు రాని అమాయక సాయిబుకు / అల్‌ఖైదాకు అంకేది భమ్ / ప్రశ్నల వర్షం కురిపించారు. ముస్లింలు ఈ దేశమూలవాసులేనని, ఒకప్పుడు వివక్షతకు గురైన దళిత, నిమ్న వర్గాలే ఇస్లామీకరణ చెందారని బలంగా చెప్పారు".. పెదవి దాటిన / నా దళిత ఎంగిలిని / షర్బత్‌లా చప్పరించింది / వెన్ను వంచడం తప్ప / రొమ్ము చూపడం లేని నాలో / అనంత విశ్వాసాన్ని చాటింది"... అంటారు. ఇది నిజం కూడా ఇస్లాం మతం ఈ దేశంలో ప్రవేశించి విస్తరించింది కత్తులూ కటార్లతో కాదు. పరస్పర ప్రేమాభిమానాలు, గౌరవ మర్యాదలతో! అదే ఇస్లాం మత విస్తరణకు ఆలంబన.

స్వాతంత్ర్యానంతరం ఈ దేశంతోనే సహజీవనం చేస్తున్న ముస్లింలు ఈ దేశంపై పెట్టుకున్న నమ్మకాలు క్రమంగా కరిగిపోతున్నాయి. ముస్లిం వ్యతిరేక శక్తులు చేస్తున్న ప్రచారాలు, అనుసరిస్తున్న వ్యూహాలు ఎందుకు దోహదం చేస్తున్నాయి. దీనినే కరీముల్లా "... ఇన్నాళ్లూ / కవచమని తొడుకున్న / బుల్లెట్ ప్రూఫ్ చిల్లులు పడ్డాకే తెల్సింది / అది నగిషీ ముతకగుడ్డని /" అంటారు.

ఈ దేశంలో ఈనాడు ముస్లింలు అనుభవిస్తున్న దుస్థితికి

ఒక్క రాజకీయ పార్టీలనో, ముస్లిం వ్యతిరేక శక్తులనో విమర్శిస్తే సరిపోదు. ఈ విషయంలో ముస్లిం మత పెద్దల, ముస్లింల స్వయంకృతాపరాధం కూడా ఎక్కువే!

ప్రస్తుతం ముస్లింలను 'ఎవరైనా నవాబుగారని పిలిస్తే, పలుకరింపుతో, వెక్కిరింపుతో అర్థంకాని సంక్లిష్ట సందిగ్దావస్థ! ముస్లింలు నేడుదరిద్రానికి చిరునామాగా మారారనడంలో సందేశం లేదు. ఈ పరిస్థితుల్లో స్వయాన ముస్లింలలోనూ మార్పులు రావలని కవి బలంగా సమ్మతున్నారు "....ఐదు పూటలా నమాజు చెయ్యమని / అందంగా చెప్పే నమాజీలే కాని / కట్నాల్ని తీసుకొని / నిజమైన సమాజీలెంత మంది? /" అని నిలదీసారు. కట్నాల మార్కెట్‌లో తమ కూతుళ్ళ వివాహాలు చేయలేని తండ్రుల అశక్తతని ఎత్తిచూపారు... షాదీ మేళాల్ని విని / చిన్నబోయిన ప్యారీ బేటీని చూస్తే / కడుపులో ఎవరో / చేయివేసి దేవినట్లుండేది /" అంటారు.

ఇస్లాం మతంలో కులాల్లేవు. సోదరభావం, సౌభాతృత్వం వెల్లివిరిస్తుందీ మతంలో అంటుంటారు. ఆచరణలో ఇందుకు భిన్నమైన వైఖరి కనిపిస్తుంది. ఉర్దూ భాష మాట్లాడలేని వారిని, బి.సి. ముస్లింలను ముస్లిం సోదరులు చిన్న చూపు చూడడం, వారితో ఎటువంటి సంబంధబాంధవ్యాలు కొనసాగించకపోవడం జరుగుతూంటుంది. వీటన్నింటిని కరీముల్లా తన కవిత్వంలో ఎత్తి చూపారు. ఇస్లాం సిద్ధాంతాల్లోని సమానత్వం ఆచరణలోకి రావాలని కాంక్షించారు

ఈ దేశంలో ముస్లింలపై దాడులు జరగడం అనవాయితీగా మారిపోయింది. కాశ్మీర్ నుండి కన్యాకుమారి వరకు ఎక్కడా, ఎప్పుడేం జరిగిన దేశ వ్యాప్తంగా ఉన్న ముస్లింలు బిక్కుబిక్కుమంటూ రోజులు గడ్పాల్సిందే! "... ఇక్కడ గొంతులు కోయడానికి / తడిగుడ్డల అవసరం లేదు / అంతా స్వేచ్ఛగానే / మరింత స్వేచ్ఛగానే / మానవయాగం సాగుతుందిక్కడ /" అంటారు. "పాతబస్తీకి, పాలస్తీనాకూ / ముఖకవళికలు ఒకటవుతున్నాయి" అని ఆవేదన చెందుతారు.

కేవలం ముస్లింల జీవితాలను, వారి చుట్టూ అల్లుకుంటున్న చీకట్లను మాత్రమే కాక ప్రపంచీకరణలో భాగంగా వచ్చిన మార్పులు, అమెరికా పెత్తందారీ తనము, పొరుగున ఉన్న పాకిస్తాన్ దుశ్చర్యలు అన్నింటిని ఎత్తిచూపుతూ "సాయిబు" దీర్ఘ కవిత విస్తృతిని పెంచారు. గొప్ప ఆశావాదంతో "... ఇప్పుడు నేను కలకోసం కాదు / కలవరం లేని కలకోసం / గాయాల సలపరం లేని కలకోసం / కల కాని కల కోసం / స్నేహసుమాల కలకోసం / ఎదురు చూస్తున్నా... /" అంటారు. ఇంకా "మన ఇల్లు మనకు మూగభాష నేర్పక మునుపే / మన దేశం మనది కాకుండా పోక మునుపే / ముసిబారిన బతుకుల్లో / ఒక రవ్వను వెలిగిద్దాం / గొంతులు సవరిద్దాం... /" అంటూ పిలుపునిస్తున్నారు.

"సాయిబు" దీర్ఘకవిత ముస్లింల అస్థిత్వవాదాన్ని అంతర్జాతీయ స్థాయిలోకి తీసుకెళ్ళడంలో సఫలమయింది. మంచి కవితా శైలితో రక్తి కట్టింది. ముస్లింల ఆవేదనను, ఆలోచనలను, మనోభావాలను వెల్లడించింది. అయితే ఇలాంటి కృషి మరింత జరగాలి. ముస్లింల జీవితం తెలుగు సాహిత్యంలో సంపూర్తిగా ఆవిష్కరించబడాలి.

**(సాయిబు : కవిత : కరీముల్లా, ధర : రు. 25/-లు ప్రతులకు : ప్రజాశక్తి, విశాలాంధ్ర పుస్తక విక్రయ కేంద్రాలు)**

**సి.సి.**




## 'నగరంలో నగ్నసత్యాలు'

మన రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నగరంలో జరుగుతున్న కొన్ని వాస్తవ నగ్నసత్యాలను చూస్తూ వుండిపోలేక అవిగా తన బాధ్యతగా గుర్తెరిగి నగరంలో నగ్న సత్యాలు పేరిట తన ఆవేదనను కవిత్వకరించి బట్టబయలు చేశారు. కె.హరనాథ్, నగరంలో జరుగుతున్న అవినీతి, ప్రభుత్వ కార్యకలాపాల్లోని అలసత్వం అసహనం, పాశ్చాత్య పోకడల విష సంస్కృతి నడుమ మన దేశ సంస్కృతికి పడుతున్న అధోగతి 'ప్రగతి' పొలాలు హలాలై అపార్టుమెంట్ల సంస్కృతి, ఒకటేమిటి? నగరంలో జరుగుతున్న అనేకానేక సమస్యలన్నీ ఈ సంపుటిలో ఆవిష్కరింపచేసి ఈ దుస్థితి నుండి బయటపడేందుకు మార్గాల్ని వెతికేందుకు ప్రయత్నాలకి ఉసిగొల్పుతుంటే సంపుటి. ఇది దీర్ఘకవిత కనుక ఇందులో చాలా సమస్యను వ్యక్తీకరించే సౌకర్యాన్ని కవి పూర్తి వినియోగించుకున్నారు.

"నగరాలు / గమ్మత్తుల జిమ్మిక్కులు / డేంజరు రూట్లు వైకుంఠానికి మెట్లు / బ్రాకెట్ల రాకెట్లు / హైటెక్ హంగుల / రిగ్గింగులు.... ఫ్రండ్‌షిప్ క్లబ్బుల / ముసుగుల్లో / ప్రేమాయణాలు' అంటూ 'పేట్రేగిన / సెల్‌ఫోన్ల ధోరణులు / స్టార్ టివీల / వ్యామోహంలో / యువకుల పెడద్రోవలు' .... 'వ్యాలంటైన్ డే'ల / వెర్రి వ్యామోహాలు / ఇండియాకు ఇంపోర్టయిన / పాశ్చాత్య యవ్వారాలు' అని నగ్నసత్యాలను కవితా కొరడాతో ఝుళిపిస్తారు కవి. ఏ ఏ దుష్ప్రభావాలు నగర ముసుగు నీడలో పొంచి వున్నాయో వరసగా వచన కవిత్వ రూపంలో చెప్పుకు పోతున్నట్లుండె ఈ కవితల్లో ఇంటర్నెట్లు సుడిగుండాలు, సైబర్ నేరాల చిట్టాలు, స్టాంపు కుంభకోణాలు, నకిలి సర్టిఫికెట్లు, బార్ & రెస్టారెంట్లలో క్యాబరేలు, పాతుకుపోయిన డైవర్స్ వెంచర్, అమెరికా అల్లుళ్ళకై ఆరాటాలు, అరబ్ షేక్‌ల ఆగడాలు, గోల్‌మాల్ బ్యాంకుల గ్లోబల్ జిత్తులు, ఒక్కటేమిటి? నగరంలో అన్ని సమస్యలు, దుష్ప్రభావాలు విపులంగా కళ్ళకు కట్టినట్లు రచించటంలో సఫలీకృతులయ్యారు హరనాథ్. ఇంకా ఘాటైన పద ప్రయోగంతో, పటుత్వంతో రాసినట్లయితే ఈ 'మరకల' మహానగరానికి చురకలు చాలా బాగా పేలేవి. ఈ సంపుటికి ముందుమాట రాసిన ప్రొఫెసర్ ఎస్వీ సత్యనారాయణ రాసిన నగరంలో... మొన్న... నిన్న... నేడు పూర్వాపరాలు చర్చించటం వలన ఆ తేడా గురించి ఆలోచింపచేసి ఈ సంపుటికి మరింత ప్రయోజనం కలిగించింది.

**(నగరంలో నగ్నసత్యాలు (దీర్ఘకవిత), రచన : కె.హరనాథ్, పేజీలు :35.12, వెల : రు.30/-, ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్, విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలలో)**

# అక్షర లోకంలో అనుభవాల కలబోత

## మూడు సాహిత్య శాలలు- విలువైన అనుభవాలు

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో మార్చి నెలలో విజయవాడ, హైదరాబాదులలో జరిగిన సాహిత్యశాలల తర్వాత మూడవది మే 28,29 తేదీలలో కర్నూలులో జయప్రదంగా జరిగింది. 250 నుంచి 300 మంది వరకు సాహితీమిత్రులు పాల్గొన్నారు.

విభిన్న భావాలకు, తరాలకు, ప్రక్రియలకు ప్రాతినిధ్యం వహించే ప్రగతిశీల సాహిత్య ప్రముఖులు దాదాపు యాభై మంది వరకూ ఈ సాహిత్యశాలల్లో వక్తలుగా పాల్గొన్నారు. విజయవాడలో చేకూరి రామారావు, హైదరాబాదులో సింగమనేని నారాయణ, కర్నూలులో రాచపాళెం చంద్రశేఖర రెడ్డి ప్రారంభకులుగా వ్యవహరించారు. జ్వాలాముఖి, కె.శివారెడ్డి, అద్దేపల్లి రామమోహనరావు, యాకూబ్, ముక్తవరం పార్థసారథి, జిలుకర శ్రీనివాస్‌లు మూడింటికి హాజరయ్యారు. చేకూరి రామారావు, ఓల్గా,కేతు విశ్వనాథరెడ్డి, కాలువమల్లయ్య, కళ్యాణరావు, హెచ్చార్కె, హిమజ్వాల, రెండు చోట్ల పాల్గొన్నారు. బయిటివారికి తోడు స్థానికంగా వుండే రచయితలు, ప్రతిచోటా వక్తలుగా పాల్గొన్నారు. విజయవాడలో, హైదరాబాదులో కవిత్వం, కథ చర్చలు ఏకకాలంలో వేర్వేరు చోట్ల జరిగాయి. దీనివల్ల ఏదో ఒకటికోల్పో వలసి వస్తుందని మిత్రులు అభిప్రాయం వెలిబుచ్చడంతో కర్నూలులో ఒకే సెషన్‌గా సాగింది. రెండవ రోజు కార్యక్రమాలు మాత్రం మూడు చోట్ల విభిన్నంగా వున్నాయి. విజయవాడలో మీడియా,బాల సాహిత్యంపై చర్చలు జరిగితే హైదరాబాదులో భాష, విమర్శ సెషన్లు జరిగాయి. కర్నూలులోనైతే సాహిత్యంలోచర్చ నీయాంశాలు అన్న అంశంపై గోష్టి జరిగింది.

ఈ మూడు సాహిత్యశాలలు ప్రగతిశీల సాహితీ మిత్రులకు విలువైన అనుభవాలనిచ్చాయి. ప్రతిభాసంపత్తులు కలిగిన ఇంతమంది వక్తలు ఒకే వేదికనుంచి పాల్గొనడం వల్ల అర్థవంతమైన చర్చ జరిగింది. తెలుగు సాహిత్య సృజనలోనూ, చర్చలోనూ కూడా ఇలాటి విశాలదృష్టి అవసరాన్ని అందరూ నొక్కి చెప్పారు.

ఈ కార్యక్రమాలను బట్టి తెలుగులో సాహిత్యం పట్ల ఆదరణ ఎంత విస్తృతంగా వున్నదీ విదితమైంది. మూడు చోట్ల జరిగిన వాటికీ వాటి వాటి ప్రత్యేకతలున్నాయి. సాంస్కృతిక కేంద్రంగా పేరు పొందిన విజయవాడలో చాలా కాలం తర్వాత భారీ సాహిత్య కార్యక్రమం ఇది అని అందరూ అభినందించారు.సభల్లో ప్రసంగించని వేగుంట మోహనప్రసాద్ వంటి పెద్దలు సాహిత్య కార్యక్రమం ఈ స్థాయిలో జరుగుతుందని వూహించలేదని అభినందించారు. అధికారిక సమ్మేళనాలు ఎక్కువగా జరిగే హైదరాబాదులో ఇది విభిన్నంగా వుందని పలువురు మిత్రులు సంతోషం వెలిబుచ్చారు. ఇంత విశాల కార్యక్రమం తాము ఇంత వరకూ చూడలేదని హైదరాబాదులో సింగమనేని, వంటివారన్నారు. హైదరాబాదు కార్యక్రమానికి సుందరయ్య విజ్ఞాన కేంద్రం సంయుక్తంగా ఆధ్వర్యం వహించింది.

కొద్దిమంది మిత్రులు హైదరాబాదులో అపార్థాలు పెంచుకున్నప్పటికీ సాహిత్యశాల మాత్రం నిర్విఘ్నంగా సాగింది. తర్వాత కాలంలో దీనిపై వివాద గ్రస్తమైన వ్యాఖ్యలు చేసినా సాహితీస్రవంతి స్నేహపూర్వకంగా సంయమనం పాటించింది. అనుకున్న ప్రకారం కర్నూలులో మూడవ శాల దిశగా సాగిపోయింది. చివరిదైన కర్నూలు సాహిత్యశాల హైదరాబాదు, విజయవాడ కేంద్రాల స్థాయిలో జరక్కపోవచ్చునని కొందరు సందేహాలు వ్యక్తం చేసినప్పటికీ వాస్తవంలో అది కూడా అదే స్థాయిలో జరిగింది. వచ్చిన వారిలో యువత గణనీయంగా వుండటం విశేషం. అందులోనూ విద్యార్థులు ఎక్కువ మంది వున్నారు. కర్నూలులో విద్యార్థినులు కూడా ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు.

కొత్తగా రచనలు చేసే వారు గతం గురించి తెలుసుకోవాలని, తమ భవిష్యత్ కృషికి అవసరమైన మార్గదర్శక సూత్రాలు నేర్చుకోవాలని ఎంతో ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు.. ఒక విధంగా చెప్పాలంటే వారు ప్రధానంగా రచనా ప్రక్రియ గురించి, పద్ధతుల గురించి తెలుసుకో గోరుతున్నారు. సాహిత్యపరమైన ఉదాహరణలతో, ప్రతీకలతో సాగే ప్రసంగాలను ఎక్కువ కోరుకుంటున్నారు. వాటికి చక్కగా స్పందిస్తున్నారు.

పాతరచనలతో పాటు కొత్తవారి రచనల గురించి సీనియర్లు చెప్పాలని ఔత్సాహికులు కోరుకుంటున్నారు. సాహిత్య ప్రసంగాల్లో కొన్ని సార్లయినా తమ కవితలు, కథలు, రచనలు ఉటంకించ బడాలని కూడా భావిస్తున్నట్టు అనిపించింది. అందుకు తగినట్టే చాలామంది వక్తలు నూతన తరం రచనలను కూడా ఉదహరించి ఉత్సాహపరచారు. విదేశీ సాహిత్యం కన్నా దేశీయమైన తెలుగుకు సంబంధించిన ఉదాహరణలుంటే బావుంటుందన్న భావన కూడా వ్యక్తమైంది.

సాహిత్య చరిత్ర గురించి, దళితవాదం, స్త్రీవాదం, మైనారిటీ వాదం వంటివాటి ప్రభావం గురించి తెలుసుకోవాలనే ఆసక్తి సాహితీ మిత్రులలో వుంది. సాహిత్యానికి స్థానీయ అంశాలకు సంబంధించిన కోణం కూడా పరిశీలిస్తున్నారు. సాహిత్యశాలల్లో అవన్నీ ప్రస్తావనకు వచ్చాయి. ప్రపంచీకరణ మానవ విలువల విలుప్తత గురించి వింటున్నా దానికి ప్రత్యామ్నాయమేమిటనే ప్రశ్న కూడా తలెత్తుతోంది. సాహిత్య సామాజిక సాంస్కృతిక కోణాలను మేళవించి ఈ అంశాలు విశద పరచడాన్ని బాగా ఆస్వాదించారు.

ఎలాటి అస్తిత్వాలూ ప్రపంచీకరణ ప్రభావానికి అతీతం కాదు గనకదాన్ని వ్యతిరేకించే విషయంలో ఉమ్మడిగా వుండాలన్న భావన వక్తలోనూ శ్రోతల్లోనూ కూడా బలంగా వ్యక్తమైంది. ఆ దృష్ట్యా ఇలాటి విశాల వేదికలు ఆహ్వానించదగినవన్న మాట దాదాపు అందరి నుంచీ వచ్చింది. అన్ని రకాలైన అసమానతలు, ఆధిపత్యాలపై అక్షర యుద్ధం సాగించి జనావళిని చైతన్యపరచాలన్నదే వారందరి ఉమ్మడి పిలుపుగా ప్రతిధ్వనించింది.

దేశ విదేశీ కవులు రచయితలతో ఏర్పాటు చేసిన ఫోటో ఎగ్జిబిషన్ కూడా అన్ని చోట్ల ఆహూతులను ఉత్తేజపరచింది. చాలామంది చేతులలో నోట్‌బుక్ పట్టుకుని ఆ వివరాలు, కొటేషన్స్ రాసుకోవడం కనిపించింది. పలువురు తమకూ అలాటి ఎగ్జిబిషన్ ఫోటోల సెట్ కావాలని కోరారు. రోజువారీ రాజకీయపరిణామాల మధ్యనే మీడియా కూడా ఈ సాహిత్యశాలలకు మంచి ప్రాధాన్యత నిచ్చింది. పలువురు మీడియా మిత్రులు, కాలమిస్టులు కూడా సభల్లో వక్తలుగా పాల్గొన్నారు.

ఇంతమంది ప్రముఖులను ఒక్కచోట చూడటం సంతోషంగా వున్నా వారందరూ

## సాహిత్యశాలలో పాల్గొన్నవారు

### హైదరాబాదు

**మొదటి రోజు - 26,3,05**

ప్రారంభకులు : సింగమనేని నారాయణ
సభాధ్యక్షులు : తెలకపల్లి రవి
ఎగ్జిబిషన్ ప్రారంభకులు : సి. సాంబిరెడ్డి(కార్యదర్శి, సుందరయ్య విజ్ఞాన కేంద్రం)

కవిత్వ సెషన్

సమన్వయం : యాకూబ్
వక్తలు : జ్వాలాముఖి, శివారెడ్డి, అద్దేపల్లి రామమోహనరావు, హిమజ్వాల, శిఖామణి, జిలుకర శ్రీనివాస్,

కథ, నవల

సమన్వయం : డా. పిల్లల మర్రి రాములు
వక్తలు : జి. కళ్యాణరావు, ముక్తవరం పార్థసారథి, సలీం, బిఎస్‌రాములు,ఓల్గా, కె.బి. లక్ష్మి(ఎడిటర్, విపుల, చతుర)

అనంతరం ముఖాముఖి జరిగింది.

**రెండవ రోజు - మార్చి 27 - భాష, సాహిత్యం మీడియా**

అధ్యక్షులు : కేతు విశ్వనాథరెడ్డి
వక్తలు : చేకూరి రామారావు, డి. చంద్రశేఖరరెడ్డి, తెలకపల్లి రవి

సాహిత్యం, విమర్శ

అధ్యక్షులు : తెలకపల్లి రవి
వక్తలు : కె.కె. రంగనాథాచార్యులు, హెచ్చార్కె శిఖామణి

### కర్నూలు

**మే 28**

ప్రారంభం : డా. రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
అధ్యక్షులు : కె. శివారెడ్డి
ఎగ్జిబిషన్ ప్రారంభం : కాలువ మల్లయ్య
సమన్వయం : తెలకపల్లి రవి

మొదటి సెషన్

సమన్వయం : యాకూబ్
పాల్గొన్నవారు : ముక్తవరం పార్థసారథి,జి. వెంకటకృష్ణ, జిలుకర శ్రీనివాస్, జ్వాలాముఖి, ఓల్గా,శిలాలోలిత, కాశీభొట్ల వేణుగోపాల్ శివారెడ్డి, హిమజ్వాల

**రెండవ రోజు - మే 29**

రెండవ రోజు సెషన్

అధ్యక్షులు : తెలకపల్లి రవి
వక్తలు : అద్దేపల్లి రామమోహనరావు, మేడిపల్లి రవి కుమార్, పత్తిఓబులయ్య, ఇనాయతుల్లా, రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, సుధామ

వివరంగా మాట్లాడ్డం కుదరలేదనే కొరత వుండిపోయింది. ఒకేసారి తినలేనన్ని పదార్థాలు పళ్లెంలో వడ్డించినట్టయింది. భవిష్యత్తులో ప్రత్యేకంగా కొన్ని అంశాలకే పరిమితంచేసి ఇంకా లోతైన చర్చ జరపాలని ముగింపులో సూచనలు వచ్చాయి. మహిళలు మరింత ఎక్కువగా పాల్గొనేలా చూడాలని కూడా సూచనలు వచ్చాయి.

కర్నూలులో శిలాలోలిత కవితా సంపుటి 'ఎంతెంత దూరం', విజయవాడలో అల కవితా సంపుటి 'నిప్పుల వాగు' ఆవిష్కరించారు. సాహిత్యశాల వర్క్‌షాప్ అనడం వల్ల ఇక్కడేమైనా రచనలు చేయించి సరిచేస్తారా అని కొందరు అడిగారు. రెండు చోట్ల కవి సమ్మేళనాలు జరిగాయి గాని ప్రత్యేకించి అక్కడికక్కడ రాయించి పరిశీలించే అవకాశం కలగలేదు. ఆ విధమైన అవకాశం వుంటుందని ప్రకటించినా సభికులు తాముగా ఏమీ పరిశీలనకు సమర్పించలేదు.

సాహితీ స్రవంతి ప్రగతిశీల లౌకిక సాహిత్య కారుల విశాల వేదికగా పనిచేస్తోంది. ప్రపంచీకరణ, మతోన్మాదం, టెర్రరిజాలను వ్యతిరేకించే సాహితీమిత్రులందరికీ అది స్వాగతం పలుకుతుంది. సాహిత్యశాలలు ఆ కృషిలో భాగాలే.

**కార్యకర్తల విశేషకృషి**

ప్రస్థానం మేనేజర్ కె. లక్ష్మయ్య మూడు సాహిత్య శాలలకు వక్తల రాకపోకలకు బాధ్యత వహించి, ప్రచారంలో, ఏర్పాట్లలో పాలు పంచుకున్నారు. గణేష్ ఎగ్జిబిషన్, వేదికల ఏర్పాటు బాధ్యత వహించారు. కర్నూలు సాహితీ స్రవంతి కన్వీనర్ ఎ.బి. బసవరాజ్, కో-కన్వీనర్ కెంగార మోహన్, గోరంట్లప్ప, తదితరులు సాహిత్యశాల విజయానికి ఎంతగానో కృషి చేశారు.

చివరగా సాహిత్యశాల అన్నమాట గురించి. సాధారణంగా సాహిత్య పాఠశాల అనేది వాడుకలో వుంది. అలాగే ఇంగ్లీషులోనైతే వర్క్‌షాప్ అనేవారు. ఏదైనా మరింత అర్థవంతమైన పేరుకోసం చేసిన ఆలోచనలో ఈ పేరు స్ఫురించింది. గత మూడేళ్లనుంచి వివిధ సాహిత్య కార్యక్రమాలు నిర్వహిస్తూ రెండేళ్లుగా ప్రస్థానం పత్రిక అందిస్తున్న సాహితీ స్రవంతి చేపట్టిన సాహిత్యశాలలు విజయవంతమవడానికి సాహితీమిత్రుల అభిమానమూ, అండదండల కారణం. అన్నిచోట్ల స్థానిక బాధ్యులు ఎంతో చైతన్యంతో వీటిని విజయవంతం చేసేందుకు కృషి చేశారు. సాహిత్యాభిమానులైన పెద్దలు కొందరు నిర్వహణకు సహకరించారు. వీటి స్ఫూర్తితో మరికొన్ని కొత్త కేంద్రాల్లో సాహిత్యకార్యక్రమాలు ఈ రెండుమాసాలలోనే మొదలైనాయి. ఇది వరకటి నుంచి జరుగుతున్న చోట్ల కొనసాగు తున్నాయి. రానున్న మూడు మాసాలలో మరిన్ని వినూత్నమైన కార్యక్రమాలు జరపాలని సాహితీ స్రవంతి భావిస్తోంది.

(వార్త, ప్రజాశక్తి సౌజన్యంతో)

# చారిత్రక అవసరం

## సాహిత్యశాలపై ప్రముఖుల మనోభావాలు

సాహిత్యవేదిక నేటి చారిత్రక అవసరమని ప్రముఖ కవులూ రచయితలూ తమ మనోభావాలను వ్యక్త పరిచారు. సాహిత్యశాలకు రాష్ట్ర నలుమూలల నుంచీ వచ్చిన ప్రముఖులను భోజన విరామ సమయంలో ప్రజాశక్తి పలకరించింది. హైదరాబాద్‌లోనూ, విజయవాడలోనూ సాహిత్యశాల నిర్వహించిన సందర్భంగా అక్కడ పాల్గొన్న వారిని కదిలించింది. వారి అభిప్రాయాలు వారి మాటల్లోనే...

### ఉత్తమ రచనలకు మార్గదర్శి : జ్వాలాముఖి



సాహిత్యశాల అవసరం చాలా ఉంది. రచయితలు ఎవరికి వారుగా ఉండడంకంటే నలుగురూ ఒక చోట చేరి సామాజిక అంశాలపై సాహిత్య అంశాలను జోడించి ఆలోచించడం ద్వారా ఉత్తమ రచన రావడానికి అవకాశముంది.

### విశాలత్వాన్ని కోరే వేదిక : హిమజ్వాల



సాహిత్యశాల విశాలత్వాన్ని కోరే వేదిక. సాహిత్యకారులకు ఊపిరి పీల్చుకునేలా ఉంది. భిన్న స్వరాలను ఒక చోట చేర్చి వేదిక ఏర్పాటు చేసిన ఘనత సాహిత్యశాలదే. గత రెండు ప్రాంతాలకన్నా కర్నూలు కార్యక్రమం ఏమీ తీసిపోదు

### రచయితలకు చాలా ఉపయోగం : ముక్తవరం పార్థసారథి



ఔత్సాహిక రచయితలకు చాలా ఉపయోగం సాహిత్యశాల. నేర్చుకున్న వాళ్ళకు నేర్చుకున్నంత ఉంది ఈ కార్యక్రమంలో విని ఊరుకోకుండా ఉపన్యాసాలకు స్పందించి సొంతంగా ఆలోచిస్తే మరింత ఉపయోగం.

### ధిక్కారస్వరాల వేదిక : ఓల్గా



సాహిత్యశాల ధిక్కారస్వరాల వేదిక. ప్రపంచీకరణ, టెర్రరిజం, మతోన్మాదం వంటి అంశాలు పెచ్చురిల్లుతున్న నేటి తరుణంలో రకరకాల సాహిత్యకారులను ఒక వేదికపైకి చేర్చి నేటి అవసరాన్ని గుర్తింపచేసే సాహిత్యశాల నేటి పరిస్థితికి అత్యవసరం. ఈ సాహిత్యవేదికను పెంచి పోషిద్దాం.

### ఐక్యతకు ఉపయోగం : హెచ్చార్కె



సాహిత్యశాల కవులూ రచయితల ఐక్యతకు ఉపయోగం. ఇది సాహిత్యకారుల అవసరం. హైదరాబాదు, విజయవాడల్లో జరిగిన ఈ కార్యక్రమాలకు మంచి రిసెప్షన్ లభించింది. రచయితలు మంచిగా స్పందించారు.

### మంచి ప్రయత్నం : శిలాలోలిత



సాహిత్యశాల మంచి ప్రయత్నం. కొత్త రచయితల తరానికి ఇది మంచి ఉపయోగం. రచయితలకూ, పాఠకులకూ మధ్య గ్యాప్‌ను నివారించే ప్రయత్నమే ఈ సాహితీశాల. రాబోయే తరం వారికి ఇది మంచి గైడెన్స్‌లా ఉపయోగపడుతుంది.

### విశాల సాహిత్య నిర్మాణ వేదిక : యాకూబ్



సాహిత్యశాల విశాల సాహిత్య నిర్మాణ వేదిక. రాష్ట్రంలో సాహితీ స్రవంతి చేస్తున్న కృషి ఇప్పటి అవసరం. అనేక పాయలుగా మారిపోయిన సాహిత్యం ఈ ప్రయత్నంతోనైనా ఒక మంచి భావజాలాన్ని ముందుకు తేవాలి. ఇటువంటి వేదికలను పాదులుగా చేసుకుని సాహిత్యం తాను చేయాల్సిన పని అది చేస్తే మిగతాపనిని తక్కిన శక్తులు పూర్తి చేస్తాయి.

### ఈనాటి తప్పనిసరి అవసరం : శివారెడ్డి



ఈనాటి తప్పనిసరి అవసరం సాహిత్యశాల, భిన్న భావాలకి, భిన్న భావజాలాలకు ప్రతినిధులైన సుప్రసిద్ధులను ఇటువంటి వేదికపై మాట్లాడించడం ఎంతైనా అవసరం. కొత్త రచయితలకు ఈ తరగతులు బాగా ఉపయోగపడతాయి. ఒకేచోట రెండ్రోజులపాటు ప్రముఖ సాహిత్యకారులతో కొత్తతరం సాహిత్యకారులుండడం వారికి ఒక అదృష్టం. పరస్పర ప్రేరకం. ఉత్తేజకరం. ఇటువంటి శాలలు ఎంత ఎక్కువగా జరిగితే అంత మంచిది.

### కొట్టుకుపోయే సాహిత్యాన్ని కాపాడే ప్రయత్నం : సుధామ

నేడు కార్పొరేట్ రంగంలో కొట్టుకుపోయే సాహిత్యాన్ని కాపాడే ప్రయత్నమే ఈ సాహిత్యశాల. నేడు సాహిత్యం కాసులకమ్ముడుపోతూ పెట్టుబడిదారుల కొమ్ముకాస్తూ తప్పుడు నడక నడుస్తున్న తరుణంలో ఇలాంటి శాలలు ఎంతైనా అవసరం. విస్తృతంగా సాహిత్య భావజాలాన్ని వెదజల్లాలి. ఇటువంటి వేదికల ద్వారా రచయిత ఒక సాంస్కృతిక సైనికుడిలా మారాలి.

### పని సంస్కృతిని పెంచడానికి కృషి చేయాలి : కాలువ మల్లయ్య



ప్రధాన శత్రువులతోపాటు ఇంటి శత్రువులనూ గుర్తించి పని సంస్కృతిని పెంపొందించి గొప్ప సాహిత్యం రావాల్సిన దిశగా సాహిత్యశాల కృషి చేయాలి. ప్రపంచీకరణ మత్తులో అన్నీ మాయమైపోతూ, స్థానియత, కళలూ, సంస్కృతి వైరైకరణకు గురవుతూ ఎలక్ట్రానిక్ మీడియా విశృంఖలనాలకు మనం మనం కాకుండా పోతున్న సమయంలో ఇటువంటి సాహిత్యశాల ఎంతైనా అవసరం.

('ప్రజాశక్తి' కర్నూలు ఎడిషన్ సౌజన్యంతో)

# స్వీకారం




పర్యాయపదం
బాణాల శ్రీనివాసరావు
వెల : రు. 50

అతని తోటలో
వి.ఎస్.ఎస్. హేమ
వెల : రు. 100




నిషిద్ధాక్షరి
మందరపు హైమవతి
వెల : రు. 50







పొగచూరిన ఆకాశం
అద్దేపల్లి రామమోహనరావు
వెల : రు. 75
ప్రచురణ : అద్దేపల్లి సాహిత్య ఫౌండేషన్, కాకినాడ




స్పర్శ
బండ్ల మాధవరావు
వెల : రు. 30
ప్రచురణ : ముప్వా చినబాపిరెడ్డి మెమోరియల్ ట్రస్ట్, పెదపరిమి

సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి
బి.ఎస్. రాములు
వెల : రు. 50
ప్రచురణ : విశాల సాహిత్య అకాడమి




నాజీ హిట్లర్ (ద్వితీయ భాగం)
విలియం ఎల్. షీరర్
వెల : రు. 30
ప్రచురణ : ప్రజాశక్తి బుక్‌హౌస్







పురోగమిస్తున్న విప్లవం
క్యూబా
ఇసాక్ సానీ
వెల : రు. 75
ప్రచురణ : ప్రజాశక్తి బుక్‌హౌస్

## పాఠకులు, రచయితలకు...

### సవరణ - గావు కథా రచయిత బోయ జంగయ్య

2005 జనవరి - మార్చి ప్రస్థానం 29వ పేజీలో ప్రచురితమైన 'గావు' కథా రచయిత బోయ జంగయ్యగా గమనించగోరతాము. రచయిత పేరు పొరపాటుగా మరొకటి వచ్చినందుకు చింతిస్తున్నాం.





కర్నూలులో మే 28న ఫోటో ఎగ్జిబిషన్ ప్రారంభించిన కాలువ మల్లయ్య, శివారెడ్డి, సుధామ, తెలకపల్లి రవి, కె.మోహన్ తదితరులు




కె.శివారెడ్డి అధ్యక్షోపన్యాసం.వేదికపై యాకూబ్, సుధామ, హెచ్చార్కె ఓల్గా, శిలాలోలిత తదితరులు



రాచపాలెం చంద్రశేఖరరెడ్డి ప్రారంభోపన్యాసం



ప్రసంగిస్తున్న ఓల్గా



ప్రసంగిస్తున్న జ్వాలాముఖి.





గేయాలాపన చేస్తున్న సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ బసవరాజు, వాసు తదితరులు.



ప్రసంగిస్తున్న కాలువమల్లయ్య

# కాలుని పాశం కరెంటు తీగ

**డా. కలువకుంట రామకృష్ణ**

నిన్నటిదాకా వెలుగులందించే కరెంటు తీగ...
రైతుల జీవితాల్లో చీకట్లను చిమ్ముతున్న చిచ్చుబుడ్డె ఈనాడు..
విద్యుద్దహన వాటికలైనా... చచ్చిన శరీరాల్నే దహిస్తాయి...
ఈ విద్యుత్తీగ ముందు యముడి పాశమూ ఓడిపోతుంది.
బిల్లుల 'షాక్'ల ముందు - విద్యుత్ షాకూ... చిన్నబోతుంది.
నిన్నటిదాకా అన్నం పెట్టిన ప్రాణం...
పక్షిలా విలవిలలాడుతూ...
కరెంటు తీగకు వేలాడుతుంది
నిప్పుల్ని చిమ్మడమే తెలిసిన తీగకు 'నిద్ర'నే వుండదు
'దీర్ఘనిద్ర'కు సాగనంపేదాకా...!
కరెంటు తీగ.. మానవ రక్తానికి అలవాటుపడ్డ మృగం.
ఉచితం... ఉచితమన్న ఆశకుపోయి
ఉచితంగానే ప్రాణాలు పోగొట్టుకున్న రైతన్నా!
నీకు ఏలికలిచ్చిన ఈ "ఉచిత సన్మానం" అందుకో!
పులీ - బాటసారీ కథ నువ్వొకసారి చదివినా
ఈ బాధ వుండేది కాదేమో!
కరెంటు తీగకు కడుపు తీపి రుచేం తెలుసని!
దానికే... హృదయముంటే...
ఈ ముసుగు మనుషులకు
అందనంత దూరంగా... పారిపోయేది.
బషీర్‌బాగ్ చౌరస్తా యుద్ధానికి మౌనసాక్షినప్పుడే
విద్యుత్ హృదయం మాడి మసైపోయింది
ఇప్పుడది... ఎక్కడ ఎలక్ట్రిక్ దీపాల్ని వెలిగించాలో...
ఎక్కడ జనం గుండెల్ని కాల్చాలో
ఏలిన వారి కనుసన్నల్లో నడిచే వెట్టిబానిసైంది
తీగల చేతుల్తో
పొలాలకు కాసిన్ని నీళ్ళిచ్చి ఊరడిద్దామన్నా...
అయ్యవారి ఆజ్ఞలేదాయే!
వీధులేడుస్తున్నా...
మెడువారిన చీకటి రూపాల్లా స్తంభాలు నిలుచున్నా...
పొలాలు దాహార్తితో నోళ్ళు తెరిచినా...
నిస్సహాయంగా చూస్తూ... నిట్టూరుస్తూ...
చేయని పాపానికి తానూ - కారణమై....
మాడిమసైన బూడిదలో
రైతు నేస్తాల ముఖాలను మాటికిమాటికి చూస్తూ...
"తనకు మరణమున్నా బావుండేది"
తానొకరి మరణానికి కారణం కాకుండేదని...
నిశ్శబ్దంగా రోదిస్తోంది!







## శ్రీశ్రీ బాటలో సాహిత్య ప్రస్థానం 22వ వర్ధంతి నివాళి

మహాకవి శ్రీశ్రీ సాహిత్య వారసత్వం నిత్యనూతనమైందని, నేటి ప్రపంచీకరణ పరిస్థితులలో ప్రగతిశీలులందరికీ అనుసరణీయమని వక్తలు అభివర్ణించారు. శ్రీశ్రీ 22 వ వర్ధంతి సందర్భంగా ట్యాంక్‌బండ్‌పై ఆయన విగ్రహం వద్ద సాహితీ స్రవంతి నివాళి కార్యక్రమం నిర్వహించింది.

ఈ సందర్భంగా విగ్రహం వద్ద పూలమాల వేసిన సీనియర్ కవి జ్వాలాముఖి మాట్లాడుతూ సామ్యవాద విప్లవ శంఖారావమే శ్రీశ్రీ కవిత్వమన్నారు. శ్రీశ్రీ తెలుగు సాహిత్యంలో నూతన ధోరణులు ప్రవేశపెట్టాడని, పీడితులకోసమే సాహిత్యమని చాటి చెప్పారని తెలిపారు. సామ్రాజ్యవాద వ్యతిరేకత ఆయన కవిత్వంలో ప్రధానాంశమని నేటి ప్రపంచ పరిస్థితులలో అదే కీలకమని వివరించారు. యువతరాన్ని నవకవిత్వాన్ని శ్రీశ్రీ ఎప్పుడూ స్వాగతించేవాడని గుర్తుచేశారు.

కార్యక్రమానికి అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి మాట్లాడుతూ తమ సంస్థ ఆధ్వర్యంలో గత కొన్నేళ్లుగా రాష్ట్ర వ్యాపితంగా శ్రీశ్రీ వర్ధంతి సభలు నిర్వహించి ఆయన కవిత్వ ఔన్నత్యాన్ని సంస్మరించుకోవడం జరుగుతున్నదన్నారు. పదండి ముందుకు అంటూ మహాప్రస్థాన శంఖం పూరించిన శ్రీశ్రీ తెలుగు కవిత్వాన్ని కొత్తదారులలో నడిపించడమే కాక తొలిసారి శ్రామికవర్గ అంతర్జాతీయ భావనను ప్రవేశపెట్టాడన్నారు. ప్రపంచీకరణకు వ్యతిరేకంగా పోరాటాలు పెరుగుతున్న నేటి వాతావరణానికి ఆ మహాకవి వారసత్వం గొప్ప స్ఫూర్తినిస్తుందని చెప్పారు. కాదేదీ కవితకనర్హం అన్న శ్రీశ్రీ నవకవితా వైతాళికుడుగా నిలిచిపోయారని నివాళులర్పించారు. తెలుగు కవులు, కళాకారులు సంస్కర్తల విగ్రహాలున్న ట్యాంక్‌బండ్‌పై సాంస్కృతిక వాతావరణం ఏర్పరచేందుకు సాహితీ స్రవంతి కృషి చేస్తుందని ప్రకటించారు.

సాహిత్య విమర్శకుడు ద్వానాశాస్త్రి, కవి హిమజ్వాల శ్రీశ్రీకి జోహారులర్పిస్తూ మాట్లాడారు. మొదట స్వాగతం పలికిన సాహితీస్రవంతి నగర కన్వీనర్, శ్రీశ్రీ సాహిత్య పరిశోధకుడు మోతుకూరు నరహరి మహాప్రస్థాన గీతాలాపన చేశారు.

నివాళి సందర్భంగా శ్రీశ్రీ కవితా చరణాలతో రంగుల చార్టులు తయారు చేసి ప్రదర్శించారు. కె.లక్ష్మయ్య, జిలుకర శ్రీనివాస్, యాదగిరి రావు, కృష్ణారావు, సత్యభాస్కర్ తదితరులు పాల్గొన్నారు. ప్రజానాట్యమండలి గాయకుడు జగన్ పాటలు పాడారు. నగరంలో రెండు చోట్ల, రాష్ట్రంలో ఇతర అన్ని జిల్లాకేంద్రాలలో శ్రీశ్రీ వర్ధంతి సభలు జరుగుతున్నట్టు నిర్వాహకులు తెలిపారు.

→

## "భద్రాద్రికలాలు" ఆవిష్కరణ



"భద్రాద్రికలాలు" ఆవిష్కరణ సభలో (ఎడమ నుండి) టి. దుర్గాచారి, డా. కల్లూరి ఆనందరావు, మాల్యశ్రీ, మాగంటి సూర్యం, తెలకపల్లి రవి, డా. ఎం. బాబూరావు, కె. రాంకుమార్, యస్.సి.హెచ్. చక్రవర్తి, పల్లం మాధవీలత, జి. శంకరరావు

సమాజంలో మార్పు తేవలసిన బృహత్తర బాధ్యత కవులూ, రచయితలపై ఉందని భద్రాచలం పార్లమెంట్ సభ్యులు డా. మిడియం బాబూరావు పిలుపునిచ్చారు. సాహితీ స్రవంతి భద్రాచలం డివిజన్ శాఖ వెలువరించిన "భద్రాద్రికలాలు" కవితా సంకలనాన్ని ఆయన స్థానిక బి.ఎడ్ కళాశాలలో జరిగిన కార్యక్రమంలో ఇటీవల ఆవిష్కరించారు. ప్రజలలో వైజ్ఞానిక దృక్పథం పెంపొందించవలసిన ఆవశ్యకతను తెలియజేశారు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో భిన్నధోరణులు అన్న అంశంపై ప్రసంగించిన ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి తెలుగు సాహిత్యాన్ని మలుపు తిప్పిన ఘనత గురజాడకు దక్కుతుందన్నారు. ఆధునికంగా వచ్చిన సాహిత్య ఉద్యమాలు, వాదాలు ఆయా కాలాలలో వచ్చిన సాహిత్య పిడివాదాల నుండి పుట్టినవన్నారు. పలికించేవాడు సామాజికుడే కావాలి తప్ప ప్రభువు కారాదని రవి పేర్కొన్నారు. శ్రీమతి పల్లం మాధవీలత సాహిత్యంలో స్త్రీవాద పరిణామాన్ని, ప్రాముఖ్యాన్ని వివరించారు.

సాహిత్యాది కళల పట్ల ప్రజలలో తగ్గుతున్న ఆదరణనూ, అందుకు ప్రధాన కారణమైన ఛానెళ్ళ స్థితిగతులనూ అధ్యక్షత వహించిన ఎన్.సి. హెచ్. చక్రవర్తి వివరించారు.

తొలుత "భద్రాద్రి కలాలు" సంపాదకులు, సాహితీ స్రవంతి ఉపాధ్యక్షులు టి. దుర్గాచారి స్వాగతం పలుకగా, సాహితీ స్రవంతి అధ్యక్షులు మాల్యశ్రీ సాహితీ స్రవంతి కార్యకలాపాలను, కవితా సంకలనం ప్రచురణకు నేపథ్యాన్నీ వివరించారు.

మాగంటి సూర్యం, జి.ఎస్. శంకరరావు, డా. పి. సోమయ్య సాహితీ స్రవంతి చేస్తున్న సాహిత్య కృషిని అభినందించారు.

డా. కల్లూరి ఆనందరావు "భద్రాద్రి కలాలు" సంకలనం విపులంగా సమీక్షించారు.

ఇంకా ఈ కార్యక్రమంలో బి.ఎడ్. కళాశాల ప్రిన్సిపాల్ యం. ప్రభుదయాళ్, జడ్.పి.టి.సి. జి. ప్రభావతి, నంబూరి జీవరత్నం, వీదుల రాంబాబు, పైడిపల్లి చైతన్య, కపిల రాంకుమార్ ప్రభృతులు పాల్గొన్నారు. పెద్ద ఎత్తున కవులు, రచయితలు, సాహిత్యాభిమానులు హాజరైన ఈ సభ, లెక్చరర్ ఎస్. శ్రీనివాసకుమార్ వందన సమర్పణతో విజయవంతంగా ముగిసింది.

-మాల్యశ్రీ

## 'పర్యాయపదం' కవితావిష్కరణ



బాణాల శ్రీనివాసరావు 'పర్యాయపదం' కవితా సంకలనాన్ని ఆవిష్కరిస్తున్న ఆచార్య ఎన్. గోపి (ఎడమ నుంచి) వేణు సంకోజు, సతీష్ చందర్, నగ్నముని, బాణాల శ్రీనివాసరావు, చుక్కారామయ్య

బాణాల మిత్రుల ఆధ్వర్యంలో ఏప్రిల్ 15న బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో బాణాల శ్రీనివాసరావు రచించిన 'పర్యాపదం' కవితా సంపుటి ఆవిష్కరణ జరిగింది. ప్రముఖ కవి ఆచార్య ఎన్.గోపి పుస్తకాన్ని ఆవిష్కరిస్తూ "మానవుని అస్తిత్వమూలాలను వెతికే ప్రయత్నం, బాల్య జీవితానికి సంబంధించిన అన్ని అంశాలు పర్యాయపదం కవితా సంపుటిలో స్పష్టంగా కన్పిస్తున్నాయని అన్నారు. గౌరవ అతిథి, ప్రముఖ విద్యావేత్త చుక్కా రామయ్య మాట్లాడుతూ బాణాల కవిత్వం 'తెలంగాణకు, కులవృత్తులకు ప్రాధాన్యత ఇచ్చిందన్నారు. సీనియర్ పాత్రికేయులు కవి సతీష్ చందర్ ఆప్తవాక్యాలు పలుకుతూ 'జీవిత వేదనలను వినిపించేదే కవిత్వమన్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో మానవసంబంధాలు ధ్వంసమైపోతున్నాయని విశ్లేషించారు. గ్లోబల్ ఇనుపకౌగిళ్ళలో ఉక్కిరిబిక్కిరవుతున్న సమాజంలోని వేదనలను, వృత్తికారుల ఆవేదనలను బాణాల బలంగా వ్యక్తీకరించాడని విశ్లేషించారు. ప్రపంచీకరణకు వ్యతిరేకంగా కవులు గళమెత్తాలి' అని పిలుపునిచ్చారు. సీనియర్ జర్నలిస్ట్ కె. శ్రీనివాస్ మాట్లాడుతూ 'తెలంగాణ అస్తిత్వ పోరాటం నుంచి పొటమరించిందే పర్యాయపదమని వ్యాఖ్యానించారు. తెలంగాణ జిల్లాల్లో దుఃఖానికో, పెత్తనానికో కేంద్ర బిందువు గ్రామమని అందువల్ల ప్రాంతీయ అస్తిత్వవాదం నుంచి బాణాల కవిత్వం రాశారన్నారు. తెలంగాణ వేదిక కార్యదర్శి వేణు సంకోజు పర్యాయపదంలోని పలు వైవిధ్య కవితలు పరిచయం చేశారు. సభకు అధ్యక్షత వహించిన ప్రముఖ కవి నగ్నముని పర్యాయపదంలోని హైలెట్ కవిత 'కుంపటి'ని మొదటగా పరిచయం చేశారు. సభ ఆద్యంతం 'కుంపటి' కవితను భూమికగా చేసుకుని శ్రీనివాసరావు కవిత్వ విశ్లేషణ జరిగింది. చివరగా కవి బాణాల శ్రీనివాసరావు తన స్పందనను తెలియజేస్తూ తన నేపథ్య వేదనను, పర్యాయపదంలోని కవితను వినిపించారు.

# "బొగ్గుట్టపై సాహితీ సౌరభాలు

ఏప్రిల్ 3వ తేది ఉదయం నుండి సాయంకాలం వరకు 'బొగ్గుట్ట'గా పేరుగాంచిన ఇల్లందు పట్టణంలో సాహితీ సౌరభాలతో ప్రజలు సేద తీరారు. ఒక వైపు సూర్యుడు ప్రతాపం చూపిస్తున్నా దేహాలపై స్వేదం చిమ్ముతున్నా సాహిత్య మధనంతో వెలువడుతున్న కవితామృతాన్ని గ్రోలుతూ సాహితీ ప్రియులు ఆనందాన్ని అనుభవించారు. గతంలో ఎన్నడూ ఈ సింగరేణి ప్రాంతంలో సాహిత్య సభలు ప్రముఖుల సమక్షంలో ఇంత ఘనంగా జరగటం ఇక్కడి ప్రజలు ఎరుగరు. అందుకే సాహితీ ప్రియులు, సింగరేణి కార్మికులు, పుర ప్రముఖులు ఇల్లందులో జరిగిన సాహితీ స్రవంతి ఖమ్మం జిల్లా 6వ వార్షికోత్సవ సభను ఆత్మీయంగా ఆస్వాదించారు.

"బొగ్గుట్ట" జిల్లాలో సింగరేణి ప్రాంతం ఇక్కడ తెల్లారగానే డ్యూటా సైరన్‌మోత ఒళ్ళు విరుచుకుంటూ భూగర్భంలోకి వెళ్ళే కార్మికులు. ఒళ్ళో పులిసేలా శ్రమిస్తూ బొగ్గు పెళ్ళల్లో బ్రతుకు పోరాటం కొనసాగితే కార్మికులు నల్ల బంగారపు సిరులు. వారి కోసం వారిలో దాగిన కావితాత్మను వెలికి తీయటం కోసం ప్రత్యేకంగా సాహితీ స్రవంతి బొగ్గగనులు నేపథ్యం పై కథ, కవితల పోటీనీ జిల్లా సింగరేణి వాడలైన ఇల్లందు, కొత్తగూడెం, మణుగూర్, కోయగూడెం, ప్రాంత కార్మికులకు పోటీలు నిర్వహించింది. విశేష స్పందన లభించింది.

ఇక సాహితీ స్రవంతి 6వ వార్షికోత్సవ సాహిత్య సభ ఇల్లందులోని కె.ఎస్.ఎస్. కాంప్లెక్స్‌లో నిర్వహించబడింది. దాదాపు మూడొందల మంది సాహితీ ప్రియులు పాలొన్నారు.

ఇల్లందు జూనియర్ జడ్జి శ్రీ పి. చంద్రశేఖర ప్రసాద్ సాహిత్యకారుల ఫొటో ఎగ్జిబిషన్ ప్రారంభించారు. అనంతరం సాహితీస్రవంతి ఆహ్వాన సంఘం కార్యదర్శి కటుకోర్ఘ్వుల రమేష్ విచ్చేసిన అతిథులుకు వేదిక మీదికి స్వాగతం పలికారు.

మండవ సుబ్బారావు అధ్యక్షతన జరిగిన ఈ సభలో ముఖ్య అతిథిలుగా విచ్చేసిన ప్రముఖ కథా రచయిత కాలువ మల్లయ్య మాట్లాడుతూ ప్రస్తుతం జరుగుతున్న రచనల్లో వాస్తవికత లోపిస్తుందని వాస్తవికత, సామాజిక స్పృహలేని రచనలు ఎక్కువ కాలం మనలేవని అన్నారు. ఎలక్ట్రానిక్ మీడియా ప్రభావంవల్ల టైంపాస్ పాఠకులు తగ్గిపోయి అసలైన సీరియస్ పాఠకులు మిగిలారన్నారు. రానున్న కాలంలో జవాబు దారీతనంతో రచనలు జరగాల్సిన అవసరం ఎంతైనా వుందన్నారు. సాహిత్యం అనేది జీవితపు వృక్షానికి పూచిన పువ్వు లాంటిదని పేర్కొన్నారు.

సాహితీస్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి మాట్లాడుతూ ఖమ్మం జిల్లాలో సాహితీ స్రవంతి కృషి కొనియాడారు. సింగరేణిగనులకు నిలయమైన ఇల్లందులో కార్మికవర్గం కోసం సాహితీ స్రవంతి పోటీలు నిర్వహించి ఆహ్లాదకరంగా సభ నిర్వహించటం అభినందనీయమన్నారు. నేడు సాహిత్య అధ్యయనం బాగా పెరగాల్సి వుందని ప్రపంచీకరణను వ్యతిరేకిస్తూ రచనలు చేయాల్సి వుందని అన్నారు.

సాహితీ స్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి కె.ఆనందాచారి మాట్లాడుతూ ఖమ్మం జిల్లాలో గత ఆరు సంవత్సరాలుగా ఎన్నో కార్య క్రమాలను నిర్వహించి సాహిత్య ప్రియుల మన్ననలను పొందిందని రాష్ట్రస్థాయి సాహిత్య సదస్సులను కవితా గోష్ఠులను ఏర్పాటు చేసిందనీ, విద్యార్థులను, బాలలను, యువకులను ప్రోత్సహిస్తూ పోటీలు నిర్వహించిందని తెలిపారు.

ఇంకా ఈ సభలో సీనియర్ రచయిత రావెళ్ళ వెంకట రామారావు, జాతశ్రీ, దేవేంద్ర, మాల్యశ్రీ, డా॥ దిలావర్, భద్రకాళీ కపిల రాంకుమార్‌లు మాట్లాడుతూ ప్రతికూల పరిస్థితులను అధిగమిస్తూ సమాజంలోని రుగ్మతలను రూపుమాపేందుకు సాహితీవేత్తలు ముందుకు రావాలనీ పిలుపునిచ్చారు.

అతిథులుగా విచ్చేసిన ఇల్లందు జూనియర్ సివిల్ జడ్జి పి. చంద్రశేఖర ప్రసాద్, ఎమ్మార్వో యస్. హరినాథ్‌బాబు, సి.ఐ. సర్వర్‌పాషాలు ప్రసంగించారు. డాక్టర్ హరీష్, పొట్లూరి వెంకటేశ్వర్లు, ఈగ హనుమాన్, డాక్టర్ రూత్‌మేరి, సునంద సాదనాల వెంకట స్వామినాయుడు తదితరులు పాల్గొన్నారు.

సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ కె. ఆనందాచారి కార్యదర్శి నివేదికను ప్రవేశపెట్టగా రౌతు రవి వందన సమర్పణ చేశారు. శేషగిరి విజయలక్ష్మి ఆలపించిన గీతాలు పలువురిని అలరింపజేశాయి.

### పుస్తకావిష్కరణలు

ఇల్లందుకు చెందిన ఇందిర రచించిన 'అలవోకలు' హైకూల పుస్తకాన్ని 'ప్రస్థానం' సంపాదకులు తెలకపల్లి రవి ఆవిష్కరించి పరిచయం చేయగా, కపిల రాంకుమార్ రచించిన 'నగారా' పుస్తకాన్ని ప్రముఖ రచయిత నంది అవార్డు గ్రహీత దేవేంద్ర ఆవిష్కరించారు. చావా శివకోటి రచించిన 'కథలోయ్ కథలు' కథా సంకలనాన్ని ప్రముఖ రచయిత కాలువ మల్లయ్య ఆవిష్కరించారు.




సాహితీస్రవంతి ఖమ్మంజిల్లా ఆరవ వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తున్న ప్రముఖ కథా రచయిత కాలువ మల్లయ్య, వేదికపై న్యాయమూర్తి చంద్రశేఖర ప్రసాద్ ప్రభృతులు

### కథ, కవితల పోటీ విజేతలు

సాహితీ స్రవంతి వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని సింగరేణి బొగ్గగనుల నేపథ్యంతో నిర్వహించిన కథ కవితల పోటీల్లో విజేతలైన వారికి సాహిత్య పుస్తకాలు, మెమోంటోలు అందజేశారు. కవితల విభాగంలో ప్రథమ బహుమతి (కొత్తగూడెం), చిల్లం సామేలు (గనిలో పొలికేక), ద్వితీయ బహుమతి (కొత్తగూడెం) గుండా సురేందర్‌రావు (ప్రశ్న), తృతీయ (మణుగూర్) బొమ్మరాల్ ఎల్లయ్య (దుమ్ము), కన్సులేషన్ (ఇల్లందు) సిరికొండ రామాచారి (సింగరేణి సిరులు), ఇన్సులేషన్ (ఇల్లందు) దాసరి వెంకటేశ్వర్లు (సింగరేణికార్మికులు), కన్సులేషన్ (కొత్తగూడెం) కూరాకు వెంకటేశ్వర్లు (సింగరేణి బిడ్డలం), కన్సులేషన్ (మణుగూర్) కె. నాగేశ్వరరావు (నల్లవజ్రం)

**కథల విభాగంలో** :ప్రథమ బొమ్మరాల్ ఎల్లయ్య "వత్తిడి", ద్వితీయ జె.ఎల్‌సి జయకుమారి "చిగురు", తృతీయ ఎస్. యోగానందరాజు "కన్నతల్లి ఆవేదన", కన్సులేషన్ కుడికాల సూర్యనారాయణ "కౌన్ బనేగా కరోడ్ పతి"

### సాహితీ స్రవంతి ఖమ్మం జిల్లా కమిటీ

సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులుగా మండవ సుబ్బారావు ప్రధాన కార్యదర్శిగా కె. ఆనందాచారి, ఉపాధ్యక్షులుగా మాల్యశ్రీ, ఈగహనుమాన్, సౌదామిని కార్యదర్శులుగా కటుకోర్ఘ్వుల రమేష్, కపిల రాంకుమార్, కోశాధికారిగా సునంద నియమితులయ్యారు.

-కటుకోర్ఘ్వుల రమేష్




మేడే సందర్భంగా హైదరాబాద్‌లో ప్రసంగిస్తున్న హిమజ్వాల
వేదికపై మోతుకూరు నరహరి, తెలకపల్లి రవి.



ఏప్రిల్ 5, 2005న విజయనగరంలో బడబాగ్ని శంకరరాజు రచించిన కవితా సంపుటి "వానచూపు ఆవిష్కరణ/పరిచయ కార్యక్రమం. రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత శంకరరాజుకు సన్మాన కార్యక్రమం

## శ్రీకాకుళంలో కవిసమ్మేళనం

ఏప్రిల్ 7వ తేదీన శ్రీకాకుళ పట్టణం ప్రెస్ క్లబ్ హాల్‌లో ఉగాదిని పురస్కరించుకొని "కవితా సమ్మేళన" కార్యక్రమాన్ని నిర్వహించడంతో 'సాహితీ స్రవంతి' శ్రీకారం చుట్టింది. ముగ్గురు కవయిత్రులతోపాటు 15 మంది రచయితలు తమ కవితల్ని చదివి వినిపించారు. న్యాయనిర్ణేతలు ఉత్తమ కవితలకు బహుమతులు ప్రకటించారు. ప్రథమ బహుమతిని పి. చైతన్యకుమార్ (రాజాం)కు ద్వితీయ బహుమతిని శ్రీమతి కె. రామలక్ష్మి (శ్రీకాకుళం)కు, తృతీయ బహుమతిని శ్రీమతి యు. రత్నకుమారి (శ్రీకాకుళం) ప్రదానం చేశారు.

నల్లి ధర్మారావు అధ్యక్షోపన్యాసం చేస్తూ కవులు, రచయితలు తమ రచనల ద్వారా సమాజంలో చైతన్యం కలిగించాలని, నిస్తేజమైయున్న యువతను మేల్కొలిపే విధంగా రచనలు చేపట్టాలని అప్పుడే రచయితల యొక్క లక్ష్యం నెరవేరినట్టని ఆయన ఉద్బోధించారు. రచయిత చింతాడ రామారావు (సిరా) మాట్లాడుతూ ప్రపంచీకరణ నేపథ్యంలో సగటు మనిషి జీవన విధానంలో మార్పులు జరుగుతున్నాయని, పేదల కష్టాలను ప్రతిబింబించే విధంగా కవితలుగాని, రచనలుగాని ఉన్నపుడే కవులకు సార్థకత అని, నేడు సినిమా, టి.వి. రంగాలలో వస్తున్న మార్పులు సమాజాన్ని భ్రష్టుపట్టించే విధంగా ఉన్నాయని ఆయన విమర్శించారు. కవుల రచనల్లో సామాన్యుల కడగండ్లు కనిపించాలని, వారి ఆక్రందనలు వినిపించాలని అటువంటి మంచి కవితలే చిరస్థాయిగా నిలుస్తాయని ఆయన వివరించారు. పై కార్యక్రమంలో చివరిగా రచయిత "పురిజాల" సుధాకర్ (సరసన్నపేట) రచించిన "చిగుళ్ళు" అనే కవితా సంపుటిని రచయిత చింతాడ రామారావు ఆవిష్కరించారు. సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ టేకి ఆచారి వందన సమర్పణతో సభ ముగిసినది.

## 'సాధన' ద్వారానే మంచి సాహిత్యం

"నేటి యువకవులలో సాధన లోపిస్తుందని, సాధన ద్వారానే సమాజానికి ఉపకరించే మంచి సాహిత్యం వెలువడుతుందని" ప్రసిద్ధ సినీ కవి త్రిపురనేని మహారథి పేర్కొన్నారు. ఆదివారం ఉదయం స్థానిక ప్రజాశక్తి నగర్‌లోని చంద్రరాజేశ్వర్రావు స్మారక గ్రంథాలయంలో 'రమ్యభారతి' సాహిత్య త్రైమాసపత్రిక ఆధ్వర్యంలో జయంతి పబ్లికేషన్స్ వారు ప్రచురించిన "కవితా మాలిక - 2004" పుస్తకావిష్కరణ సభలో మహారథి పుస్తకావిష్కరణ చేసిన అనంతరం ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. "మంచి కవిత్వం వెలువడాలంటే మంచి భాషా పటుత్వం అవసరమని, కాని నేడు తెలుగు భాష అన్ని రకాలుగా పతానావస్థలో వుందన్నారు. ముందు దాని పునాదులను పటిష్టపర్చాల్సిన అవసరం ప్రధానంగా అందరిపై వుందని" చెప్పారు. అరసం జిల్లా కార్యదర్శి ముత్యాల ప్రసాద్ పుస్తక సమీక్ష చేస్తూ "సమాజానికి, సాహిత్యానికి విడదీయరాని సంబంధం వుందని, కవి సామాజిక జీవిగా ఆలోచించి తన రచనలు కొనసాగించాలన్నారు. అటువంటి రచనలే సమాజాన్ని ప్రభావితం చేయగలుగుతాయని ఈ 'కవితామాలిక' 2004లో అటువంటి మంచి కవితలు కొన్ని కన్పిస్తాయన్నారు. ప్రముఖ కవి సోమేపల్లి వెంకట సుబ్బయ్య ప్రసంగిస్తూ "సమకాలిన సంఘటనలు, సంఘర్షణలు ఈ కవితా మాలికలో ప్రతిబింబిస్తాయని ఈ కవితామాలిక ద్వారా కొత్తకవులకు స్ఫూర్తినిస్తుందన్నారు. ప్రచురించిన ప్రచురణకర్తను ఈ సందర్భంగా అభినందించారు. యువకవి చలపాక ప్రకాష్ నిర్వహణలో జరిగిన ఈ సభలో రమ్యభారతి గౌరవ సంపాదకులు వేముల హజరత్తయ్యగుప్త, వ్యంగ్యకవి పొన్నూరు వెంకట శ్రీనివాసులు, ఎస్వీకృష్ణ తదితరులు ప్రసంగించారు. తొలుత బి. ఆంజనేయ రాజు స్వాగత వచనాలతో ప్రారంభమైన ఈ సభ అరసవిల్లి కృష్ణవందన సమర్పణతో ముగిసింది.



## స్వామికి కలైమామణి అవార్డు

పాండిచ్చేరి ప్రభుత్వం సాంస్కృతిక శాఖ యానాంకు చెందిన పిఆర్ఎల్ స్వామికి 2004 సంవత్సరానికి సంబంధించి "కలైమామణి" అవార్డును ప్రకటించింది. ఈ పురస్కారానికి సంబంధించి స్వామికి జూన్‌లో జరుగు ప్రభుత్వ కార్యక్రమంలో 10,000/- రూపాయలు నగదు, ఒక కాసు బంగారు పతకం బహూకరించారు

స్వామి 'పొత్తిళ్ళలోంచి" అనే స్వీయ వచన కవితా సంకలనం ప్రచురించారు. తెలుగు సాహిత్య చరిత్రలో ఇంత వరకూ లేని "వచన కవిత్వధారణ" అనే నూతన సాహితీ ప్రక్రియకు శ్రీకారం చుట్టి అనేక జిల్లాల్లోనూ, దేశరాజధాని న్యూఢిల్లీలోనూ ప్రదర్శనలు ఇచ్చి సాహితీవేత్తలు, ప్రముఖ కవులు మన్ననలు పొందారు.

## శత వసంతాల సాహితీ సమాలోచన

కరీంనగర్ జిల్లా ఈ శతవసంతాల సందర్భంగా సాహితీ గౌతమి ఆధ్వర్యంలో మే 1న జిల్లా కథా రచయితల సదస్సు నిర్వహించింది.

తెలంగాణా తొలితరం కథకుడు గూడూరి సీతారాం జ్యోతి ప్రజ్వలన చేసి సమావేశాన్ని ప్రారంభించారు. ఈ సమావేశానికి అధ్యక్షులుగా ప్రఖ్యాత కథకులు తుమ్మేటి రఘోత్తమరెడ్డిగారు వ్యవహరించారు. ప్రధాన ప్రసంగం చేసిన ప్రముఖ కథకులు అల్లం రాజయ్య ఆనాటి తమ కథల నేపథ్యాన్ని వివరించారు. శతవసంతాల సాహితీ సదస్సు ఔచిత్యాన్ని సాహితీ గౌతమి అధ్యక్షులు డా॥ లక్ష్మణరావు తెలిపారు.

రెండవ సమావేశానికి అధ్యక్షులుగా ప్రముఖ కవి, కథకులు జూకంటి జగన్నాథం వ్యవహరించారు. ఈ సెషన్‌లో తెలంగాణా కథ-2004 పుస్తకావిష్కరణ జరిగింది. వర్తమాన కథకుడు బి.వి. యస్. స్వామి పుస్తక సమీక్ష చేయగా, పుస్తక ప్రాధాన్యత గురించి పుస్తక సంపాదకులు కర్ర ఎల్లారెడ్డి మాట్లాడారు. తరువాత 1970కి పూర్వం కథ సాహిత్యం గురించి అధికార భాషా సంఘం సభ్యులు, ప్రముఖ కథకులు డా॥ కాలువ మల్లయ్య ప్రసంగించారు.

భోజన విరామం తరువాత సమావేశానికి సమాంతర సినీ దర్శకులు వారాల ఆనంద్ అధ్యక్షత వహించారు. ప్రముఖ అనువాదకులు డా॥ నలిమెల భాస్కర్ 1970 తర్వాతి కథా సాహిత్యాన్ని వివరించగా, డా॥ గోపులింగారెడ్డి కథా విశిష్టతను తెలిపారు.

నాలుగవ సెషన్‌కు ప్రముఖ పరిశోధకులు డా॥ సంగబట్ల నర్సయ్య అధ్యక్షత వహించగా ప్రముఖ కథకుడు, తత్వవేత్త బి.యస్. రాములు నాటి నుండి నేటి వరకు కథా సాహిత్యంలో వచ్చిన ధోరణులను విపులంగా తెలియజేశారు.

చివరి సమావేశంలో గంగ్రద హన్మంతరావు స్మారక అవార్డు ప్రముఖ కథకులు పెద్దింటి అశోక్‌కుమార్‌కు అందజేశారు. రాష్ట్ర వైద్య విధాన పరిషత్ సభ్యులుగా నియమించబడ్డ సౌజన్యశీలి, డా॥ సి. నారాయణరెడ్డి కవితా పురస్కార్ అవార్డు కన్వీనర్ అయిన డా. విజయేందర్ రెడ్డి, కాకతీయ విశ్వవిద్యాలయం వారిచే డాక్టరేట్ పొందిన విశ్వబంధు బోయినిపెల్లి వెంకట్రామారావు, అధికార భాషా సంఘం సభ్యులుగా నియమితులైన డా॥ కాలువ మల్లయ్యలకు ప్రముఖులచే ఘనంగా సన్మానాలు జరిగాయి.




ప్రసంగిస్తున్న కాలువ మల్లయ్య. వేదికపై కర్ర ఎల్లారెడ్డి, జూకంటి జగన్నాథం, బి.వి.యస్. స్వామి

ఈ సెషన్స్‌కు సమావేశకర్తలుగా అనంతాచార్య, వేణుశ్రీ, వినోద్, దేవేందర్, లక్ష్మయ్య వ్యవహరించారు.

ప్రముఖులు వంజాల జగన్నాథం, శ్యామల అయోధ్యరామారావు, విజయనరసింహారావు, గోపాల్, శర్మ తదితర పెద్దలు భారీ సంఖ్యలో హాజరయ్యారు. - బి.వి.యస్. స్వామి

## కర్నూలులో శ్రీశ్రీ 22వ వర్ధంతి సభ

శ్రీశ్రీ 22వ వర్ధంతి సభ జూన్ 15 సాయంత్రం కర్నూలు కోల్సు కళాశాల ఆవరణలో జరిగింది. సాహితీస్రవంతి జిల్లా కో-కన్వీనర్ కెంగార మోహన్ అధ్యక్షత వహించగా, ఆకాశవాణి కర్నూలు రేడియో స్టేషన్ ప్రయోక్త డా.వి. పోతన, ఉస్మానియా కళాశాల రిటైర్డ్ ఆంగ్లభాషోపన్యాసకులు మేజర్ శర్మ, సాహితీస్రవంతి జిల్లా కన్వీనర్ బసవరాజు ప్రసంగించారు. డా. వి.పోతన మాట్లాడుతూ ఆధునిక తెలుగు సాహితీ యుగానికి శ్రీశ్రీ వైతాళికుడయ్యాడన్నారు. భావకవిగా ప్రజాజీవితాన్ని ప్రారంభించి, అభ్యుదయ కవిగా ఎదిగి, విప్లవకవిగా రూపాంతరం చెంది యుగకవిగా, మహాకవిగా, సాహిత్యాభిమానుల్లో సాహితీవేత్తల్లో, గుర్తింపు పొందారన్నారు. కర్షకుల, కార్మికుల అభ్యుదయం కోసం కలం పట్టిన మహోన్నత వ్యక్తిత్వం శ్రీశ్రీ దన్నారు. నేను సైతం తెల్లరేకై వల్లవిస్తానని చెప్పడం ద్వారా ప్రపంచ శాంతిని కాంక్షించాడన్నారు. అంతకు ముందు ప్రొ. మేజర్ శర్మ మాట్లాడుతూ శ్రీశ్రీ సామాన్య మానవుని ప్రస్థానాన్ని మహాప్రస్థానంగా రూపొందించారన్నారు. ప్రపంచ బాధనంతా తన బాధగా మార్చుకొని ఆనాడే క్యాపిటలిస్ట్ ప్రపంచానికి హెచ్చరికలు జారీ చేశాడన్నారు. అనంతరం 'సినీ సాహిత్యంలో శ్రీశ్రీ' అన్న అంశంపై బసవరాజు మాట్లాడారు. శ్రీశ్రీ రాసిన సినిమా పాటలు నేటికీ చెరగని ముద్ర వేశాయన్నారు. శ్రీశ్రీ పాటలను సభలో ఆయన పాడుతుండగా హర్షధ్వానాలు చేశారు. సభలో పాల్గొన్న పలువురు శ్రీశ్రీపై, శ్రీశ్రీ రచనలపై ఉన్న సందేహాలను వక్తలనడిగి తెలుసుకున్నారు. కొంత మంది సభలో మహాప్రస్థానం కవితలను చదివి వినిపించారు. సభను లెక్చరర్ నిసార్ అహమ్మద్ ప్రారంభించగా, గాయకులు సుబ్బన్న తన పాటలతో ఆకట్టుకున్నారు. - కెంగార మోహన్




సభలో ప్రసంగిస్తున్న కర్నూలు రేడియో స్టేషన్ ప్రయోక్త డా॥ వి. పోతన వేదికపై ప్రొ. శర్మ, మోహన్, బసవరాజ్

## 'పొగచూరిన ఆకాశం' ఆవిష్కరణ




ప్రసిద్ధ విమర్శకుడు, కవి అద్దేపల్లి రామమోహనరావు 'పొగచూరిన ఆకాశం' కవితాసంపుటాన్ని జూన్ 11న హైదరాబాద్‌లో నోముల సత్యనారాయణ ఆవిష్కరించారు. ద్వానా శాస్త్రి అధ్యక్షత వహించారు. తెలకపల్లి రవి, హిమజ్వాల, గుడిపాటి ప్రసంగించారు.




కె.జె. రమేష్ రచించన "పాయలు" నానీల సంపుటిని ప్రముఖ కవి సోమేపల్లి వెంకట సుబ్బయ్య వినుకొండలో ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో కవి కె.జె. రమేష్, డాక్టర్ బీరం సుందరరావు స్థానిక వైద్యులు గోపు చిన్నపరెడ్డి, ఆర్. కామేశ్వర శర్మ వున్నారు

## 'యుద్ధం' ఆవిష్కరణ

వరంగల్లులో ఈ మధ్య మహమ్మద్ సిరాజుద్దీన్ 'యుద్ధం' కావ్య ఆవిష్కరణ జరిగింది. ముఖ్య అతిథిగా డా॥ అద్దేపల్లి రామ్మోహన్‌రావు మాట్లాడుతూ "ప్రపంచంలోని అన్ని రంగాల్లోనూ రాజ్యమేలుతున్న అశాంతిపై, శాంతి ప్రకటించిన బ్రహ్మాండమైన విశ్వయుద్ధమిది" అన్నారు.

కావ్యాన్ని ఆవిష్కరించిన కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, డా॥ అంపశయ్య నవీన్, "ఒక గొప్ప శాంతి కాముకుడు రచించిన మహా గొప్ప సాహితీ యుద్ధం ఇది" అన్నారు.

ప్రొ. ఎస్. లక్ష్మణమూర్తి మాట్లాడుతూ, "మనిషిలో ఎంతో మంచితనం ఉంటే తప్ప ఇలాంటి కావ్యాలు సాధ్యపడవు. ఈ యుద్ధం సాహితీ ప్రపంచంలో నిలుస్తుంది" అన్నారు. అష్టావధాని డా॥ ఇందారపు కిషన్‌రావు అధ్యక్షతన జరిగిన ఈ యుద్ధ కావ్యాన్ని డా॥ బన్న అయిలయ్య ఎన్నో ఉదాహరణలో పరిచయం చేశారు.

– ఎం. సిరాజొద్దీన్




రచయిత సిరాజొద్దీన్, డా॥ యిన్న అయిలయ్య, ప్రొ. లక్ష్మణమూర్తి, డా॥ ఇందారపు కిషన్‌రావు, డా॥ అద్దేపల్లి, డా॥ అంపశయ్య నవీన్, డా॥ సురేందర్ రెడ్డి

## విస్తృత కార్యక్రమాలు!

ప్రస్థానం డైరీలో వివిధ రకాలైన సాహిత్య కార్యక్రమాలను పొందుపరచడంలో స్థలాభావం సమస్యగా మారుతున్నది. సాహితీ స్రవంతి తరఫున, ఇతర సాహితీ మిత్రుల తరపున జరిగే కార్యక్రమాలలో రాసిపంపిన వాటిని మాత్రమే ఈ శీర్షికలో ప్రచురించగలమని లోగడ తెలియజేశాము. ఇటీవల కాలంలో పుస్తకావిష్కరణలు, స్థానిక సాహిత్య కార్యక్రమాలకు సంబంధించి అనేక వార్తలు అందుతున్నాయి. వాటిని క్లుప్తంగా మాత్రమే ఇవ్వగలం. సాహిత్యంతో సంబంధం లేని వాటిని పంపవద్దని మనవి.

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఈ మూడు మాసాల కాలంలో మేడే నాడు కవి సమ్మేళనాలు, గోష్ఠులు విస్తృతంగా జరిగాయి. అలాగే జూన్ మూడవ వారంలో శ్రీశ్రీ వర్ధంతి సభలు పలుచోట్ల జరిగాయి. ఏలూరులో జ్వాలాముఖి, మహబూబ్‌నగర్‌లో అద్దేపల్లి, హైదరాబాదులో హిమజ్వాల, నరహరి, ఖమ్మంలో మాడభూషి హర్షవర్ధన్ తదితరులు సభల్లో ప్రసంగించారు. విజయనగరంలో ఏప్రిల్14న అంబేద్కర్ జయంతి రోజున దళిత సాహిత్యంపై శిఖామణి ప్రసంగించారు. ఇంకా వివిధ జిల్లాల్లో వైవిధ్య భరితమైన సాహిత్య కార్యక్రమాలు జరిగినట్టు సమాచారం. సాహితీ మిత్రులు కార్యక్రమాలతో పాటు తము అనుసరించుతున్న పద్ధతులను అనుభవాలను కూడా తెల్పితే ఇతర చోట్ల వారికి ఉపయోగంగా వుంటుంది.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20.
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravindranath.**

# కర్నూలు సాహిత్యశాల - పత్రికల స్పందన

ఆదివారం 29 మే 2005 ఈనాడు కర్నూలు 7

## వెల్లివిరిసిన సాహితీసుమ సౌరభాలు

కర్నూలు, మే 28 (న్యూస్‌టుడే): అక్కడ సాహిత్య సుమసౌరభాలు వెల్లివిరిసాయి. సాహితీ ప్రియులపై అమృత జల్లులు వర్షించాయి...

## సాహిత్య సృజనలో మథనం జరగాలి : తెలకపల్లి రవి

సోమవారం 30 మే 2005 ఈనాడు కర్నూలు

## మానవ సంబంధాలను నిలబెట్టేదే సాహిత్యం

## ప్రపంచీకరణపై అక్షరాస్త్రం సంధించండి

సాహిత్యశాలలో వక్తల పిలుపు

## సాహిత్యం ప్రపంచీకరణ వ్యతిరేకోద్యమాన్ని నిర్మించాలి : అద్దేపల్లి

## జీవిత వాస్తవాలే ఉత్తమ సాహిత్యానికి మూలం

సాహిత్యశాల సదస్సులో వక్తలు

కర్నూలు, మే 28

సోమవారం 30 మే 2005 కర్నూలు ఆంధ్రప్రభ

## నిబద్ధతతోనే రచయిత మాటలకు విలువ: కవి సుధామ

## సృజనతోపాటు సాహిత్యం ప్రచారం కావాలి : రాచపాలెం



## పెనుముప్పును తప్పిద్దాం

## Budding writers asked to strive for perfection

## 2-day literary meet begins

## కవులు ప్రపంచీకరణపై పోరాడాలి

## హీరో,హీరోయిన్లు నిర్మాతల చేతుల్లో కీలుబొమ్మలు

'ముఖాముఖి'లో ఓల్గా

కర్నూలు కల్చరల్, మే 28 (న్యూస్‌టుడే): సినిమా రంగంపై నల్లధనం ప్రభావం ఉండడంతో సినీ హీరోయిన్లు నిర్మాతల చేతుల్లో కీలుబొమ్మలుగా మారినట్లు ప్రముఖ రచయిత్రి...

12 కర్నూలు ఆంధ్రప్రభ ఆదివారం 29 మే 2005

## ప్రస్తుత సమాజంలో మనిషి వస్తువుగా మారుతున్నాడు

## 'సాహిత్యశాల'లో కవుల ఆవేదన

## సాహిత్యానికి సామాజిక దృక్పథమే ప్రధానం

### కవులు, రచయితల వర్క్‌షాపులో రాచపాళెం

ఆంధ్రభూమిబ్యూరో

కర్నూలు, మే 28: ప్రజాపక్షం వహించని సామాజిక దృక్పథం, నిబద్ధత లేని కవితలు, కథలు, రచనలు సాహిత్య రంగంలో నిలువలేవని ప్రముఖ రచయిత డాక్టర్ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి అన్నారు. నిబద్ధత, దృక్పథం లేకుండా చేసే రచనలు సాహితీ రంగంలో అశాస్త్రీయ రచనలుగానే మిగిలిపోతాయని ఆయన అభిప్రాయపడ్డారు. స్థానిక జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో రెండు రోజుల పాటు నిర్వహిస్తున్న రాష్ట్ర స్థాయి కవులు, రచయితల వర్క్‌షాపు శనివారం ఉదయం ప్రారంభమైంది. ప్రముఖ కవి కె.శివారెడ్డి అధ్యక్షతన ప్రారంభమైన ఈ సభలో ప్రధాన ప్రసంగం చేసిన రాచపాళెం చంద్రశేఖరరెడ్డి సాహితీ రంగంలో వస్తున్న మార్పులు, సృజనాత్మకతకు ఉన్న ప్రాధాన్యత, ప్రాచీన, ఆధునిక సాహిత్యం తదితర విషయాలపై సుదీర్ఘంగా మాట్లాడారు. కొత్తగా వస్తున్న రచయితలకు ఈ వర్క్‌షాపు ఒక దృక్పథాన్ని, నిబద్ధతను సూచిస్తుందని అన్నారు. తెలుగు విశ్వవిద్యాలయం కంటే సాహిత్య అకాడమిని కొనసాగిస్తే సాహిత్య రంగానికి మేలు జరుగుతుందని అభిప్రాయపడ్డారు. [illegible]

(మిగతా 10వ పేజీలో)

రాష్ట్రస్థాయి కవులు, రచయితల వర్క్‌షాపులో ప్రసంగిస్తున్న ప్రముఖ కవి కె.శివారెడ్డి, వేదికపై రాచపాళెం, జ్వాలాముఖి, తెలకపల్లి రవి తదితరులు

65

## ఉపాధ్యాయులు, తల్లితండ్రులు చదువవలసిన పుస్తకాల జాబితా

| క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| 1. | పిల్లలు నేర్చుకోవడంలో ఎలా వెనకబడతారు? | 60.00 |
| 2. | పిల్లలు ఎలా నేర్చుకుంటారు | 60.00 |
| 3. | టీచర్ | 40.00 |
| 4. | విముక్తి-విద్య | 40.00 |
| 5. | టీచర్లకు ఉత్తరం | 40.00 |
| 6. | మాస్టారూ...! | 10.00 |
| 7. | మీ ఒడిలో | 10.00 |
| 8. | కథలే పాఠాలు | 25.00 |
| 9. | బోధన-శోధన | 30.00 |
| 10. | విభిన్న విద్యా సంస్థలు | 25.00 |
| 11. | భాష-భావం | 20.00 |
| 12. | మీరు - మీ పిల్లలు | 15.00 |

| క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| 13. | నల్లబల్ల వెనుక | 25.00 |
| 14. | చదువు సంధ్యలు | 25.00 |
| 15. | మహోజ్వల స్మృతులు | 35.00 |
| 16. | మనిషి కథ | 40.00 |
| 17. | చార్లీచాప్లిన్ | 25.00 |
| 18. | పరిణామక్రమంలో విద్యా వ్యవస్థ 1833-2003 | 15.00 |
| 19. | వేదభూమి | 10.00 |
| 20. | సమాజం-సైన్స్- సంప్రదాయం | 15.00 |
| 21. | సైన్సు చరిత్రలో సామాజికాంశాలు | 10.00 |
| 22. | పిల్లల అలవాట్లు | 25.00 |
| 23. | భారతదేశ చరిత్ర | 25.00 |
| 24 | పిల్లల భాష - ఉపాధ్యాయుడు | 25.00 |

## పిల్లలు చదివే పుస్తకాల జాబితా

| క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| 1. | మహావిశ్వం మన భూమి | 20.00 |
| 2. | ఆదర్శబాల్యం | 25.00 |
| 3. | విలియం షేక్స్పియర్ | 15.00 |
| 4. | హైడీ | 20.00 |
| 5. | విశ్వవిఖ్యాత శాస్త్రజ్ఞులు | 15.00 |
| 6. | విదేశీ కథలు | 15.00 |
| 7. | విజ్ఞాన శిఖరాలు | 15.00 |
| 8. | చైనా నీతి కథలు | 15.00 |
| 9. | భారతీయ శాస్త్రవేత్తలు | 15.00 |
| 10. | అందాల పార్కు | 15.00 |
| 11. | పిల్లల గణితం | 15.00 |
| 12. | పిల్లలు-పిడుగులు | 20.00 |
| 13. | సరదా సరదా చదువులు | 15.00 |
| 14. | తరగతిలో తమాషాలు | 15.00 |
| 15. | వానరుడు - నరావతరణ | 25.00 |
| 16. | చదువంటే మూడోకన్ను | 25.00 |
| 17. | పాడరా ఓ తెలుగువాడా | 15.00 |
| 18. | పిల్లల సంరక్షణ | 25.00 |
| 19. | అక్షరాలతో ఆటలు | 30.00 |
| 20. | నేర్చుకోడం మాకిష్టం | 20.00 |
| 21. | కథలంటే మాకిష్టం | 40.00 |
| 22. | ఆటలంటే మాకిష్టం | 30.00 |
| 23. | పాటలంటే మాకిష్టం | 20.00 |
| 24. | పాడుకొందాం | 25.00 |
| 25. | తేటతెలుగు-1 | 30.00 |
| 26. | తేటతెలుగు-2 | 30.00 |
| 27. | కొత్తబ్యాగ్ | 10.00 |
| 28. | బొటనవేలితోబొమ్మలు | 10.00 |
| 29. | పొడుపుకథలు-చింగ్‌చదువు | 15.00 |
| 30. | డంభాలమారి డాన్ క్విక్సాట్ | 25.00 |
| 31. | గణితసూత్రదీపిక | 20.00 |
| 32. | జంతువుల వింతభాష | 10.00 |
| 33. | జంతువుల వింతరుచులు | 10.00 |

| క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| 34. | మూడు కథలు | 10.00 |
| 35. | నత్తగుల్ల స్వార్థం-బంగారుచేపగర్వం | 15.00 |
| 36. | అద్భుతాలనియం-నీరు | 10.00 |
| 37. | నేయా | 10.00 |
| 38. | బద్ధకం వదిలింది | 15.00 |
| 39. | బుడిబుడికథలు | 40.00 |
| 40. | పిల్లల ప్రశ్న-సైన్స్ జవాబు | 15.00 |
| 41. | మేమొచ్చేశాం | 20.00 |
| 42. | నిర్జీవం-జీవపరిణామం | 30.00 |
| 43. | సరదాసరదా లెక్కలు | 30.00 |
| 44. | విశ్వం-విజ్ఞానం | 25.00 |
| 45. | ప్రకృతిలో అద్భుతాలు-విజ్ఞానవిశేషాలు | 45.00 |
| 46. | కాలిక్యులేటర్ గేమ్స్ | 20.00 |
| 47. | అలెగ్జాండర్ గ్రాహంబెల్ | 10.00 |
| 48. | మేకపిల్ల మెడగంట-చిట్టెలుక కృతజ్ఞత | 15.00 |
| 49. | మంచిగా వుందాం | 30.00 |
| 50. | భలేకథలు | 10.00 |
| 51. | తోకతెగిన తోడేలు | 15.00 |
| 52. | బల్బు వెలిగింది | 20.00 |
| 53. | రవీంద్రనాథ్ ఠాగూర్ | 15.00 |
| 54. | వినయంలేని వీరుడు | 25.00 |
| 55. | బండి నుంచి మోటారుకు | 20.00 |
| 56. | చెట్టు | 15.00 |
| 57. | చిటపట చినుకులు | 20.00 |
| 58. | చిట్టిరాకుమారి-చందమామ | 10.00 |
| 59. | గుడ్డు నుంచి పిల్ల | 20.00 |
| 60. | కుకూ భూరీల కథ | 20.00 |
| 61. | మన కథ | 20.00 |
| 62. | నడిచేటి నావకథ | 20.00 |
| 63. | రహస్యం | 10.00 |
| 64. | ఎద్దు | 20.00 |
| 65. | మనమూ రాద్దామా? | 10.00 |
| 66. | బుచ్చిబాబు-బొమ్మకారు | 15.00 |

| క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| 67. | యముని దర్బారు | 10.00 |
| 68. | బంగారు జింక | 15.00 |
| 69. | మూడు ఏనుగులు | 15.00 |
| 70. | బోబక్ నేర్పిన పాఠం | 15.00 |
| 71. | పులి-తాబేలు | 10.00 |
| 72. | పింకి-పిల్లి | 10.00 |
| 73. | సైన్యాధిపతి గర్వభంగం | 15.00 |
| 74. | కుడి-ఎడమ | 10.00 |
| 75. | నాతప్పేమిటో! | 15.00 |
| 76. | నందువంట-నేస్తంతంటా | 10.00 |
| 77. | వంశీధర్ నిజాయితీ | 10.00 |
| 78. | జమిందారు వేట | 10.00 |
| 79. | అద్దంలో సింహం | 15.00 |
| 80. | సముద్ర నేస్తాలు | 15.00 |
| 81. | కప్పకల | 15.00 |
| 82. | కథలంటే మాకిష్టం-1 | 25.00 |
| 83. | కథలంటే మాకిష్టం-2 | 25.00 |
| 84. | రాబిన్‌సన్‌క్రూసో | 45.00 |
| 85. | నల్లగుర్రం | 25.00 |
| 86. | పెన్సిల్‌బాక్స్ | 15.00 |
| 87. | మంచి అమ్మ | 15.00 |
| 88. | కోతి ఫొటో | 25.00 |
| 89. | కథ కాని కథ | 15.00 |
| 90. | లోకంచుట్టిన వీరుడు | 40.00 |
| 91. | చివరి ఆకు | 10.00 |
| 92. | పెద్దల మాయం-పిల్లలరాజ్యం | 20.00 |
| 93. | నెలవంక | 25.00 |
| 94. | సాయపడే చేతులు | 20.00 |
| 95. | నీళ్ళు ఎందుకు తడిగాఉంటాయి? | 15.00 |
| 96. | బడి-బ్రతుకు | 25.00 |
| 97. | హిరోషిమా అగ్నిజ్వాలలు | 25.00 |
| 98. | సిసింద్రీలు | 20.00 |
| 99. | అద్దాలతో ఆటలు | 15.00 |

# ప్రజాశక్తి బుక్‌హౌస్

66

1-1-187/1/2, చిక్కడపల్లి, హైదరాబాద్-20. ఫోన్ : 27660013

గమనిక : పై పుస్తకాలు స్కూలు గ్రాంటు నుండి కాని, టీచర్ గ్రాంటు నుండి కానీ మీ స్కూలుకు కొనుగోలు చేసుకోవచ్చును. ప్రజాశక్తి బుక్‌హౌస్, హైదరాబాద్ పేరిట డి.డి./ఎం.ఓ. తీసి పంపవలెను.



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVIMO2A116 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M-Lavanya |
| పేజీలు విడదీసినది | M-Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |